శ్రీ

# నవకుసుమాంజలి

గ్రంథకర్త


జనమంచి - వేంకటరామయ్య

రాజమహేంద్రవరము

మ్యునిసిపల్ హైస్కూలు సహాయోపాధ్యాయుఁడు





మొదటికూర్పు 1000 ప్రతులు

అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే

సరస్వతీ పవర్ ప్రెస్ నందు

ముద్రితము

1927




[వెల రు 1—4—0

TO

MY BELOVED SON

EVER

THE DELIGHT OF MY SOUL



# J. Brahmanandam

**B. A. & B, Ed. (TRAINED)**

Born 1—5—1907 Died 7—3—1927

*"O child of Paradise,*
*Boy who made dear his father's home,*
*In whose deep eyes*
*Men read the welfare of the times to come,*
*I am too much bereft.*
*The world dishonoured thou hast left.*
*O truth's and nature's costly lie!*
*O trusted broken prophecy!*
*O richest fortune sourly crossed!*
*Born for the future, to the future lost!"*

[*Emerson*]

# మిత్రస్మృతి.

[బి. యి. డి. విద్యార్థులు, రాజమండ్రి.]

క. బ్రహ్మానందముపగిదిఁ
బ్రహ్మానందుండు హృదయవర్తనుఁడయ్యెఁ
బ్రహ్మానుజ్ఞను గైకొని
బ్రహ్మాలయమైన మోక్షపదవిఁ గనుటఁ. ౧

ఉ. కన్నులఁగట్టినట్లు పొడగట్టెడి నీసుకుమారరూప మా
కన్నులసోయగంబు, కనకంబు హసించుశరీర మక్కటా!
క్రన్ననమాకు నీ నగుమొగంబు గనుంగొను భాగధేయ మిం
కెన్నటికిఁ లభింపదు, లభింపదుగా, ధరణీతలంబునఁ. ౨

చ. అతివినయంబు, ప్రాజ్ఞతయు, నందము, చందము, సద్వివేకముఁ
జతురతయుఁ, జమత్కృతియు, శాంతియు, నీకొనగూర్చి యొక్కచో
యతుకొనరించె, బ్రహ్మ అకటా! అచిరాయువొసంగి, నీయెడఁ
బ్రతుకనిబిడ్డ బారె' డనువాక్యము సార్థకమయ్యె నీయెడఁ. ౩

చ. వయసున పిన్నవయ్యు గుణవంతుఁడవౌటను మాకు పెద్దవే
యయితివి, అంతెకాక జలజాసను కంటికిగూడ పెద్దవే
యయితివి, దానసంజనితమయ్యె నకాలపుమృత్యు వక్కటా!
దయ యొకయించు కేనికలదా! కలదా! విధనెమ్మనంబునఁ. ౪

చ. వరసుగుణంబులెల్ల నెడబాయక నీయెడనుంటచేత నం
దరముద్వదీయమైత్రినిగనం దమకించితి మింతలోపలఁ
యిరువదియేండ్లకైడె స్మరణీయుఁడవౌట దటస్థమయ్యె, ని
న్మరువగలేము, మార సుకుమార! కుమార! సుహృన్మనోహరా! ౫

సీ. బ్రహ్మయువందు మాబ్రహ్మంబని తలంచు
తల్లిదండ్రులకోర్కె తగులబెట్టి
కడుప్రయోజకుడు గాగలడీతడనియెంచు
గురువులయూహల గొరతబెట్టి

ఆనందుఁ డేనాకు ఆనందమనినమ్మి
పాత్రుని * హృదయంబు పగులఁగొట్టి
తలమానికము మాకితండంచు మదినెంచు
నెమ్మికాంద్రకు విషాదమ్మొసార్చి

గీ. అలజయంతలతాంతా యుధానసాఖ్య
విధువిధుంతుదుఁడవగుచు విధివశమ్మొ
చేత నతిబాల్యమున నీవు జేరినావె
భవహరంబగు సురపతిపట్టణంబు. ౬

సీ. మిసమిసలాడు నీమేనిసౌభాగ్యంబు
వీతి హోత్రునిపాట్ల బెట్టవలెనె ?
ఆనందమున కాశ్రయంబైన నీమోము
చేతులారఁగ జిచ్చు జేర్పవలెనె ?
అక్షర్ణవిశ్రాంతమైన నీకన్దోయి
పావకజ్వాల జేర్పఁగవలెనె ?
ఉత్తమో త్తమమైన యుష్మద్గుణంబులు
భస్మహవ్యంబులై పరగవలెనె ?

గీ. కటకటా ! కాలకర్మయోగంబుచేత
నెట్టికష్టంబులైన బ్రాప్తించుచుండు
కాలగతి నెవ్వరడ్డగాఁగలరు, కంచె
చేనుమేసిన కాపేమి చేయఁగలఁడు. ౭

సీ. చదువగాఁదగు విశేషము లిందులేవంచు
జనినావె శారదాసదనమునకు
కలికాలమున నుండఁగా జెల్లదనియెంచి
పోయినాఁడవె సత్యభువనమునకు
ఆదిదంపతుల పాదార్చనం బొనరింప
జనినావె కైలాస శైలమునకు
మిత్రునితోఁడిచెల్మి గణింపమదినెంచి
వెడలితే దిననాథుబింబమునకు

---

* ఈయన పర్లాకిమిడి వాస్తవ్యుఁడగు శ్రీయుత కృష్ణచంద్రపాత్రుఁడు, బి. ఏ, బి. యి. డి (Trained); నాపుత్రుని ప్రాణమిత్రుఁడు.

గీ. ఎటకుజనినావొ మాకేమియెరుగనగును
ప్రియులవిడనాడి యొంటిగా వెడలుకేటి
సరస, మిదిజూడ మిత్రలక్షణముకాదు
కాదుకాదంచు చెప్పగాగలము మేము. ౯

గీ. కొలదిమాసములే నీవు చెలిమిగనిన
వారికే దుఃఖమిట్టు లవార్యమైన
గన్న తలిదండ్రు లెంతటి కడుపుమంట
నంపుచుందురొ యూహింపనలవికాదు. ౯

క. శాంతించుత నీయాత్మయు
శాంతించుత నీదుగురుల సంతాపమ్ముల్
శాంతించుత నీ మిత్రుల
యంతశ్శోకంబు సరసిజాక్షునికరుణన్. ౧౦

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



శ్రీరస్తు

# విజ్ఞాపనము

---

నేను నా మొదటి కృతియైన మాలతీమాధవమును ఇప్పటి కిరువదియై దేండ్లక్రిందట రచించి ప్రచురించినాఁడను. అది పండితజనాదరణ పాత్రమైయుండుటచే సర్వకళాశాలాధ్యక్షులు దానిని (1906 బి. ఏ) పట్టపరీక్షకు పఠనీయగ్రంథముగా నిర్ణయించిరి. అందువల్లఁ గొంత నూతనోత్సాహమును బొందినవాఁడనై ఆసంవత్సరమే విద్ధసాలభంజికయను మఱియొక నాటికను గూడఁ దెలిఁగించి దానిని నా ప్రియమిత్రులు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి మనోరమా పత్రికలోఁ బ్రచురించితిని. ఆవెనుక ఉత్తరరామచరిత్రమును దెనిఁగింప నారంభించి కొంతవఱకు రచించితినిగాని నాకప్పటి కాంధ్రీకరణము నందొక విధమైన యరుచి జనించుటచే దాని నంతటితో నాపివేసితిని. నాకు స్వాభావికముగా గ్రంథరచనము కంటె గ్రంథపఠనమందే యెక్కువ ఆసక్తి యగుటచేతను, స్వతంత్రరచనమందు విశేషప్రయత్నము చేసి నిర్వహించుటకు శక్తిగాని, సామాన్యప్రయత్నము చేసి సంతుష్టి నొందుట కిష్టముగాని లేకపోవుటచేతను నాకప్పుడు గ్రంథపఠనమే, రోగియు వైద్యుఁడునుగోరిన పాలవలె, నుపాదేయమయ్యెను. అంతట నే ననేక గ్రంథములను—విశేషించి విషయవైలక్షణ్యవిపులములయిన యాంగ్లభాషాగ్రంథములను పత్రికలను—జదివితిని. గాని, సాధారణముగా ఈ కాలపువారితోఁబాటు నాకుఁ గూడ గ్రహణశక్తికంటె ధారణాశక్తి తక్కువగా నుండుటచే, ఆదాయవ్యయములను బట్టి చూడఁగా, ఈ చదువువల్ల నా బుద్ధి నిలువచేసికోఁ గలుగుచుండినది మిక్కిలి స్వల్పమేమో యని నాకప్పుడప్పుడనుమానము పుట్టుచుండెను. కాని నాకుఁ దెలియకుండనే నాబుద్ధి యొకవిధమైన నూత్నతేజో వికాసములతోఁ బెరుగుచుండెనని నే నిటీవలఁ దెలిసికొంటిని.

ఇట్లొక యేడెనిమిది సంవత్సరములు దోహదము నొందిన వెనుక, అంతవఱకు అంకురప్రాయముగా నుండిన నాయపూర్వరచనాశక్తి, యిప్పుడు పూచి కాచుటకు ననుకూల ఋతుసమాగమము కొఱకెదురు చూచుచున్న గున్నమామిడివలెఁ బెరిగియుండెను. ఆవసంతకాలము 1918 వ సంవత్సరమున వచ్చెను. అప్పుడే దానికొమ్మనుండి కోకిలాలాపమువలె నా మొదటికృతియైన ,,ఆటగీతము'' వినవచ్చెను. 'ప్రభంజన విజయము' (1904), మున్నగు మాలికలు వెనుకటివే యగుటచేత, ఇప్పుడు దీనిని మొదటికృతియని చెప్పితిని. అది యటుండనిండు. క్రొత్తగా కుదుళ్ళేర్పడు

చున్న చంటిబిడ్డకు నోరెంత గులగుల లాడుచున్నను గట్టివస్తువులు కొఱుకవశమవుఁగదా? అట్లే నేనును పెద్దకుండ కెసరువెట్టక క్రొత్తగాఁ దలయెత్తిన సాకల్యనాశక్తికి భారముకాలుగ నుండునట్లు కోమలములయిన రమ్యవిషయములను గూర్చి వ్రాయఁజొచ్చితిని. అట్లు వ్రాయఁబడిన దేశా, 'చందమామ' (1913). ఇవి శిశుగీతములుగా నుద్దేశించి వ్రాయఁబడిన వయ్యును, పెద్దలకుఁ గూడ నానందకరములే_పిల్లల యాహారమైన పాలు పెద్దలకుఁ గూడ నాహారమేకదా! ఇట్టిరెండు కృతులను రచించినప్పుడు నేనుగూడ వ్రాఁతకాండ్రలోఁ గొంతప్రయోజకుఁడను కాఁగలిగితినని సంతసించితిని. హృదయ ముత్సాహభరితమై నన్నింకను గావ్యరచనకు హెచ్చరించుచుండెను. అనుల్లంఘనీయమైన యీ అంతఃప్రేరణము ననుసరించి తగుదునని భాషాసేవ కుపక్రమించితిని. కాని చిన్నబిడ్డలు ధరించిన పండుగ దుస్తులు పండుగ వెళ్లకమునుపే కను మాసినట్లు నన్నావేశించిన యీ నూతనోత్సాహ మప్పుడే కొంత మందగింపఁజొచ్చెను. చిత్తవిక్షేపకారణములయిన గృహచ్ఛిద్రములు కొన్ని, అంతవఱకు నిర్మలముగా నుండిన సంసార వాతావరణమున అప్పుడే చిన్న చిన్న మబ్బులవలెఁ గ్రమ్మకొని వచ్చుచుండుటచే నేని సేవను, నిషిద్ధవస్తువును దొంగతనముగా సేవింప నలవాటుపడినవానివలెఁ, జేయవలసి వచ్చెను. నాకాస్థ యెంత యెక్కువగా నుండెనో, మనోదేహస్వాస్థ్యము లంత తక్కువగా నుండెను. కాని కవనమనునది యొక వ్యసనమువంటిది, నిశ్చయముగా అష్టమవ్యసనమే యగుటచేత, నే నెట్టెట్లో సెలవుదినములలో నించుకించుక యవకాశము చిక్కించుకొనుచు రచించుచుంటిని. ఇట్లు రచింపఁబడినవే 'కరుణగీతము' (1915) మాయబొమ్మ (1915) అమృతకలశిలో సగము (1917) కాలతత్త్వము (1918), అను నీ చిన్నకృతులు. అమృతకలశిని రచించినప్పుడు నాశక్తి నాకే కాక, అందలి పద్యములను వేడుకగా వినవచ్చిన రసికులగు హూణవిద్యార్థికుల కనేకులకుఁగూడ నెక్కువగా గోచరించెను. పరిషత్పత్రికలో నచ్చుపడిన వెనుక వానిం జదివి యానందించితి మని నాకుఁ జెప్పిన వారనేకులు గలరు. ఇవి యిట్లుండఁగా, ఈ కాలముననే, కాలక్షేపమునకై అప్పు డప్పుడు, పూర్వోక్తరీతిని సగము వ్రాసి నిలిపియుంచిన "ఉత్తరరామ చరిత్రమును * గూడ కొంచెము తెలిఁగించుచుంటిని. అపూర్వరచనా కౌశలమును బ్రకటింపవలయునన్న వెఱ్ఱి యభినివేశ మొకటి నన్ను మొదటనుండియుఁ బట్టుకొని వదలకుండుటచే, విషమములయిన నాయితరపరిస్థితుల కాపట్టుదల తోడయి, నా కలము నింతకంటె వడిగా ముందుకు సాగనిచ్చినదికాదు. కాని ఆశమాత్రము ఆకాశమునకు నిచ్చెనవేసి యెగఁబ్రాఁకవలెననియే చ్చూచుచుండెను.

---

*ఈనాటకము (1924) జూన్ నెలలో పూర్తిచేయఁబడి యిప్పటికి నముద్రితమై యున్నది.

పయిని జెప్పిన చిన్నమబ్బులే పెద్దమబ్బులై చినికి చినికి తుదకు 1919_వ సంవత్సరమున పెద్దగాలి వానయయ్యెను. పూచుచుఁ గాచుచున్న రెండు పెద్దచెట్లు నేలఁగూలెను. మార్చి 7 వ తేదీని ఇద్దఱు బిడ్డల తల్లియగు నాసోదరపత్నియు, మఱి యాఱువారములకు (20 వ ఏప్రిల్) తద్భర్తయు, బి. ఏ., యల్. టి. (Trained) యు, ముప్పది రెండేండ్లవయసు వాఁడును అగు నాసోదరుఁడును గతించిరి! వీరియిరువురిమరణము. కుటుంబముయొక్క భాగ్యమును జాలవఱకుఁ దల్లక్రిందుచేసెను. కాని జంటగా వచ్చిన యీ కష్టముల నెట్లో భరించి ధైర్యము నవలంబించి మరలఁ గొంచెము తలయెత్తుకొనఁ జూచుచుండఁగా, మరల 1926 జూన్ నెలలో పండ్రెండేండ్ల యీడుగల నా యేకపుత్రిక గతభర్తృకయై మోడయ్యెను! ఈ ప్రకారముగాఁ బ్రాప్తించుచు వచ్చిన యాపత్పరంపరలచేఁ గ్రుంగి కృశించు చుండియు నింకను మంచిదినముల రాకకై యాశతో నెదురు చూచుచుండఁగా నాయాశలన్నియు నొక్కమాఱుగా నడుగంటించుచు నాలుమాసముల క్రిందట (7_3_1927) నామీఁద పెద్ద పిడుగుపడెను! సౌజన్యనిధియు. సుగుణాలంకారుఁడును, సుందరాకారుఁడును, నగు నాజ్యేష్ఠకుమారుఁడు, పందొమ్మిదేండ్ల ప్రాయమువాఁడు, బి. ఏ. పరీక్షనిచ్చి, యల్ టీ పరీక్షకు దరఖాస్తు పెట్టినవాఁడు—ఆకస్మికముగా లోకాంతర గతుఁడయ్యెను! వాని ఛాయాపటమే_వాని గుణకీర్తనమే_యీ ప్రబంధమునకు ముఖాలంకారముగాఁ గూర్పఁబడినది! (నవకుసు: 150)

నా జీవితకాలములో మహాకష్టకాలమని చెప్పఁదగిన యీ యెనిమిదేండ్లలోను నేను కవితాకన్యనుగాని, కవితాకన్య నన్నుఁగాని, వదలి యుండలేదు. నావలని పెట్టుపోఁత లున్నను లేకున్నను, నాకాదేవియెడలఁ గల యపారప్రేమ ననుసరించి, నన్నాదేవి కనుపెట్టుకొనియే యుండెను. కనుపెట్టుకొని యుండుటయేకాదు, కంటికి ఱెప్పవలెఁ గాపాడుచుండెను. ఈ శూన్యప్రపంచ మందా దేవి కొక్కతెకే నేను గావలసినవాఁడను_నాకుఁ గావలసినదియును ఆదేవియే. ఏమనఁగా, కవితయే నాజీవిత సర్వస్వము. కవితయే నాకు స్వర్గద్వారము. కవితయే నాకు మోక్షసాధనము. (నవకుసు: 16, 106)

## నిర్వేదగీతము

ఈ కాలమున నేను రచింపఁగలిగిన చిన్న కబ్బములలో మొట్టమొదటిది „నిర్వేదగీతము. ఇది సరిగా నా సోదరుఁడు గతించిన నాలుగుమాసములకే (ఆగస్టు 1919) వ్రాయఁబడినదయ్యు, ఇందు చిత్రింపఁబడిన భావములు కేవలము తద్వియోగజన్యదుఃఖముతో సంబంధించినవి కావు. మఱేమన్న, జీవితము యొక్క పరమార్థ

మును బొంది సుఖించు టెన్నఁగానక పరితపించు జీవుని యసహాయత్వమే యిందు వర్ణింపఁబడినది. అదియేమి మహిమయో కాని, యీ గీతమును వ్రాసిన కొద్ది దినములకే ఆకస్మికముగా నా రెండు కన్నులలోను గండుపుండ్లు పుట్టి ''అంధకారావృతంబైన యంధకార, మేది కననీదు నీదు సత్కృపను జూపు'' అని దీనికట్టకడపటఁ జేయఁబడిన ప్రార్థనము సార్థకము చేసెను! (సోదర: 21)

## నవకుసుమాంజలి

పయి కారణముచే నేను మఱుచటి సం॥ (1920) వేసంగి సెలవులలో విశాఖపట్టనము వెళ్లి అచ్చట శస్త్రచికిత్స చేయించుకొంటిని. (సోదర: 36); అందువల్లను అక్కడి సముద్రపుగాలి వల్లను గొంత స్వస్థతను బొంది తిరిగి యిల్లు చేరుకొంటిని. కొన్ని మాసముల తరువాత నొకనాఁడు నేను శ్రీశివానందలహరీస్తోత్రము చదువుచుండఁగా, భగవద్విషయమయి యేమేని వ్రాయవలయు నని నాకుఁ జిరకాలము నుండి హృద్గతమైయున్న కోరిక మరలఁ దలయెత్తెను. అందుమీఁదట ననుకూలమైన యాశరత్కాలమున (2—10—1920), ఈ సంపుట మందలి మొదటికావ్యమైన నవకుసుమాంజలిని, ''ఎఱిఁగిన యర్థమే పయికి నెట్టొటొనర్చెదు'' అను నైదవపద్యముతోఁ బ్రారంభించి మెల్లమెల్లగా నలుబదిమూఁడు పద్యముల వఱకు సాఁగించి యప్పుడంతటితో నిలిపియుంచితిని. నిలిపియుంచుటకు కారణము తరువాతివిభాగము (పేరా) లోఁ దెలియఁగలదు. తరువాత మూఁడేండ్లకు (1923) శరన్నవరాత్రములలో దాని యావాహనము రాఁగాఁ దిరిగి ప్రారంభించి, యేపది పదియేను పద్యములో తరువాయిగా కావ్యమంతయు నాలుగుమాసములలో పూర్తిచేసితిని. ఈ దినములలోఁ గ్రొత్తగా నంకురించిన యొకానొక శరీరబాధచే నాకుఁగల సామాన్యస్వాస్థ్యము కూడఁ జెడియున్న వాఁడనై యుంటిని. కాని యీశ్వర కృపచే నీకావ్యమును ఆనందసముద్రమున నోలలాడుచు నిర్వహింపఁ గలిగితిని. ఇందలి 62 న పద్యమును వ్రాయుటకు ముందు, తద్భావమును దెలుపఁగోరిన వాఁడనై యుండుటచే, నేనుపూర్వాచార్యకృతములయిన రెండు శ్లోకములకుఁ దెలుఁగుగా 60—61 పద్యములను రచింపవలసివచ్చెను. అట్లే సందర్భసిద్ధికై 88—వ పద్యముకూడ రచింపఁబడెను. ఇవి దక్క ఈ నవకుసుమాంజలిలోఁ గాని, తదితరకావ్యములలోఁ గాని పూర్వకవుల భావములు నేను బుద్ధిపూర్వకముగా గ్రహించినవి, యెవ్వియు నుండవని నేఁదలఁచుచున్నాఁడను.

## సోదరస్మృతి

నేను నవకుసుమాంజలిని దొలుతఁ బ్రారంభించి రచించుచుండఁగా (1920), నడుమ నా కాకస్మికముగా 'సోదరస్మృతి' వ్రాయవలెనని యిచ్ఛపుట్టెను. అప్పటికి

భయము పుట్టుటచేతను, నే నిట్టిరచనకుఁ గడఁగినాఁడను. జీర్ణమయిపోయినంతమాత్రమున లోకమున కింతలో సంభవించెడి ప్రమాదమేదియు లేదుగాని, శ్రీయుత రవీంద్రనాథఠాకురు మున్నగు మహాకవులు వెలసి విలసిల్లుచున్న యీ కాలమందు మన యాంధ్రకవితకుఁగూడ త్వరలో నెట్టి క్రొత్తశకమారంభము కాఁగలదేమో యని యాశతో నెదురుచూచెడి సాహిత్యపరుల యాశ లడుగంటునట్లుగా, నిప్పుడిప్పుడు మనవారిలోఁ బెక్కండ్రు కవులను గూర్చియుఁ గవిత్వములను గూర్చియు సామాన్యవిశేషభేదముల నంతగాఁ బాటింపని వింతరుచులును విపరీతాభిప్రాయములును వెల్లడియై వ్యాపించుచుండుటచే, అట్టివానిని గొంతవఱకు మార్పఁబ్రయత్నించుట ధర్మమని నే నీపద్యములను రచించినాఁడను...'' ఈ విజ్ఞాపనముతో నిందలి తొంబది పద్యములు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక (1918) లోఁ బ్రచురింపఁ బడెను. తక్కిన పద్యము లిటీవల నప్పుడప్పు డొక్కొక్కటిగా రచింపఁబడెను. ఈ యమృతకలశియందు సూచింపఁబడిన కవిత్వలక్షణముల కన్నిటికి నా కవిత్వమంతయు లక్ష్యభూతముగా నున్నట్లు నే నభిప్రాయపడుచున్నానని పాఠకమహాశయులు తలంపకుందురుగాక !

## కరుణాగీతము

,, ఈ కరుణాగీతము నందలి విషయము సుప్రసిద్ధుఁడగు నొక అమెరికాదేశ గ్రంథకర్తచే 'Pushing to the Front' అను గ్రంథములో నొక సందర్భమున వాస్తవోదాహరణముగాఁ జెప్పఁబడినది. దానినే నాకుఁ దోఁచిన కల్పనలతో నిట్లు పెంచిరచించినాఁడను. కవి కథాపాత్రములలో నొక్కఁడైనట్లుండుటచే నాకుఁ గొంత స్వేచ్ఛాభంగము వాటిల్లెను. కావ్యనిర్వహణమందుఁ గొన్నిపట్లఁ గొన్నిచిక్కులును గలిగెను. కాని వానిని జాలవఱకుఁ దొలఁగించుకొనుటకుఁ బ్రయత్నించితిని...'' అని యిట్లు విన్నవించుచు దీనిని మొట్టమొదట ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ (1915) బ్రకటించితిని. ఇది పండితులకును పామరులకును జదువుట కింపుగానుండి హృదయముల కానందము గలిగించినదగుటచే దీనిని మఱికొన్ని పత్రికలుకూడఁ బ్రకటించుకొని తదధిపతుల రసగ్రహణపారీణతనే ప్రకటించుకొన్నవి.

## అమృతభాండము

తక్కిన కావ్యములను గూర్చి నేను ప్రత్యేకముగాఁ జెప్పవలసిన యావశ్యకత కానరాదు. వాని కథ నవియే వెల్లడింపఁగలవు. చదువరులకు వాని సౌందర్యము నవియే ప్రకటింపఁ గలవు. వాని యానందము నవియే కూర్పఁగలవు. కనుక రచనమును బట్టియు ముద్రణమును బట్టియుఁ గట్టకడపటిదియైన అమృతభాండమను నపరూప కావ్యమునుగూర్చి యొక్కమాటచెప్పి యీ కావ్యప్రశంసను చాలించెదను. ఈ

యప్రకృతఖండము అన్యాపదేశముగాఁ జెప్పఁబడిన ద్వ్యర్థికావ్యము వంటిది (Allegory), కాని కేవలము ద్వ్యర్థికావ్యముకాదు. హైందవస్వరాజ్యసమితి వారి రాయబారమే (The Indian Home Rule League Deputation 1918 & The Mont-ford Reforms) యిందలి ప్రకృతవిషయము. ఈ ప్రకృతము, అప్రకృతమైన గరుడయాత్రాకథలోఁ గొన్నిపట్ల స్ఫుటముగాను, కొన్నిపట్లసూచనగాను వర్ణింపఁబడినది. ప్రకృతాప్రకృతముల నొండొంటితో సంక్షేపఁజేసి కావ్యమును కడపటికు నేకార్థసమవేతముగా నిర్వహించుటకై రెంటియందును గొన్ని యావశ్యకములైన మార్పులు చేయఁబడెను. కావ్యాదిని ప్రతిజ్ఞాతమైన దాస్యనివృత్తి, కావ్యాంతమందు సిద్ధ్యసిద్ధిరూపముగాఁ జెప్పఁబడుటచే, పురాణకథకును ప్రస్తుతవిషయమునకును ఫలసమన్వయము కుదుర్పఁబడెను. ఇది యెట్లంటేని, "వినత సమ్మోదముద్రితాస్య. యగుచు వర్ధించె నమృతంబు" అని చెప్పఁబడుటచే దేశమున సంస్కరణముల తాత్కాలికాంగీకారమును, గరుడునిబంధవిముక్తిచే లోకమాన్యుని తదనంతర నిర్యాణమును, కాద్రవేయుల యాశాభంగముచేఁ బ్రజలకిప్పటి ద్వంద్వపరిపాలనముపలని యల్పప్రయోజకత్వమును సూచితములు.

ఈ ఖండకావ్యముల నన్నిటినిజేర్చి కూర్చిన యీ సంపుటమునకు, అశోకవనికాన్యాయము ననుసరించి '**నవకుసుమాంజలి**' యను పేరు పెట్టినాఁడను. దీనినే యిప్పు డీశరన్నవరాత్రములలో వాగ్దేవతాప్రసాదముగా నాంధ్రవిద్వన్మహాజనుల చేతులలోఁ బెట్టుచున్నాఁడను. వారు దీనిని కన్నుల నద్దుకొని శిరసున నిడుదురో, లేక సాధారణముగా నీ దినములలో ద్రవ్యాపేక్షచేఁ బూజలపేరు చెప్పి యర్చకులు మున్నగువారీయవచ్చెడి పుష్పాక్షతాదిక ప్రసాదమునువలె, ననాదరముగాఁ జూతురో చూడవలసియున్నది. స్వప్రయోజనాపేక్షలేని వాఁడనగుటచే నేనట్టి యనాదరమునకుఁ బాత్రుఁడను కాఁజాలను; సరసులయిన యాంధ్రమహాజనులు నా యెడల నట్టి యనాదరమును జూపనుజాలరు. ఏమనఁగా, ధనాఢ్యుఁడనై కాక, కేవల పుత్రప్రేమచేఁ బ్రేరితుఁడనై, నేను జేసిన సంకల్పము, వారికిదివరకే నామిత్రుల విజ్ఞాపనము మూలముగా విశదీకరింపఁబడి యున్నది. ఈ గ్రంథవిక్రయమువల్ల వచ్చెడి నికరాదాయమునంతయు, కీర్తిశేషుఁడయిన నా ప్రియపుత్రుని పేరను రాజమహేంద్రనగరమున దొరతనమువారి కళాశాలలో నొక విద్యార్థి వేతనమును (A Scholarship in the Govt. Arts College, Rajahmundry.) స్థాపించుటకై యిచ్చివేయఁ బోవుచున్నాను. ఇది లోకోపకారమే, యిదియు సరస్వతీ పూజయే. కావున నా కుమారునియందు, నా యందు, మన యాంధ్రభాషయందు ప్రేమాభిమానములు గల వారందఱును ఈ గ్రంథమును గొని తన్మూలముగా

నా యుద్యమమునకుఁ దోడుపడ వలయునని మిక్కిలిదీనుఁడనై ప్రార్థించు చున్నాఁడను.

ఈ గ్రంథము నచ్చువేయించుటకై నా కనేకవిధములఁ దోడుపడిన నా మిత్రులకును నా పూర్వశిష్యులకును, ఆంధ్రపత్రికాధిపతులకును, శ్రీ సరస్వతీ పవర్ ప్రెస్ వారికిని, నా కృతజ్ఞతాపూర్వక వందనశతముల నర్పించు చున్నాఁడను.

పుత్రశోకాతురుఁడనయి పొగులుచుండఁగాఁ, బూర్వపరిచితుఁడను గాకపోయినను ప్రాణమిత్రుని తండ్రినని నన్నుఁ బెక్కుమాఱులు చూడవచ్చి నా కనేక విధములగు శాంతివాక్యములచే దుఃఖోపశాంతిని గావించుటయేగాక, కరుణరసప్రధానముగా (ఇందుఁ బ్రచురింపఁబడిన) "మిత్రస్మృతిని" రచియించి యందుఁ దమ మిత్రుఁడగు నా పుత్రునకుఁగూడ ఆత్మశాంతిని వేఁడిన కరుణార్ద్రహృదయులును, పుణ్యపురుషులును నగు బందరుపుర వాస్తవ్యులు బ్రహ్మశ్రీ, సర్వా వేంకటశేషయ్యశాస్త్రి బి. ఏ, బి. యి, డి. గారికి నా ప్రత్యేక నమస్కారశతముల నర్పించు చున్నాఁడను.

| రాజమహేంద్రవరము.<br>ప్రభవ సం॥ర ఆశ్వయుజ శు ౫<br>శుక్రవారము, 30—9—1927 | విబుధ విధేయుఁడు<br>జనమంచి వేంకటరామయ్య. |
|---|---|





# తప్పొప్పులు

—:O:—

| పుట | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 9 | గత్రినిబోలె | గార్ముకమట్లు |
| 10 | 47 | పెనుమడునట్టుల్ | పెనుమడుపట్టుల్ |
| 47 | 45 | కటెక-చీఁకటి | కటికి-చీఁకటి. |
| 86 | 66 | నిముండగ | నిముడంగ ? |
| 105 | 22 | జానుల | జ్ఞానుల |
| ,, | 23 | గెకొని | గైకొని |
| 130 | 40 | లెలఁదు | వెలఁదు |
| 139 | 10 | పెట్టండు | పెట్టందు |
| 145 | 32 | రసజ | రసజ్ఞ |
| 147 | 38 | గజల | గజ్జల |
| 159 | 1 | విజాతి | ద్విజాతి |
| 160 | 6 | యాగముల | త్యాగముల |
| .. | .. | దెక్పాలకత్వములనైన | స్వారాజ్యామృతమును జేర్మి |
| 163 | 22 | బిడలకును | బిడ్డలకును |
| 171 | 64 | ఆపదర్మ | ఆపద్ధర్మ |

# విషయసూచిక



ఓం

శ్రీ పరమాత్మనే నమః

# న వ కు సు మాం జ లి



రంజిల్లి జగత్కుటుంబమునకుం క్షేమాస్పదంబై శుభా
ధారంబై యనపాయమై యఖిలవిద్వత్సేవ్యమై శాంత శృం
గారంబుల్ వెదచల్లుదివ్యమగు సత్కావ్యప్రబంధంబటుల్
స్ఫారంబైన యుమామహేశ్వరుల దాంపత్యంబు స్తుత్యం
బగుఁ॥

మ॥ తనయిచ్ఛాద్భుతశక్తిసంపదకు విద్వాంసుల్ మదిఁ మెచ్చి మే
లన సృష్టిస్థితినాశతంత్రము జగద్యంత్రంబు నిర్మించి యో
య్యన సాఁగించి తదీయమా నవిరతవ్యాపారముఁ లీలమైఁ
గనుఁగొంచుండు పరుండు భక్తతతికిం గల్గించుఁ గళ్యాణముల్ ॥ ౨

శా॥ రాగద్వేషవిదూరుఁడై యునికి నిర్ద్వంద్వుండు, మాయాసతీ
యోగస్వీకృతి, ద్వంద్వభావగతుఁడయ్యుం గామవిద్వేషియౌఁ;
ద్యాగంబుఁ మఱి భోగమున్ మఱి యఖండైశ్వర్యముం దుల్యమై
సాఁగఁ యోగవిభుం డెవండొ యతనిఁ సర్వేశుభావించెదన్॥ ౩

మ॥ మదికిన్ మాటల కందరానిదయి నీమాహాత్మ్య మేపారఁగా
నిదిగా దింకిదిగాదు గాదిదియనం చీరీతి నిర్ధార్చి తాఁ
గొదుకుంబల్కుల మూలమల్పులను బల్కున్ వేదమే యన్నచో
ద్వదుదంచన్మహిమాభివర్ణనము సాధ్యంబౌనె నాకీశ్వరా॥ ४

చ॥ ఎఱిఁగినయర్థమే వయికి నెట్టటొ వచ్చెడుఁ గొంతకొంత, యిం
కెఱుఁగనిదైన నీమహిమ నెట్లు వచింపఁగనేర్తు? నైన నీ
కరుణబలంబు నమ్మితిని గావున నీశ్వర! నాయి త్రవ్వచోఁ
దఱుగని పెన్నిధానమువిధంబున బెల్వడునేమొ నాహృదిన్॥ ౫

చ॥ ఎఱుఁగనియర్థముం గనఁ బ్రవృత్తి యొటన్న, శ్రుతిప్రతీతులున్
వరుసను దెల్పె నీవ, నముపాస్యుఁడవౌ నముపాసితుండవౌ
నరుల కటంచు నెప్పుడును; నామదియున్ నది వార్ధిఁబోలె ని
న్నరయుచుఁ జేరఁజూచు జననాంతరసౌహృదపాటవంబునన్॥ ౬

చ॥ ఇనునిప్రకాశముం బడసి యొంతయు వెల్గెడి చందురుండటుల్
వెనుకఁ గళాయినంటి ప్రతిబింబములం గ్రహియించునద్దము
ట్లనిశము దేవ! నాదు జడమైనమనంబును నీదునన్నిధిం
గనియెడుఁగాక వెల్గి యధికంబగు తెల్వియుఁ దేటయుం బ్రభూ॥ ౭

గీ॥ మీఁదు తోఁపక గ్రుడ్డులు మిణకరించి
నిలువఁబడియుండు నటునకు నేర్పుమీఱఁ
దెరమఱుంగున నిల్చి యందింతు వార
యన్య లెఱుఁగకయుండఁ బూర్ణార్థ మీశ॥ ౮

* * *

మ॥ రణసన్నాహ ధురీణ యోధసుభట ప్రారంభ సంరంభ వీ
క్షణసంజాత విషాదఖేద వశతా సంస్తబ్ధుఁడై నిల్చు ఫ
ల్గుణుచేఁ గత్తినిబోలె, సంసృతిమహాఘోరాత్రిచే మూఁగనై
ప్రణుతింగాన కొదింగియుండఁ గలముం బట్టింతు నాచేఁ బ్రభూ॥ ౯

ఉ॥ శంకర పుష్పదంత ముఖ సద్గురువర్యు లఖండభక్తి నే
ణాంకకిరీటు నిన్నుఁ గొనియాడిరి; వారలనేర్పు లేకయే
కొంకక వారిత్రోవఁ జనఁగోరు మదాశకునుంబలెన్ విని
శ్శంకగతిం గృపామతి నొసంగవె మన్మతికిన్ మహేశ్వరా॥ ౧౦

మ॥ తృణకల్పుండను నేను, నాదుమతియుం దేజోనిధీ! దానిపై
నణుమాత్రంబగు మంచుబో, ట్టయిన నీయవ్యాజ కారుణ్యవీ
క్షణసంపర్క మహార్మ్ముఖంబులను గల్గన్ వెల్గి సుశ్లోకస
న్మణికాంతిన్ వెదఁజల్లుఁగాక జగదానందానుసంధాత్రియై॥ ౧౧

శా॥ ఆకాశంబున నొక్కటొక్కటిగ సంధ్యావేళఁ జుక్కల్ బలెం
బైకిన్ వచ్చెడి పద్దియంబులివి సువ్యక్తంబులై యభ్యసూ
యాకారాంబుద మాలికావరణ తంత్రాపాయ ముక్తంబులై
ప్రాఁకుంగాక భవత్కృపం దెసలకున్ బాలేందుచూడామణీ॥ ౧౨

* * *

ఉ॥ ఏనియమం బెఱుంగక యథేచ్ఛముగా విహరించు, నందినీ
ధేనువుబోలె నాదుమతి ధీరగతిన్ వెనువెంట నీవు లో
నూనిన ప్రేమచేఁ గదిసియుండఁగ; నింకఁ గృతిప్రశస్తసం
తానము నీకు నత్ప్రభువతంసున కిచ్చి కృతార్థ యయ్యెడున్॥ ౧౩

ఉ॥ నీకరుణారసంబునను నిచ్చఁ బ్రవర్ధితమై, వినూత్నశో
భాకలితాంగి యయ్యె భవదాశ్రయ మబ్బుటఁజేసి నేఁ డిటే
నాకవితామతల్లి; యిఁక నవ్యసుమాంజలి నీకొసంగెదుం
గైకొనవయ్యా భక్తజనకల్పమహీరుహా! కూర్మిపెంపునన్॥ ౧౪

ఉ॥ మెచ్చెడివారలే యరుదు మెచ్చి యొసంగెడివార లంతకున్
లొచ్చయి కానవచ్చెదరు లోకమునం; దదియేల? దేవ! నీ
కిచ్చెద భక్తి నీకృతిని, నిచ్చెదు మెచ్చి శివేతరక్షతిం
జెచ్చెరఁ జేయుచుం గృపను శ్రీయుఁ జిరాయు వనామయత్వంబునున్॥

శా॥ సంగీతంబును సాహితీకవనముల్ సంపాదనీయంబు లం
చంగీకారమొనర్తుఁ జిన్నతనమం దర్థిం ద్రివర్గంబటుల్
సాంగోపాంగముగా నొకండు నెఱుఁగన్ సర్వేశ! నా సేయువ్యా
సంగంబో యపవర్గహేతువగు నాశ్చర్యంబుగా నీకృపన్॥ ౧౬

*
* *

మ॥ చిననాఁటం గడనంజులన్ సఖులతోఁ జెర్లాటముల్ మాని పె
ల్చనఁ గాల్సేతులు కాతమిం గడిగి త్వత్సందర్శనాసక్తిమైఁ
జనుచుందున్ గుడికిం బ్రదక్షిణనమస్కారంబు లర్పించి నిన్
గనుచుందున్ వెన నిండఁ జిన్నియెద, మార్కండేయలింగాకృతిన్॥

మ॥ పిననాఁటం జపలస్వభావమున నే వృక్షాగ్రసీమంబునన్
గొనబై వెల్గెడి చందమామను గనుంగొంచున్ సమీపస్థమే
యనుకొంచున్ మది సంతసింతు నకటా! ప్రౌఢుండనై నాకుఁ గాం
చనగున్ నీతలపూవిఁకన్ గగనపుష్పంబట్లు సర్వేశ్వరా॥ ౧౮

మ॥ పవలున్ రేయు సముద్రఘోషమువలెన్ వారింపఁగారానిదా
శ్రవణద్వంద్వకృతార్భటిం బృథులయంత్రధ్వానయానంబుపై
నవతారుణ్యతనూవిలాసముల నానందంబు నంధించుచుం
దవిలెన్ నన్నిదె నూత్ననాగరతకున్ దాసోహ మంటిం బ్రభూ॥

గీ॥ భువనమోహినియగు నీయపూర్వనాగ
రకత వివిధవిలాసవిభ్రమము లెంచి
యమృత మానుట మఱచినయసురులట్లు
తిరుగుచున్నారు నావారు తెలివిమాలి॥ ౧౦

మ॥ తలక్రిందం బెనుగొండఁ జిక్కు రుచిమద్రత్నంబులన్ వీడి గ
వ్వలకై దూరసముద్రతీరములకుం బైనంబు లేలా? విని
ర్మలమై నీవలుకే సమస్తపురుషార్థంబుల్ ప్రసాదింపఁగాఁ
దెలియన్ నేరక తూరుపుం బడమరన్ దిర్గాడుచున్నారయో॥ ౧౧

ఉ॥ శాంతిసుఖంబులీని బలసంపదలం గనివిడ్చిపోఁగు ఖం
డాంతరవాసులం గని యిహంబె పరంబని యెంచి మోహాసం
క్రాంతమనస్కులై భరతఖండనివాసులు సోమహేశ! ది
గ్భ్రాంతికి నగ్గమైరకట! పాలని పిల్లియు గంజిద్రాగునే॥ ౧౨

ఉ॥ అచ్చరలేమవోలె, మునియాశ్రమమే యగుభారతావనిం
జొచ్చి స్వధర్మనిష్ఠులగుచున్ సుఖముండిన యార్యసంతతిన్
మచ్చికలం గలంచెడును మానసముల్ మరలించి, దేవ! యీ
బచ్చెనపూఁతనాగరత బారికిఁ జిక్కియు నీకుఁ దక్కితిన్॥ ౧౩

చ॥ ప్రకృతిరహస్యశోధనకుఁ బాల్పడి ద్రౌపదిచీర లొల్వనే
రక నిహతాశులైన ధృతరాష్ట్రతనూజులపోల్కిఁ బ్రాకృతుల్
వికలమనస్కులై తలలు వ్రేలఁగవైచి తపింత్రదెల్ల నీ
యొకనియమేయశక్తి యని యుల్లమునం గనఁజాల కీశ్వరా॥ ౧౪

శా॥ నీసృష్టిక్రమ మించుకంతగని తా నిర్మించె యేమేమొ యెం
తో సంతోషమునొందుచుండుఁ బ్రకృతిన్ లోఁగొంటినంచున్; మహా
యాసం బందియు గడ్డిపోఁచయును జేయండ్డార! యీమర్త్యుఁడే
చ్ఛాసంకల్పితలోకజాలు నిను నిచ్చం ద్రోసిరాజే యనున్॥ ౧౫

శా॥ రాజుల్ పోయిరి వారిరాజ్యములతో రామాదివిష్ణ్వంశజుల్
బూఁజంటెన్ గురుపీఠకోటిఁ, గనమిం బూజానమస్కారముల్
దేజోహాని ఘటిల్లెఁ గట్టుచెడినన్ దేశంబునం దంతటన్
రాజయ్యెం గలిరాజు కుంటువడ ధర్మం బిట్లు సర్వేశ్వరా॥ ౧౬

శా॥ నీయంశంబునఁబుట్టి నీకొడుకులై నీప్రోవుచే నింతలై
నీయైశ్వర్యముఁ బొందఁ గర్తలయి నిన్నే వేఱుగాఁ జూతు ర
న్యాయం బేమనఁ దండ్రిబిడ్డలకుఁ గద్దా వేఱు లోకంబునం
దీ యజ్ఞానముఁ బాపి చేర్చుకొనవే యీశా జగద్రక్షకా॥ ౧౭

చ॥ నిలుకడనిష్టదేవతగ నీయపరప్రకృతిన్ భజించి, త
త్ఫలముగ శక్తిసంపద లవారిగఁ గాంచి, మదంబు మత్సరం
బలమికొనంగ మించి, తగ వాఱడిఁబుచ్చుచు, మాత్స్యనీతికా
కలమును రాజనీతిమతసారముగా గ్రహియించి, దేవ! యీ ౧౮

యిలఁగల నేలయెల్లఁ దమ రేకొని యేలఁదలంచి, యక్కటా!
కలకలలాడు పల్లియలు గ్రామములున్ మఱి పట్టణంబులున్
వెలవెలఁబోయి పీనుఁగులపెంటలు గాఁగ, నకాండపుఁ జగ
త్ప్రళయము పుట్టఁజేయు నతిదారుణవుం బ్రవిదారణంబులన్॥ ౨౯

జలిపి తదగ్ని కాహుతి, ధనంబు జనంబు సుఖంబుఁ గీర్తియున్,
గలిచిన దేమిలేక యపకీర్తియు హానియుఁ దక్క నిట్లుగా
తొలఁగుచునున్నవారు పుడమిన్ నరనాథు; లనాథులౌచు సా
ధులు చెఱలంబడన్ మఱియు దుష్టులువృష్టివహింపఁ జూచియుం

దలఁప కుపేక్షసేయుటిది న్యాయమొ? యానురవృత్తి హెచ్చి దు
ర్బలయయి దైవసంపద కరంబు నడంగఁగఁజొచ్చె నీవు భూ
స్థలి నవతారమెత్తి వరధర్మము నిల్పఁగదే మహాప్రభూ
యలఁతిని గోరు వీరు భవదాగ్రహసూచనలం గ్రహింపరున్॥ ౩౦

శా॥ ఏతత్తుం దనువెత్తి ధర్మమున కం చీవందు కృష్ణుండవై
యావాక్యంబును వేదవాక్యముగ దేవా! నమ్మియున్నా మింటన్
రావే యీశ్వర! యన్యుఁ డెవ్వఁడును నేరం డీమహాకార్యముం
గావింపం, గరదీపికం జెమన యీగాఢాంధకారం బిఁకన్॥ ౩౧

శా॥ స్వాతంత్ర్యంబును గోలుపోయి వరదానత్వంబుఁ బ్రాపించి ప్ర
ఖ్యాతంబైన స్వధర్మమున్ విడిచి యన్యస్వీకృతిం జేసి దు
ర్నీతిస్వైరవిహారధీరులగుచున్ నీపాదపద్మద్వయిన్
జేతోవీధిని నిల్పకుందురకటా! నిర్భాగ్యులై యీశ్వరా॥ ౩౩

ఉ॥ సబ్బున మోముదోమి కడునన్నని వల్వలు గట్టి వాసనల్
గుబ్బతిలన్ హేరాయల్ మెఱయ గోటున నీటునఁ బబ్బియుబ్బ నీ
దబ్బఱకాండ్రకుం దగిన దైవత మాదువె? యేన్గుతోలుపె
న్గబ్బును బూదిపూఁతయును గల్గుబికారివి నీవు శంకరా॥ ౩౪

ఉ॥ అందనిమ్రానిపం డనుచు నంబరపుష్ప మటంచు నిట్లుగా
నెందఱో యాస్తికబ్రువు లిఁకెందఱో నాస్తికు లండ్రుగాక ని
న్నెంద వెటన్ననేమి? యిఁక హృద్గగనంబున నీపదద్వయిన్
గందురుగాదె యోగులు కనచ్ఛ్రుతిశాఖశిఖాప్రవాళమున్॥ ౩౫

శా॥ తాతల్ తండ్రులు గొల్చు దేవుఁడవు భక్తక్షేమసంధాతవుం
జేతోవీథిని గాళిదాసకవియున్ శ్రీకంఠుఁడుం దక్కొరుల్
ప్రీతింజూచిన పెన్వేలుం గవుదు వో విశ్వేశ! నీకంటెనున్
నా తెల్విం గననేర్తునే యొకటి యన్యం బుత్తమం బీశ్వరా॥ ౩౬

శా॥ తల్లిన్ గౌతమి స్నానపానములకుం దండ్రిన్ నినున్ రక్షకుం
బెల్లాభక్తిని పీడకుం దేవుడునా పెద్దల్ ప్రపుణ్యాత్మకుల్
చెల్లంబో! నదిలేదు నీదుగుడియున్ లేదిందు "గంబాలచె",
ర్వెల్లయ్యెం దదభావవుం బ్రతినిధుల్—ఏమందు నాయోగమున్॥

చ॥ నిలిచెదు నాహృదాలయము నెక్కొని కోరిక పుట్టినప్పుడేఁ
గొలుచుట కందుఁబాటుగను గ్రుంకెద భక్తిరసంపుముంపునం
దలఁపఁగ నాకు క్షేత్రమవు దైవతమున్ మఱి పుణ్యతీర్థమున్
వలసినదెల్ల నీవ యిఁక భావనయే ఫలదాత్రి యీశ్వరా॥ ౩౮

శా॥ నీనామస్మరణంబుచేత నఘముల్ నిర్మూలమై పోవు నీ
ధ్యానాసక్తి ఘటిల్లెనే నితరచింతల్ మాను నీతత్త్వవి
జ్ఞానం బంటిన దుస్తమం బడఁగెడుం ద్వద్దివ్యభావాను సం
ధానం బబ్బిన ముక్తిపేరిటి నిధానం బబ్బు సర్వేశ్వరా॥ ౩౯

*
* *

ఉ॥ వింటిని గాళిదాసకృతి, వింటిని శ్రీనిగమాంతసూక్తులన్
వింటిని ద్యాగరాజకృతి, వింటిని బిడ్డల ముద్దుపల్కులం
గంటిని పూర్ణసాహితిని గంటిఁ గవిత్వపటుత్వసంపదం
గంటి నిదెల్ల నీకృపను; గంటినయే నిను ధన్యుఁడం బ్రభూ॥ ౪౦

శా॥ అంతస్సంజ్ఞకమౌ లతాదికమె లీనాంగంబు గాఁజాల క
త్యంతంబున్ భజియింపఁజొచ్చెడుఁగదా యాదిత్యుతేజం బెటో
జంతుశ్రేణిని పౌరుషద్విజతలన్ జన్మించి మర్త్యుండు భా
వ్యాంతర్వర్తిమహామహోనిధి నినున్ ధ్యానింప కున్నే యిఁకన్॥

శా॥ తించుం ద్రావుచుఁ దిర్గుచున్ మఱచెదున్ దేహాత్మసంరక్షణన్
మంచానంబడి మందు మ్రాఁకనెడుఁ గ్రిందన్ డించియుంచంగ లో
నెంచం జొచ్చెదు నిన్నుఁ దెల్విసెడి హా! యిల్లంటుకో నార్పఁ జే
యించున్ నూతిప్రయత్నమున్నరుఁడహో! యేమందువీమందునిన్॥

శా॥ నట్టింటంబడు చిన్నిమొండపాడలన్ గన్గొంచు బిడ్డండు తా
నట్టే చేతులు నేల వ్రాల్చి వెస డాయంబ్రాఁకి యవ్వానిఁ జే
పట్టన్, గుప్పిట నోరఁబెట్టుకొననుం, బల్మాఱు యత్నించుటన్
గట్టా! యాఁకట సోలి తల్లిదెసఁ బ్రాఁకంజొచ్చుసర్వేశ్వరా॥ ౪౩

*
* *

మ॥ తలఁపుల్ పుట్టెడుఁ బుట్టనుండి యొకటే దారిం బ్రవర్తిల్లు చే
మలబారుల్ బలె నామనంబునను సన్మార్గావరోధంబుగాఁ
గలనైనన్ విడకుండి నానిదురకుం గావించెదున్ భంగముం
గలిగింపంగదె యోగనిద్ర యిఁక నో ఖండేందుచూడామణీ॥ ౪౪

శా॥ సాఁగెన్ యోగము మంచుఁగొండపయి నిశ్శబ్దంబుగా నీకుఁ గ
ల్యాగచ్ఛాయ సుఖాసనంబు గిరికన్యాసేవయుం గల్గ; నే
దీ! గన్గొందును బూను మింకఁ గలహాధివ్యాధిదారిద్ర్యసే
వాగర్హ్యంబగు నాదుసంసరణమన్ పంచాగ్నిమధ్యంబునన్॥ ౪౫

ఉ॥ పాదరసంబు వోలెఁ జెయిపట్టున కందక ప్రాఁకిపోవు నీ
చీఁదఱగొంటుమానసము, చేడ్పడి యాఁకటఁ, బెట్టెలోని కా
కోదరమట్టు లుండుటకు నూపిరి యాడఁగనీయరాదు నా
కాదరమొప్పఁ జెప్పఁగదె యాతెరు వెద్దియొ యోగనాయకా॥

*
* *

క॥ మొనసి ప్రవృత్తినివృత్తులు
పెనఁగఁగ వాల్లభ్యమునకు బిట్టుగలఁగు నా
మనసు; మును మకరి కరియును
బెనఁగం గలగుండువడిన పెనుమడునట్టుల్॥ ౪౭

మ॥ నరసాలాపములం బ్రవృత్తి తనతో నయ్యాటకై పిల్చు; "ను
స్థిరసౌఖ్యాంబుధిఁ దేల్తు ని"న్నను నివృత్తి ప్రార్థనల్ వాల్చు ని
ట్లిరువుర్దా మిరుగేలఁ బట్టితిగువన్ హీనస్థితిన్ నామనం
బిఱుకున్ వీరలనందునం గదలలే కిట్టట్టు సర్వేశ్వరా॥ ౪౮

మ॥ పినుసీటం దలలెత్తి వేవెలుఁగునే వీక్షించు చామోదభా
జనమౌ జీవన మల్లపంకరుహముల్ సాఁగించుటల్ గానమో?
జననాథుల్ గృహమేధు లయ్యును భవత్సాయుజ్యసామ్రాజ్యమున్
జనకాదుల్ గనరే? త్వదీయకరుణాఽసాధ్యంబు లున్నె ప్రభూ॥ ౪౯

మ॥ మనుచుం గుమ్మరిపుర్వుచందమున సంసారంబునం బ్రాజ్ఞుఁడౌ
జన్ముఁ డంటించుకొనం డొకించుకయుఁ దజ్జంబాలజాలంబుఁ, గాం
చు నిఁకం గుంపటిబూదిఁ బైఁడిపిసరున్ సొన్నారియుంబోలె ధీ
ఘనుఁడై నిత్య మనిత్యజాతమున సంతోలించి సర్వేశ్వరా॥ ౫౦

శా॥ జ్ఞానంబున్ బుధు లెంత్రు శక్తిగను, దచ్ఛక్తిం బ్రయోగించిలో
కానందం బొడఁగూర్పఁ బాల్పడక సన్న్యాసం బటంచున్ వనిన్
మౌనంబూని తపించుచున్ నరుఁడు సంపాదించెడుంగాక తా
స్థాణుత్వం; బెటు పోలనేర్చును జగత్సంత్రాణపారీణు, నిన్॥ ౫౧

*
* *

మ॥ సవిశేషంబగు సౌరభంబు వనిలో జల్లించుచున్ లోచనో
త్సవముం జేయుచుఁ బొల్చుసత్తరు లసచ్ఛాయన్ సదానందయో
గవశుండై యొకఁ డుండ వేఱొకఁడు తద్గంధంబు నందుండి వా
యువుపోలెం గొని తెచ్చి యిచ్చు; నిదిమేలో యద్దిమేలో? ప్రభూ॥

చ॥ చదువుకొలంది శాస్త్రములు సంశయ మాకులపెట్టుచున్ మతిన్
ముదియుకొలంది బంధములు ముప్పిరిగొంచును గట్టివైచెడుం
గదియుకొలంది నంత్యదశ కల్లయి తోఁచెడు నుత్తరాశలున్
బ్రదికియుఁ జెడ్డవానిదురవస్థకుఁ బాల్పడితిన్ మహేశ్వరా॥ ౫౩

శా॥ నేలం బ్రాకెడి పూవుఁదీఁగవలెనే, నేనుందు వో దేవ! న
న్నీలోకంబున కేలదెచ్చితివొ నాకెచ్చోటు నేమించితో
పూలా పూవను, మొగ్గలా తొడువనున్, ప్రోడైనఁ గానుం, బసుల్
కాలం ద్రొక్కఁగ ముక్కుచుందు నిది నాకర్మంబె సర్వేశ్వరా॥

మ॥ సహాయోగంబు భజించి యీశ్వర భవత్సంకల్ప మీడేర్ప నీ
బహుళాకారవికార సంకులజగద్వ్యాపార సంసారని
ర్వహణాసక్తిఁ జరింతు మున్నడుత సంభ్రంబుం దరింపన్ రఘూ
ద్వహుఁడౌ రాముని గొల్చి భక్తిమెయిఁ దోడ్పాటైన చందంబునన్॥

శా॥ నీకుం బ్రీతిగఁ బుణ్యకర్మచయమున్ నేఁజేయుదుంగాక నే
నాకాంక్షింపనుగాక తత్ఫలము నీ కర్పించుచే గాని నీ
శ్రీకృత్పాదసరోజసేవనము నీ చిత్తంబె నాభాగ్య మం
చీకొంచున్ సుఖియింతుఁగాక కృతినై యేప్రొద్దు సర్వేశ్వరా॥

మ॥ దయయున్ సత్యము శౌచముం బెరసినన్ ధన్యంబగున్ వాఙ్మనః
క్రియలం గూడిన జీవనంబు నరసాళిశ్లాఘ్యమై పూవుదం
డయునుం బోలెను సౌరభంబు గుణమున్ సౌందర్యముం గల్గి త్వ
త్ప్రియమై వాడకయుండెడుం దదుపహారీభూతమై యీశ్వరా॥

* * *

మ॥ పటుబాహాబలుఁ డేని దుర్బలులఁ గాపాడందగుం దన్నిగా
దటులే తా ధనియేని భోగమును సంత్యాగంబునుం జెల్లుఁ, బ్రా
కట విజ్ఞానసమేతుఁడేని యిఁక మోక్షప్రాప్తికై నిన్నుఁ జూ
చుటయుం జూపుటయుం దగున్ నరున కీక్షోణీస్థలిన్ శంకరా॥

మ॥ ఒకకాలం దిగ్గుచ్ఛ్రొన్నములుచే నున్నట్టిమేనెల్లఁ బీ
డకు లోనౌట యెఱింగి మానుఁ బరపీడాపాపముం బ్రాజ్ఞుఁ డిం
కొకదానిక్ వెలిఁగింపఁ దక్కఁగల విద్యుద్దీపముల్ వెల్గుచో
లిక నూహించి పరోపకారమున కోలిం బూను సర్వేశ్వరా॥ ౫౯

మ॥ అమరుల్ దైత్యులకాండకాండలయు మంచాక్రోశముం జేయఁగా
నమితంబౌ కృప నీవు హాలహాలసంహారంబుఁ గావించుటం
గమలింపంబడియున్ భవద్గళము శ్రీకంఠాఖ్యఁ గూర్చున్; వికా
సమునున్ శ్లాఘ్యమ యౌనుగాదె భువనత్రాసైకవిధ్వంసికిన్॥ ౬౦

మ॥ ఇదియొక్కండు మహోపకార మగుఁగాదే! యీజగం బెల్ల నీ
యుదరస్థంబు బహిస్స్థితంబు నయి పెంపొందంగ నద్దాని నీ
వు, దయం బ్రోవఁగనెంచి మ్రింగవు విసంబుం గ్రక్కవుం గుత్తుకం
బదిలంబంచును బట్టి యుంచెదవు దేవా! యద్భుతప్రాభవా॥ ౬౧

మ॥ స్వసుఖత్యాగము లోకరక్షణముకై భావించి కావించు టెం
తో సమర్హంబగుధర్మ మంచును గృపన్ బోధింపనో నా, జగ
ద్వ్యసనాపాది కరాళ కాలదహన జ్వాలాభ హాలాహల
గ్రసనోత్సాహముఁ బూనవే కృపను శ్రీకంఠుండవై యీశ్వరా॥

* * *

శా॥ అర్థంబుల్ ద్యజియించుఁ బ్రాణములకై ప్రాణంబు లర్థంబుకై
అర్థప్రాణములం ద్యజించు మఱి మానాపాయ మావేళ; నే
యర్థంబుల్ భవదర్థమై విడఁడయో యర్థార్థి యైగాక తా
వ్యర్థుండై పరమార్థ మెంచక నరుం డర్థేందుచూడామణీ॥ ౬౩

మ॥ హృదయాంతర్గతమా భవద్విషయికప్రేమంబు నేరీతినై
నఁ దగన్ వెల్లడిసేయు భక్తుఁడు భవన్నామస్మృతిం జేసియో
త్వదుదంచద్గుణకీర్తనల్ సలిపియో త్వత్పూజ గావించియో
యెదియే భక్తిని నీకొసంగియొ స్వసంతృప్త్యర్థమై యీశ్వరా॥ ౬౪

ఉ॥ చెట్టునఁబొల్చు పూవుబలెఁ, జేరువగా నిలుచుండి, తొట్టిలో
బిట్టు చెలంగు బిడ్డఁగని వేడుకనొందు నొకం; డొకండు చే
పట్టి శిరంబుమూరుకొని వారనికూరిమి నెత్తి నెత్తిపైఁ
బెట్టి చెలంగి పొంగెడును; ప్రేమవిధంబు లనేకముల్ ప్రభూ॥ ౬౫

ఉ॥ బల్లునఁ దెల్లవాఱుదును ప్రాలినచుక్కలనంగఁ బందిరిన్
జల్లునఁ బూఁచి తావి వెదఁజల్లెడి మల్లెలఁ గోసి యంతటం
బల్లవనంగతిన్ వదలి వాడకయుండఁగ నీవిశిష్టప
త్పల్లవయోగభాగ్యమునె వారక కోరుదు వాని కీశ్వరా॥ ౬౬

మ॥ పువ్వులుం బండులు ధూపదీపములనం బూజార్హమౌ రమ్యవ
స్తువులన్ నీయిడినట్టివానినె స్వసంతుష్ట్యర్థమై యిష్టమౌ
భవదర్చాకృతి కెంతొ భక్తినిడి నీభక్తిప్రసాదంబె మా
నవుఁ డర్థింపఁగఁ దప్పటందు రిది యన్యాయంబుగా దే ప్రభూ॥

*
* *

శా॥ పిల్లిం జూచి పులిం గ్రహించు మతి చేవ్రేళ్ళన్ విమర్శించి తా
నల్లల్లం బడి లెక్కవెట్టెడును భూమ్యాకార మూహించు జా
బిల్లిం జూచియుఁ బొద్దుఁజూచియుఁ దనుం బ్రేమించు చుట్టంబులా
తల్లిం దండ్రిని జూచి బాలకుఁడు నిన్ దర్కించునట్లీశ్వరా॥ ౬౭

శా॥ లీనంబై పరమాత్మఁ జేర్చునదియే లింగంబనం జిహ్వామే
ర్యా; నద్దాన నజాండమందుబలెనే ధ్యానింపఁగాఁ దోఁచు నీ
దానత్యద్భుతశక్తిసంపద; యిటుల్ సాలంబవిద్యాశ్రయా
నూనప్రజ్ఞుఁడు గొల్చి నిన్నుఁగని ధన్యుం డౌను సర్వేశ్వరా॥ ౧౯

మ॥ కుదురై నిల్చి సమస్తతేజములకుం గూటస్థుఁడై తాల్చుఁ దా
నుదయం బభ్యుదయంబు నస్తమయమున్ వ్యోమంబునందున్,సుఖ
ప్రచురుఁడై ప్రొక్కినఁ గన్నుదమ్ములకుఁ గం ప్రత్యక్షదైవం బగున్
మది నెంతున్ జగదాత్మ సూర్యుఁగని నిన్ త్రైలోక్యదీపాకృతిన్॥

*మ॥ అనఘున్ లోకతమోపహున్ రుచిరసంధ్యారాగరక్తాంగుఁ బ్రా
గ్జననీపుణ్యతపఃఫలంబు నభవా! కన్గొంటినీప్రొద్దు; నే
జననంబందిననాఁటిప్రొద్దని నమస్కారంబు గావించెదం
దనుఁదాఁగన్గొనుయోగిచందమున నానందించెదన్ నీకృపన్॥ ౨౧

*
* *

శా॥ చేతంబట్టినవస్తు వెట్లు నిదురం జేజాఱునో తానుగా
నాత్రోవం బ్రతిమాదికంబులు, తురీయావస్థలోనుండి లో
కాతీతుండయి నిన్నుఁజూచుచును నీయందే ప్రమోదించు న
ద్వైతప్రజ్ఞుఁ, డమంతవీడు నవలంబం బేది సర్వేశ్వరా॥ ౨౨

చ॥ మనమున ద్వైతభావనము మానకయుండెడు నంతదాఁక ని
మ్మనుజానుపాసనాక్రమము మానసికంబును గాయికంబునుం
దనరెడు నొక్కటొక్కటియె తానుభయంబయి; యింకఁదన్నుఁదాఁ
గనుఁగొననేర్చునప్పు డవికల్పసమాధిని నొక్కటే యగున్॥ 23

* ఇది కవియొక్క యేఁబదియొకటవ జన్మదినమున వ్రాయఁబడినపద్యము—

ఉ॥ ఏను నిరామయుండనని యెన్నెడి రోగికి రోగ మెట్టులో
యేను సదాశివుండనని యెంచెడి యోగికి దేహ మట్టులే
కానఁగరాక యుండెడు; సకారణసిద్ధులవోలెఁ దోఁచెడుం
గాని, భవత్కృపాప్తి ఫలకారకముల్ దృఢభక్తిభావనల్॥ ౨౪

శా॥ మందుంగుప్పెలసేవఁ జేయ నొకఁ; డేమం దంట కన్యుండు స్వ
చ్ఛందంబా ప్రకృతిన్ భజించు; దృఢవిశ్వాసంబుతో నింకొకం
డొందుం "నేనునిరామయుండ"నని యెంతో సౌఖ్య; మిట్టుల్ రుజల్
డిందం, బొంద ననామయంబుఁ, దెరువుల్ సిద్ధించు సర్వేశ్వరా॥

* * *

మ॥ అలఁతిం దృప్తి ఘటిల్ల దెప్పుడును నాయాకాశముం తాశకుం
దలఁచున్ నో రిఁక నూదిబెజ్జమయియుం దాఁబట్టి నిన్ మ్రింగుటే
సులభం బంచు మహన్మహత్తరమునన్ సూక్ష్మాతిసూక్ష్మంబునై
పొలుపారుంగద నీదుతత్వ మది శంభూ! శర్వ! సర్వేశ్వరా॥ ౨౬

మ॥ మును పంకంబుల నింకఁ జేయుచుఁ గరాంభోజాతగర్భంబునన్
వనధిం గొన్న యగస్త్యుకర్మకుశలత్వంబుం దలంపించుచున్
నిను సర్వాత్ముని హృత్సరోరుహపుటిన్ నిండారఁగాఁ బట్టుయో
గనిరూఢుండెకదా కృతార్థతముఁ డీజ్ఞానిప్రపంచంబునన్॥ ౨౭

శా॥ నీయౌన్నత్యము, నన్ సృజించుకతనన్ విఖ్యాతమై యొప్పెడున్
నాయాధిక్యము నిన్నుఁ జేర్చుకొని యన్వర్థం బగున్ లోకమం
దోయీశా! మణికాంచనంబుల మిథోయోగంబునంబోలె నిం
తో యేపారును నీవు నేను నొకటౌ యోగంబు సర్వేశ్వరా॥ ౨౮

* * *

మ॥ ధనమెందుండునో యందెగాహృదయముల్ దానుండెడుం;గానినా
ధనమా నిన్ననుసాధనంబుఁ గనమిం దారాడుచుం దల్పుసం
దున నేఁగన్న ఐమూసి చూచియొకటేదో భ్రాంతిచే నట్టిదే
యనుకొందుర్, భవదీయరూప మది దేవా! యెట్టిదోచూపవే॥

మ॥ అది నీవాదు వటంచుఁ బల్కు శ్రుతి; స్థూలారుంధతీన్యాయ మి
ప్పుడు నాదృష్టికి నన్వయించుకొనఁ దద్వాక్యార్థ మోదేవ! ప్రో
వఁదగుం జేకొని పిల్లి, కూనను బలెం, బాటించి నాకూయి యో
సదయా నీపదపద్మసేవఁ గనెదన్ సౌఖ్యంబు సర్వేశ్వరా॥ ౧౦

మ॥ ఎగురంజాల విహంగమార్గమున నీవెత్తే శుకాదుల్ బలెన్
నగుఁబాటుం బెనుచేటుఁ బాటిలును గ్రిందంబడ్డ; నేనింకఁ బ్రాఁ
కఁగనుంజాలను మెల్లఁ జీమవలె గంగాయాత్రకై; తీవ్రమం
దగతుల్గావిఁక నాకు నేమిగతి యాత్రత్రాణ బోధింపవే॥ ౧౧

శా॥ ఎన్నో చోటుల నిల్చికాని యొకమై నెక్కంగ నేనోప నీ
యౌన్నత్యంబున కోజగద్గురుఁడ! దివ్యంబైన నీతేజముం
గన్నుల్ మోడిచికాని చూడఁదగనుం గాకుండ మిర్మిట్లు, నా
యన్నా! నాకడ కీవ రావలయు నన్నర్థిం గనంగావలెన్॥ ౧౨

శా॥ ఊబుల్ అప్పలు చెట్టు చేమ పులిపుట్రల్—వీనియన్నింటిలో
నోలిం జిక్కియు దాఁటి బైటఁబడి యెంతోయోర్మిమై నీమహా
కాలంబంతయుఁ, బెట్టిముందడుగునే, కావించితిన్ యాత్ర, ని
న్నాలోకించి కృతార్థతం గనెదనన్నాకాంక్షనే యీశ్వరా॥ ౧౩

మ॥ హిమవంతంబు మహోన్నతస్థలికి నన్నెక్కించి తెత్తించి యు
త్తమమౌ మానవజన్మమున్ వరద! కేదారేశ! యేఁజూతు నీ
కమనీయంబగు ధామమంచవి యయో! కప్పంబడెన్ మంచునన్
శ్రమ మెన్నండు ఫలించు? మంచు విడు నెన్నండింక సర్వేశ్వరా॥

చ॥ నియతగతిన్ సమస్తమును నిచ్చఁ బ్రవర్తిలుచుంటఁ జూచుచుం
డియు నిటులేల యాత్రపడ డెందమ! నిద్దుర లేక రాత్రియే
శయనము వీడితీవనుచుఁ జప్పున సూర్యుఁడు తోఁచునే? తమ
శ్చయము తొలంగిపాఱెడునె? సారసకోశము చక్కవీడునే॥ ౧౫

మ॥ ఇఁకనే నిద్దురవోవ నీప్సితము తానీడేఱునందాఁక నం
చకటా! డెందమ! యెన్నిసారు లనుకో వారాటముం జెందుచుం!
బ్రకటంబయ్యెను నీదుపూన్కి యిదిగో ఱానేలపై వేరు నా
టికొనంజాలని మొక్కవోలె వసివాడెన్ నిష్ఫలంబై చెడెన్॥ ౧౬

***

చ॥ కలుపును గడ్డిదుబ్బుఁ బొడకట్టక యుండఁగఁ గాఁచుకట్టుగాఁ
బొలమును దున్ని సిద్ధముగ బుట్టను విత్తులు వోసి ప్రియాసమైఁ
దొలుకరివానకై మొగులుత్రోవను జూచుచు నీకు మ్రొక్కుచున్
నిలఁబడు పేదకాఁపువలె నేనెపు డుందునొ మందు నప్పుడే॥ ౧౭

మ॥ పడిరోయీశ్వర! యెంతకాలమొ హరిబ్రహ్మల్ ప్రయత్నించి నీ
యడుగుల్ నీమోడుగుం గనుంగొనుటకై వ్యర్థప్రయాసంబులన్
గడకున్ నిన్నుస్తుతించి భక్తిపరతన్ ధన్యత్వమాన్యత్వముల్
వడయంగల్గిరి నీకునీవయి కృపం బ్రత్యక్షుమై నిల్వఁగన్॥ ౧౮

శా॥ కైలాసాద్రిమహోన్నతత్వమును గంగావాహినీదైర్ఘ్యముం,
ప్రాలేయాంశునిదూరవిస్తృతులుఁ, గొల్వన్ సూత్రముల్ పన్నఁగా
కేలీలన్ భవదప్రమేయమహిమం బెంచంగ నోపున్ నరుం
డాలంబంబుగ యోగసూత్రమును జేయండేని సర్వేశ్వరా॥ ౧౯

శా॥ నీకుం గంపిలుచుం బ్రకంపనుఁ డొగిన్ వీతెంచుఁ జండాంశుఁ డీ
య్యాకాశంబున నీవుగీచుగీటి నిత్యంబుం బ్రవర్తించెడుం
గాకుండన్ భవదాజ్ఞ చీమవలెనే కాలాంతకుండున్ దరిన్
రాకుండుం; గడు నుగ్రశాసన మిదారా! శర్వ! సర్వేశ్వరా॥ ౨౦

మ॥ అపకర్షం బగునంచు నెంచెద సహస్రాక్షుండవౌ నీకు నే
వ్యపదేశంబున సూర్యచంద్రశిఖులే యక్షిత్రయం బన్నచోఁ
బ్రపతద్రక్షక! రోమకూపములటుల్ బ్రహ్మాండదేహంబునం
దపరిచ్ఛిన్నరుచిన్ వెలుంగ గ్రహతారాసంఖ్యనక్షత్రముల్॥ ౨౧

మ॥ నడిమింటన్ రవినిల్చి చీఁకటుల నానాదిక్కులం దోలియున్
వెడలింపంగ నశక్తుఁడౌ నురుగుహావిశ్రాంతమౌ ధ్వాంతమున్
గడుఁజోద్యం బగు నీవు మానసగుహాగర్భస్థరత్నంబవై
యడఁగం జేయుదు మస్తమం బఖిలమౌరా శర్వ! సర్వేశ్వరా॥ ౨౨

మ॥ హృదయాకాశము లద్భుతంబులు భవత్సృష్టింగడున్ లో, వెలిన్;
గుదురై రెంటను బొల్చు నీవెలుఁగహో గూఢం బగూఢంబునై
పొదలుంగా హృదయంబు నీవలన సంపూర్ణాతిసంపూర్ణమై
యొదుఁగన్ శూన్యముకంటె శూన్యతరమై వ్యోమంబు సర్వేశ్వరా॥

చ॥ అణువునకన్న సూక్ష్మము మహత్తునకన్న మహత్తరంబునౌ
ప్రణుతభవత్స్వరూపమును వాకొనఁదీరునె నోరితో? విచ
క్షణులయి చూచితీరవలెఁ గన్నులు చల్లఁగ నీశిరంబుపైఁ
గణికగనొప్పు నాదివిజగాంగమహోజలమట్టు లీశ్వరా॥ ౯౪

***

చ॥ పసివడి యెంతపిల్చినను బల్కవు; కన్నులు విచ్చి చూచినం
గనఁబడ వెందుడాఁగెదవొ; కానక యేమఱియుండుదుం దళు
క్కనుచు మెఱుంగుచందమున నట్టె స్ఫురించెదు వెన్కపాటునం
గనుగవ మూసివైచి పులకల్ నిగిడించుచు మేన నీశ్వరా॥ ౯౫

ఉ॥ మక్కువమీఱఁ గోరికొన మాటుమడంగి, తలంచుకోకనో
నెక్కడనుండి వ్రాలెదవొ యిట్టె ననుం బయికొందు నిద్రయు;
ట్లక్కజ మయ్యెడుం దెలివి యుక్కఱలే దిఁక నిన్గనంగ; నో
తెక్కలికాఁడ నీవరుగుదెంతువు చీఁకటిలోనె యీశ్వరా॥ ౯౬

చ॥ శరదృతువందుఁ గల్మషము జాఱినజాడఁ బ్రసన్నభావముం
బొరసెడు దేవ! నాదుమతి, పుణ్యసరిత్తునుబోలె, నంతనీ
స్మరణము గల్గుడున్ గగనమధ్యసుధానిధిబోలె దానిలో
సరవి వెలింగెదీవు సరసస్తిమితంబుగ నోమహేశ్వరా॥ ౯౭

శా॥ అన్వేష్టవ్యుఁడవున్ శరణ్యుఁడవు నీవైయుండి లోకంబునం
దన్వేషించుచు వచ్చితే కృపను దేవా! దీను, నన్ బ్రోవఁగా!
నన్వేషింపదు, మృగ్యమారతన; మీపై వచ్చుటన్ నిన్ను భ
క్తి న్వీల్తుం దలపోయువో కృపణుశక్తిన్ దీనచింతామణీ॥ ౯౮

శా॥ ఎన్నోప్రొద్దులనుండి నీకొఱకునై యీశూన్యమా మింటిపైఁ
గన్నుల్ వెట్టి తపింతు నోర్దెఱచుచుం; గంటిన్ ఘనున్ నేఁడు నా
పున్నెం బేమన నీలకంధరు, నినున్ మోదంబునం గంటి, నో
యన్నా! కంటిభవత్కృపామృతకణం బాచాతకంబుంబలెన్॥౯౯

ఉ॥ కంటిని జిన్నియెండపొడఁ గంటిని జీఁకటియింటిలోపలన్
మంటిని నేఁడు దేవ! యొకమా తెరవిచ్చిన నీకునెక్కడో
కంటనుబోలె, దుస్తమము గ్రాఁచి కరంచితి నేఁ గరంగితిం
గంటిని నీదుభవ్యకృపఁ గంటి మహేశ్వర! దేహవిస్మృతిన్॥౧౦౦

మ॥ ఉఱుకంజొచ్చెడు వచ్చి యూరిదరి కిట్టో దేవ! నాడెంద మె
చ్చరికం, జీఁకటి మిన్కుమిన్కని యొకేచాయం దిరంబైనవె
ల్గరయంగల్గినదై యయో! కొఱవిదయ్యంబుల్ భ్రమల్ గొల్ప వే
మఱునన్ నేఁ దిరుగాడనే విడిచి సన్మార్గంబు సర్వేశ్వరా॥ ౧౦౧

***

శా॥ నాపైఁబడ్డ భవత్కృపాలవమునన్ మాలిన్యముం బాసి, సం
తాపంబెల్ల శమింప మైమఱచి యానందాబ్ధి నోలాడితిన్
హేపంచానన! యిద్ది నీదుమహిమంబే కానిచో సింధువై
యేపారంగల దెట్లు బిందువు? తృణంబే మేరువౌనాకునన్॥ ౧౦౨

మ॥ ఒడలన్ డగ్గఱి యంటినట్టులగు, వాయుస్పర్శముం గాదు; న
ల్గడలం జేర్చెడు నొక్కచోటి, కయినం గా దంధకారంబునన్
గడెయుం గంటయు జామునుం దెలియ, వైనన్ నిద్రయుంగాదు; బ
ల్విడిమై వృత్తివిశేషమొందు హృదయావిర్భూతమై యీశ్వరా॥

చ॥ చలువలుగ్రమ్ము రోగికి భిషఙ్మణియిచ్చు రవంతమందుచే
వెలువడి రోమకూపములవేడిమి యెట్లు మరల్చు జాడ్యముం
దలఁపఁగ నట్లె, నీదుకరుణారసబిందువు నాదుజాడ్యముం
దొలఁచుచు నేఁడు నాకొసఁగు నూతనజీవన మోమహేశ్వరా॥

శా॥ ఒంటిం జీఁకటి మానమూని యొకఁడేదో మెల్లఁ జింతించుకొం
చుంటే వేడ్కఁగఁ దోఁచు నాకెపుడు; నేఁడో యద్ది రెట్టించె; నే
మంటేనిన్ నినుఁ గూడియుండుటను, దివ్యంబైన నీవెల్గుఁ గ
న్గొంటన్, నీపలు కాలకించుట నెదన్, యోగీశ! సర్వేశ్వరా॥

మ॥ జననీ! నీదుకృపాకటాక్షమున వాక్సామ్రాజ్యధౌరేయతం
గనఁగంటిం గనఁగల్గి క్రొత్తవెలుఁగుం గళ్యాణి నీమోమునన్
జననంబందుచు నేఁడు క్రొత్తగను నీసౌవర్ణగర్భంబునం
గనెదం గ్రొత్తప్రపంచమొం డిదె నమస్కారంబు వాగీశ్వరీ॥

***

మ॥ హృదయాకాశముమీఁది మీఁదికిని నీవెక్కంగ నెక్కంగఁ జి
న్నది కాఁజొచ్చెడు, నాదునీడవలెనే, నాచిత్తసంకల్పమున్;
గుదురై నిల్వఁగ నీవు నట్టనడుమన్ శూన్యంబగున్ హేవిభో!
పొదలున్ వెండియు నీవు డిగ్గినఁ దమఃపుంజాకృతిం దాల్చుచున్॥

ఉ॥ పొంగెడు మిన్నుముట్టెడును బుణ్యతపఃఫలరూపమైన స
త్సంగు సముద్రమట్లమృతధాముని నిన్గని పూర్ణసోమునిం
గ్రుంగెడు వెన్క వింధ్యగిరిరూపున నేపటి నామనం బహో
భంగకరంబుగాదె యనవస్థితచిత్తులజీవనం బిలన్॥

మ॥ వినినంతన్ సుతలాభవార్తఁ దనకుం బ్రేమోదయం బయ్యెడుం
గనినంతన్ సుతుముద్దుమోమొకమతే గాఢంబు కాఁజొచ్చు; న
క్కునఁ జేర్పంగ నపారమై యొకమహాకూపారమే యయ్యెడున్
జనుఁ డీచందపుఁబ్రేమఁ బూనవలదే సర్వేశ! నీపట్టునన్॥ ౧౦౯

శా॥ నీవే నే ననుకొందు నాదుమదిలో నిక్కంపుభావంబుగా
నీవే నేనయి యుందునేని గ్రియలో నిండారుప్రేమంబునన్
భావంబుం గ్రియ యొక్కటై సుఖసుతోత్పత్తిన్ సుదాంపత్యమా
హా! వేఱైనను దేవ! నీవెఱుఁగు దర్ధాంగీకృతంబే యగున్॥౧౧౦

***

మ॥ మొగముం జూపితి వొక్కమా టెటులో నాహోరాత్మనిపింపం బ్రభూ!
మగుడన్ రా వదియేమి నీమనసునన్ మందాదరత్రాసమో!
ద్విగుణంబౌ విరహార్తి భక్తియనునుద్దేశంబొ? యేమైననున్
బిగియంబట్టక వెన్నఁ బోవిడిచితిన్ వ్రేల్నాకుచుందుం గటా!

ఉ॥ ఆఁకట నేడ్వనోపునని యారయవచ్చినతల్లిఁ జూచి తా
నేఁకటవాసి యేడ్పుడిగి యెత్తుమఱంగినబిడ్డవోలె ని
న్నే కనుగొంచు నీశ! సుఖియించెద నెమ్మదిఁ గోర కన్యమున్
గైకొని నాదుప్రార్థనల గ్రచ్చుఱ నన్గన నీవు రాఁగదే॥ ౧౧౨

మ॥ జవసత్వంబులు సన్నగిల్లెడు, నిరుత్సాహంబు సంధిల్లెడున్
వ్యవసాయాత్మికగాక బుద్ధి, మనుదిన్ పామట్టు లైయుండెడున్
నివు రెంతేనియుఁ గప్పునిప్పుకవలెన్ నిస్తేజమౌ నాత్మయున్
రవులింపంగదె పోసి యూపిరి జగత్ప్రాణుండ వోయీశ్వరా॥

మ॥ వెలుఁగన్నన్ భవదాభిముఖ్యముననే విశ్వాత్మ! యీభూమికిం
గలుగుంబో యది నిన్ను వెన్కనిడినన్ గ్రస్తంబగున్ దుస్తమః
కలనన్; నేనును దెల్వియున్ మఱపునం గానట్టిపెన్సంధిలోఁ
బలవింతున్; నను సుధ్రువస్థితిని నిల్పంజెల్లు సర్వేశ్వరా॥ ౧౧౪

మ॥ పొడవౌకల్పమునందు నిల్చి ఫలముల్ భోగించి భోగించి యీ
సుడిగుండంబునఁ గర్మవాయువశతన్ శోచ్యుండనై వెండియుం
బడితిన్ జీర్ణదళంబు నంటిపడు చీమంబోలి విశ్వేశ! నన్
గడఁకం జేర్పవె యొడ్డునం గృపను యోగభ్రష్టు సర్వేశ్వరా॥

***

మ॥ ఒకపుట్టుం దేవు లంటిపట్టి నరులన్ యోగీశ! పీడింపఁ, ద్వ
న్నికటక్షోణికిఁ జేరవచ్చెదరు భక్తింగొల్చి ప్రాపింప నీ
దుకృపాధామకటాక్షవీక్షణమొ నీస్తుత్యర్హభస్మాంగరా
గకణంబో మఱి నీకపర్దగతగంగాప్రోక్షణంబో ప్రభూ॥ ౧౧౬

మ॥ తెర యడ్డంబిడినట్టు లుండు నెపుడున్ దేవేశ! నాదృష్టికిం
దెర యింకొక్కటి నీకు నాకు నడుమన్ విశ్వేశ! యీదేహమే
సరిగాఁ బోకిది పట్టిత్రిప్పెడు భవత్సాన్నిధ్యయోగంబు చే
కుఱకుండన్ భవరోగవైద్యునకు నీకుం దవ్వుగాఁగొంచమో॥

శా॥ నీసంకల్ప మెఱుంగరా దెఱిఁగినన్ నేఁగాదు బ్రహ్మాదులున్
నీసంబేని మరల్పఁజాలరుగదా విశ్వేశ! యీదేహముం
నీసేవం బొనరించుశక్తి గలదానింజేసి కాపాడెదో
యీసంసార మిటేల నీకనుచు నెంతేఁ బోసి త్రోపాడెదో॥ ౧౧౮

మ॥ ఎటులైనన్ శుభమేయగుంజుమి ప్రభూ! యేమన్న నేనీతటి
చ్చటులంబైన శరీరముల్ విడి భవత్సాయుజ్యముం గాంతు; నిం
కిటనున్నన్ భవదీయభక్తిగరిమం బేపారఁ బ్రాపింతు; నె
న్నఁటికైనం గడబంతినుంట కొదయే నావాఁడవై నీవిడన్ ?

***

ఉ॥ ఏదియొచూచి బూచియని యెంతయుబెగ్గిలి యాటమాని య
త్యార్తిని నమ్మ! యమ్మ! యని తల్లియొడిం దలదాఁచుబిడ్డకున్
మేదినిమీఁదఁ దాన తననీడను జూచి కలంగి మృత్యువం
చాదట నిన్నుఁజేరెడి భయార్తున కేదివిభేద మీశ్వరా॥ ౧౨౦

మ॥ మరణం బందఱుఁబొందువారెయనుచుం బ్రాజ్ఞోక్తులంబల్కుచున్
మఱచుం దాఁదనమాట చిత్రముగ నీమర్త్యుండు సంసారత
త్పరుఁడై; వెండియుఁ దన్నుమాని సుఖిఁగా భావించునన్యుంగటా!
యెఱుఁగంజాలక నిన్నుసౌఖ్యనిలయున్ మృత్యుంజయున్ శంకరున్॥

శా॥ పామన్నన్ విసమన్న మృత్యువనినం బ్రాణాంతకంబంచు మీ
కోమర్త్యుల్! వెఱపేల? యమర్త్యతను మద్యోగంబునం బొందుఁడం
చో మృత్యుంజయ! ఓసుధామయతనూ! ఓయోషధీశావతం
సా! మా కీవుపదేశ మిచ్చెదవె లక్ష్యంబౌచు సర్వేశ్వరా॥౧౨౨

***

మ॥ స్వరసమ్మేళనశక్తి, వీణ చెడిపోవం, బోవునట్లాత్మకున్
మరణంబందురు పంచభూతపరిణామంబైన దేహంబుతో;
స్మరణంబౌటను జ్ఞానమంతయును సంస్కారప్రబోధంబుచేఁ
గరమున్ శక్యము గాకయుండెడును 'వెన్కన్ నేను లేనం' చనన్॥

ఉ॥ పుట్టిన దెల్ల గిట్టు మఱిఁ బుట్టును గిట్టిన దెల్లఁ; గావునం
బుట్టక నాకుఁ దీ రెడునె? పుట్టియు నీవలెఁ జేఁదుమేఁతునే?
పట్టగుభక్తి నీదుపదపద్మమరందముఁ గ్రోలు తేఁటినై
పుట్టెదఁ గాక, యొండగుచుఁ బుట్టిననేమిసుఖంబు? శంకరా॥ ౧౨౮

మ॥ కృతి, లోకోపకృతిన్, రచించిన కవిశ్రేష్ఠుండనుం బోలెఁ దా
మృతజీవుండగుఁ దత్త్వవేది పుడమిన్ మేనూడ్చి నిర్జేరినర్
బ్రతుకం గోరిననుం దపోర్థమయి, జీవన్ముక్తుఁడే యాటచే
నతఁ డెంచున్ గుడి యింటికంటెఁ బదిలం బౌనన్న నీతిన్ మృతిన్॥

మ॥ తనువుం జూడక భోగసాధనముఁగాఁ దద్భిన్న తత్త్వావలో
కనతాత్పర్యమతిం జరింతు నెపుడున్ గౌరీశ! తద్బాహ్యసీ
మనె; నీవుం బురబాహ్యదేశవసతిన్ మన్నింతు భూతేశ! జీ
వననిత్యత్వము దేహధారులకుఁ దెల్పం బూనియోనాఁ బ్రభూ॥

***

మ॥ అభిమానంబగు నొండ్ల వేఁడునెడ, నిన్నర్థించుచోఁ గాదుసు
మ్మిభచర్మాంబర! నిన్నుఁ గాదనుము నిం కేచెర్వునీ రానుదున్
శుభమా తెర్వోడఁ గూర్తు వేడకయ సంశోధించి వాంఛాఫలం
బభిసంధానగతిన్ సదాగతివి నీవై రాల్తు సర్వేశ్వరా॥ ౧౩౭

మ॥ ఎవ రెవ్వారికి నేమి యిచ్చినను నీవే యద్ది యవ్వారి క
త్తువు; ప్రత్యక్షవిరుద్ధమే యయిన నిందున్ లేదు సందేహ; మీ
యవనిం బాటెడియేళ్ళఁ జూచి యవి యద్యోచోట్లఁ బుట్టొందెనం
ద్రు; వివేచించిన వానిజీవనము పుట్టున్ మింటనే యీశ్వరా॥

ఉ॥ వేఁడిన వచ్చునే సుఖము? వేఁడక యుండిన రాకయున్నె? చే
కూడును గాలకర్మములు గూడ, స్వభావమువెంటఁ బ్రాణికిన్
వేఁడుట నీయహేతుకవివిక్తకృపం దలపోయకుంటెయా
వేఁడుటయేల యింక నిను వీడనిభక్తి భజింతు నీశ్వరా॥ ౧౨౯

ఉ॥ ఎవ్వరు వేఁడఁగాఁ నొసఁగి తీయఖిలంబును బ్రాణికోటికిఁ
నివ్వటిలున్ సమస్తమున నీనిరుపాధికమైన ప్రేమమే
క్రొవ్వునఁ బ్రేయమున్ మఱఁగి కోరకపోవఁగ శ్రేయమున్ నరుం
డవ్వల దోస మెవ్వరిది? యాత్మకృతం బగుఁగాక యీశ్వరా॥

***

శా॥ మేలుం గీడుఁ ద్రినేత్ర నీకె తెలియుం బెక్కేల నాదృష్టికిం
బాలౌఁ దెల్లనివెల్ల నల్లనివియున్ వాలాయమున్ నీళ్ళగుం
బాలన్ ముంచిన నీట ముంచినను నాభారంబు నీదేసుమీ
యాలోచించి కనంగ నాకమృతమే యారెండు సర్వేశ్వరా॥౧౩౧

శా॥ నీటం బుట్టెడు నిప్పు; నిప్పువలనన్ నీరంబునుం బుట్టు; ని
ప్పాటన్ దుఃఖమగుఁ సుఖంబు,సుఖముం బ్రాప్తించుదుఃఖంబునన్;
వాటంబెట్లగు నింక దేన నదియే భావింపఁగా నీశ్మైెఁ?
బాటిల్లున్ సుఖమే యఖండసుఖరూపంబుం బ్రభూ! నిన్గనన్॥

మ॥ తనరోగార్తిని జెప్పుకోఁదగును వైద్యశ్రేష్ఠుతో మందుని
మ్మని కోరందగు; నంతెగాక యిడుమీ యామందు నీమం దటం
చనరా; దట్టులె నేను నీదుకృపనే యాచింతు నన్నింటికిం
బనిలే దొక్కటి నొక్కి వేఁడఁగ నహంభావంబుతో నీశ్వరా॥౧౩౩

మ॥ సుకముం బొందెడుఁ బొంది దేహి యెటు లీక్షోణీస్థలిన్ నిద్దురన్
సకలార్తిన్ మఱవంగఁగల్గి; యటులే సర్వేశ! నే నీదుభ
వ్యకృపం గాంచినఁ గాంచినట్లయగు సంప్రార్థ్యంబు సర్వంబు వృ
ద్ధకుమారీవరనీతిపద్ధతిని, భక్తత్రాణబద్ధాదరా! ౧౩౪

***

శా॥ కూడుం గుడ్డయు నిచ్చికాదె ప్రభువుల్ కొల్పించుకొందెందు? నీ
జాడల్ చూడవిచిత్రముల్ రెయివగల్ సర్వేశ! నీదాస్యమున్
వీడన్రాదడుగంగరాదు మఱియున్ జీతంబు, బత్తెంబు మా
టాడన్రాదిఁకఁ జావకుండ మనియుం డట్లయ్యు నీబంట్లహో॥

మ॥ ఎఱుకం బుట్టినకోరికల్ దనుఁ గడుం బ్రేరింప నోదేవ! తా
నరిభీకృత్పటుధర్మసత్వగుణదివ్యాజిహ్మగవ్యాపృతిన్
హరియించున్ ద్రుపదాత్మజంబలెనె మాయామత్స్యయంత్రంబు నే
ర్పరియై కొట్టి నరుండు ముక్తితరుణిం బ్రాపించి నీసత్కృపన్॥

శా॥ అక్షయ్యంబగు దివ్యసంపదల నింద్రాదుల్ ప్రభూ! యెనిభ్రూ
విక్షేపంబునఁ గాంతు రేనిభ్రుకుటీవిక్షోభముంబోలె; న
య్యక్షీణాద్భుతశక్తియుక్తు నిను నాహా! యాదిభిక్షుండవై
భిక్షంబెత్తెడి రాజయోగిని గృపాభిక్షంబు యాచించెదన్॥ ౧౩౭

శ్లో॥ మయి కృపాం కురు దేవ సదాశివ
త్వమసి మే శరణం సుఖకారణం
తవ దిదృక్షు రహం దురితాపహం
హృది శుభావహ మంఘ్రిసరోరుహం॥ ౧౩౮

***

మ॥ ఎది నేవేఁడుదునో మదర్థమయి ని న్నీసంసృతివ్యాపృతిన్
హృదయస్థుండగు నీదు పెంపుకొఱకే యీశా! యదెల్లన్; సుఖ
ప్రదమౌ భక్తి యొనర్చినన్ జనని, గర్భస్థార్భకుం డెంతయుం
బొదలుంగాదె తదాశయంబు నొగి సంపూర్ణంబుఁ గావించుచున్

మ॥ నిదురన్ మేల్కనఁ బోవునప్పుడు దగున్ నిద్రింపఁగాఁబోవున
ప్పు దగుంగాక తదంతరంబునను నెట్టుల్ దృష్టిసంకోచమౌ?
నిదె న్యాయంబని యెత్తి పల్కఁగలఁజుమ్మీ! సూర్యుఁడే సాక్షిగా
సదయా! యీఁగదె దూరదృష్టి యిదు టిష్టంబేని సర్వేశ్వరా॥

శా॥ మోఁకాళ్ళన్ శిరసూని వ్రెల్గుఁగనఁగా మోమెత్తుకోలేని నా
యాకారంబును జూచి ప్రాజ్ఞతతి నా కంతర్ముఖత్వంబునే
చేకూర్పంగఁ దొడంగి రీకొడిమెలన్ సిగ్గయ్యెడుం జెప్పకో
నాకే లిట్టివిడంబనంబు! నగరే నన్జూచి సర్వేశ్వరా? ౧౮౧

మ॥ కడలం గ్రమ్మెడుఁ జిమ్మచీఁకటులు నాకన్నుల్ నిరర్థంబులౌ
నడుగుల్ తొట్రిలుజంకుకొంకు వాడమున్ హా! యెట్టు లేనొంటిమైఁ
బడుచున్ లేచుచు మిట్టపల్లములలోఁ బైనంబు సాఁగించెదన్
నడపింపంగదె యింకఁ జేకొని కృపన్ నన్నో జగన్నాయకా॥

చ॥ దివిజనదీతటంబులను దియ్యనిపచ్చిక మేసిమేసి త
త్త్వవిమలవారిఁ గ్రోలి సురపాదపమూలమునందుఁ గామధే
నువు తొలిచూలి పోలిక మనోజ్ఞతరాకృతినొప్పి నీదు సే
వవలను సూచుచున్ నెమరువైచుచు నంసెవలెన్ సుఖంబుమై.

ఉ॥ ఉండక బండియెద్దునయి యుర్విఁజనించితిఁ గాఁడి మోవఁగాఁ
గండలు రేఁగి ఫుండులయి కాయలుకాచిన మూఁపుఁ గ్రుంగ ను
ద్దండతఁ బట్టి కొట్టెడును దండధరుండయి కర్మచోదకుం
డండయొసంగి యీపశువునాపద లెప్పుడు పాపెదో ప్రభూ॥ ౧౪౪

మ॥ కనవో నేఁబడుచున్న బాములను "నీకర్మంబు నీదాటచే
ననుభోక్తవ్యము గాకతీర" దని కట్టా! నన్నుపేక్షింతువో!
ఘనతాపత్రయశాంతి గల్గునె భవత్కారుణ్యమే లేక? యెం
దును మందీయక లంఘనంబులనె యీదుష్టజ్వరం బాఱునే? ౧౪౫

***

ఉ॥ చల్లినదేదొ కోసికొని సమ్మతిమై భుజియింతుఁ జేఁదుమం
దల్లనఁ గన్నుమూసికొని యార్తుఁ డనామయసిద్ధికింబలెం;
జల్లఁగనొల్ల మీఁదనిఁక సంచితమెల్లను దగ్ధబీజమై
పొల్లయిపోవు నీవు పరిపూర్ణకృపన్ ననుఁ జూచినం బ్రభూ॥ ౧౪౬

శా॥ ప్రారబ్ధంబును సంచితంబు నటుపై నాగామి యంచిట్లుము
త్తీరౌకర్మమునందు రెండవదియే దృష్టంబు ధాత్రిన్ శుభా
కారంబైన త్రిమార్గగాజలమటుల్ గావింపు మద్దాని నో
కారుణ్యాంబుధి! నిన్నుఁ జేరునదిగా గంగాధరా! శంకరా॥ ౧౪౭

శా॥ ప్రారబ్ధక్షయకాంక్షినై యిటు లసారంబైన సంసారమన్
వారాశిం బడి కొట్టుకొంచు నెటులో త్వత్పాదముంద్వత్కృపం
జేరం జూచుచునుండఁ బట్టి ననుముంచెం బుత్రశోకోర్మి దు
ర్వారంబై యడుగంట! సిద్ధియిది చిత్రంబో గిరీశా! కనన్॥ ౧౪౮

క॥ నాజీవనార్థమెయ్యది
ఘ్యాజించికృపాసముద్ర! యొసఁగితొ యది త్వ
త్పూజోపకరణ మనియెడి
యోజనఁగయిక్కొంటిఁగాని యెందుగఁదలఁపన్॥ ౧౪౯

శా॥ పూవుల్ పళ్ళెరమందుఁ బెట్టుకొని త్వత్పూజార్థమేనుండఁగా
నీవైయం దొకదానిడాఁచితివి మన్నేత్రోపమానంబునే;
యీవేనాకు సుదర్శనంబుఁగొని నాహృత్పద్మమమ్లానమో
దేవా! నేమారిఁగాకపోయినను భక్తిం, ద్వత్కృపాపాత్రుఁడన్॥

క॥ పిలుపులకు నిదురమేల్కనఁ
దెలియనినరు వీఁపుచఱచి తెలిపెడుక్రియ నీ
పలుకు శ్రుతిఁజొరని మొఱకుం
దెలిపెద వాపదలచేతనే! సర్వేశా॥ ౧౫౦

మ॥ నిదురంబట్టిన నొప్పి తానిదురలోనే చక్కనైనట్టు లా
పద లేత్రోవను వచ్చునో, మరలిపోవంజాలు నాత్రోవనే
చదలన్ మబ్బులు గూడుఁబాయుమరలన్ ఝంఝామరుత్ప్రేరణన్
మది నంటింపఁ డెఱింగి ప్రాజ్ఞుఁడిది నీమాయావిలాసంబుగన్॥

***

మ॥ అరయన్ ధర్మనివాసమౌ గృహముభార్యామూలమై యుండుటన్
గిరికన్యాకృతి నొప్పునీప్రకృతి నంగీకారముంజేసి ని
ర్భరకారుణ్యమునం ద్రిలోకభరణ వ్యాపారసంసారముం
బరగంగైకొనునాదిపూరుషునిఁగా భావింతు నిన్నీశ్వరా॥ ౧౫౩

చ॥ అమృతహాలాహాలంబుల సమాదరవృత్తి భజించి శోకమో
దములను రెంటఁజిక్కక సదాశివయోగ పరాయణుండవై
శమితసమస్తదుస్తమము శాంత మఖండసుఖస్వరూపమున్
విమలమునైన తత్పదవి నిల్చి వెలుంగుదువో మహేశ్వరా॥

ఉ॥ ఎండకు వానకుం జలికి నేమెయి సస్యము పుట్టి పెర్గుచుం
బండునో యట్లె భూతతతి త్వత్త్రిగుణాత్మక మైనమాయ, బ్ర
హ్మాండశరీరమందు నుదయాభ్యుదయాస్తమయంబు లొందఁగా
నుండు దనాదిమధ్యవిలయుండవు నీవయి యోమహేశ్వరా॥ ౧౫౫

మ॥ నిదురం బొందెదు స్థావరంబులను, స్వప్నిం తింకఁ దిర్యక్కులం
దుఁ, దగన్ మేల్కనియుందు మానవునియందున్; దేవ! నీవిట్లుగాఁ
ద్రిదశల్ గాంచి,గుణత్రయంబునఁద్రిమూర్తిత్వంబుఁబ్రాపించియుం
డు దఖండాకృతిఁ బూని ముజ్జగమునందున్ సచ్చిదానందమై॥

మ॥ ఇను తేజోంశము సంక్రమింపఁ దనయం దెట్టుల్ హుతాశుండు దీ
ప్తి నెసంగున్ రజనీవృతుండయి యటుల్ దేవేశ! భాసిల్లెదీ
వును మాయాసముపాశ్రితుండవయి; నీపుత్రుం దగుంజెప్ప నిం
కను గ్రీనీడవెలుంగు దీపకళికంగా నన్నవిద్యాశ్రయున్॥ ౧౫౭

శా॥ ఈవున్ నేనొకతల్లిబిడ్డలమెనుమ్మీ! యొక్కపైన్ దివ్వటీ
నే వెల్గించిన జోడుదివ్వెలమెనుమ్మీ! యీశ్వరా! నాకిఁకన్
నీవే పెద్దవు ముందు పుట్టు కతనన్ నీక్రింద నేనుందు, నా
హా! వింతౌ నిఁక నీవు నేను నొకటే యాదివ్వటీవెల్గులో॥ ౧౫౮

***

శా॥ పాముల్ పుర్రెలు భస్మచర్మవిషముల్ భవ్యేతరంబుల్; సుధా
ధామస్వర్ణదిసర్వమంగళలు భద్రస్థానముల్ గా, నిటుల్
భీమంబై యభిరామమై తనరునీ లీలాకృతిం బోలి నీ
యీ మాయాపరికల్పితం బమరు సంసృష్టిన్ జగన్నాయకా॥

మ॥ అకటా! మన్మథు నెట్లు గెల్చితో విరూపాక్షుండవై? యెట్లు లీ
వకలంకుండవొ నెత్తిఁ బెట్టుకొని యూహా! తత్కళంకిం బ్రభూ!
యిఁక భోగీంద్రవిభూషణుండవయి యోగీంద్రుండ వెట్లైతివో
సకలంబున్ విపరీత మద్భుతము నీచారిత్ర మోయీశ్వరా॥

చ॥ వటుఁడవు పార్వతీహృదయభావపరీక్షకు, లోకరక్షకున్
నటుఁడవు; సూత్రధారుఁడవు, నాటకముంగను ప్రేక్షకుండవున్
భటుఁడవు భక్తసంతతికిఁ, బట్టి గ్రసింపఁగవచ్చు మిత్తికు
ద్భటుఁడవు, నాదుడెందమునఁ దాండవమాడు మహానటుండవున్

ఉ॥ శాంతమనోజ్ఞమూర్తివయి సాధులఁ బ్రోచెడిపట్టునన్ భవ
త్కాంతయు నంబికాకృతిని దాల్చెడు, నీవిఁకఁ బాపకర్మకా
లాంతకఘోరమూర్తి వగునప్పుడు చండికయై చరించెడున్
వంతును గొంచు; నిట్టు, లతివల్ పతివర్త్మగలౌదు రేకదా॥ ౧౬-౨

ఉ॥ మామకహృత్సరోవిహారమాణమరాళవిభుండవైన నా
సామిని నిన్ను నేమనుచు సన్నుతియింతును భక్తిపెంపునన్
రాముఁడవన్ననుం బురవిరాముఁడవన్నను మానిమానసా
రాముఁడవన్న నెంతో యభిరాముఁడవౌదువు నాకుమాధవా॥

మ॥ ఎవ రేపేరను భక్తిఁబిల్చినను నీవేపల్కు దోయంచు; నీ
భువనంబందును నీవుగానిదగు నేభూతంబు భవ్యంబు లే
దవురా! నీవు సహస్రనాముఁడవు సర్వాత్ముండవై యుండఁగా
నవునే నీకిఁక నామరూపములు లేవంచాడ సర్వేశ్వరా॥ ౧౬౪

మ॥ హరియన్నన్ హరుఁడన్న నొక్కటియకాయంహోఽపహారక్రియం
బరమానంద రసానుభూతి రుచిర బ్రహ్మైక్యభావంబునన్
హరికిన్ ధ్యేయమవీవు, నీకు హరి ధ్యేయం, బౌటచే నాకు లే
దరయన్ వస్తువిభేదబుద్ధి పరమేశా! యించుకంతేనియున్॥ ౧౬౫

***

మ॥ అరయన్ సత్యము వస్తుతంత్రమెయగున్ వ్యాపారతంత్రంబుగా
దరయంజాలక దీని మూఢుఁడు మదీయంబౌ మతంబే సమా
దరణీయంబని యెంచి యన్యమతనిందం జేయఁగాఁబూను; నె
వ్వరికైనన్ భవదీయతత్త్వ మిఁకదేవా! సచ్చిదానందమే॥ ౧౬౬

శా॥ సత్యం బేకడనున్న నీవ యగు దోసర్వేశ! యేమన్న నిన్
సత్యం జ్ఞాన మనంత మంచిటు శ్రుతుల్ చాటుంగదున్; నిత్యసాం
గత్యంబౌటను నీకు సత్యమునకుం, గన్పట్టదేనిన్ ఫల
వ్యత్యాసంబు గ్రహింతు మానినదె మందన్న ట్లదెందున్ననున్॥

మ॥ పరధర్మంబు భయావహం బగుటచే, వర్జింపఁగారా దిఁకన్
మరణంబయ్యు స్వధర్మమున్, నరుఁడు సన్మార్గంబుఁ బ్రాపింపఁగా
సరసీతీరము వీడి, కచ్ఛపము హంసద్వంద్వముంగూడి, యే
గి, రయం బోర్వక కూలె మానససరఃక్రీడాభిలాషంబుతో॥ ౧౬౮

శా॥ ధర్మంబంచు నధర్మమంచును వ్యవస్థల్ సేయుటేకాని త
న్మర్మం బెవ్వఁడెఱుంగు భూతలనభోమధ్యస్థరేఖంబలెన్
ధర్మాధర్మవిచారదూరమయినిస్త్రైగుణ్యమై శాంతికిన్
వర్మంబైనదె ధర్మ మందెనిలుచున్ సర్వంబు సర్వేశ్వరా॥ ౧౬౯

***

శా॥ ఆకాశంబుననుండి భూపతితమా స్వచ్ఛోదకం బెట్లనే
కాకారంబుల నామభేదములఁ బ్రఖ్యాతిం గడుం దాల్చు; న
ట్లేకంబై బహుధావిభక్తమగు, నాదృగ్దోషమో, మాయయో
లేకీరెండునా? యేదియైననుగనన్ లేకుందునిన్నీశ్వరా॥ ౧౭౦

మ॥ ఒకచంద్రుండె నభస్థలిన్ వెలుఁగు చేమోకాని నాకన్నుదో
యి కనేకాకృతులం గనంబడెడు; నట్లే నీవు నో దేవ! యీ
సకలంబందు వెలుంగుచుండియు, మదజ్ఞానంబుచే నాదుబు
ద్ధికి నావర్తతరంగబుద్బుదము లబ్ధింబోలె వేఱౌదయో॥ ౧౭౧

శా॥ ఛాయారూపము లద్దమందుఁ గననౌచందాన నీమాయచే
నీయందుండు సమస్తభూతములునున్ నీవుండ వవ్వానిలో
మాయంబై యవి కాలకర్మవశతన్ మబ్బుల్బలెం బోవఁగా
నోయీశా! వెలుఁగొందెదంబరమునన్ జ్యోతిస్స్వరూపంబునన్

శా॥ ఆధారంబును గావు భూతములకీ వాధేయముంగావహో
బాధింపంబడుఁగాదె యాదువనినం ద్వత్పూర్ణభావం బిఁకన్
బోధించున్ శ్రుతి యూర్ణనాభివలెనే పుట్టింతువీవంచు; నే
సాధింతున్ భవదాత్మభావితముగా సర్వంబు సర్వేశ్వరా॥ ౧౭౩

మ॥ సకలాశాగతియై సదాగతి కధిష్ఠానంబుగానుండి తా
నొకచో నంటక ముట్టకుండెడుఁగదా వ్యోమంబు తద్వాయువున్
వికృతింబొందెడి భూతసంతతికి 'నస్పృశ్యుండ' వాదట్టులే
యకలంకుండవె యయ్యుఁ జిత్రము మహాత్మా! నిర్వికారప్రభూ॥

మ॥ నిను సర్వాంతరయామిఁగా నెపుడు చింతించున్ నరుం డప్పుడే
కనునేకత్వము, నన్వయించుకొను నింకన్ 'నేహ నానాస్తి కిం
చన' యన్నీవచనంబుఁ గన్దెఱచియున్ సర్వేశ! కన్మూసియుం
దనవెల్లే కనుచుండి కానక తదన్యం బెప్పుడున్ లో, వెలిన్ ౧౭౫

***

మ॥ వెలుఁగుం బ్రాణముఁ బ్రేమ మీవగుదు వోవిశ్వేశ! నాకుం;ద్రిశ
క్తులతోఁ గూడిన యేకమూర్తివిత్రిమూర్తుల్ దాల్చిమూఁడౌగుణం
బులచే వేఱుగ మూఁడుతావలములం బొల్పార నిత్రీవనం
దలఁపంజొప్పడి యొప్పు దేహమునమేదశ్వాసనవ్యూతోఁ-శముల్

మ॥ రసమీవౌదువు, నిన్నుఁబొంది సుఖముం బ్రాపించుమర్త్యుండు;భూ
రిసుఖాధారము ప్రేమపాత్రమగుఁ, దత్త్వేమంబు సౌందర్యసా
రసుధాంభోధియగుం, దడంబునిధియున్ రాజిల్లు నెంతే నరా
జనశృంగారరస ప్రవాహమయమై సర్వేశ! యేకాకృతిన్॥ ౧౭౭

గీ॥ శివుఁడవగుదువు శివతరుండవును నగుదు
వణుతరుండవు నగుదు మహత్తవగుదు
వొకఁడవగుదువు సద్వితీయుండవగుదు
వగుదు సర్వంబు నతిసర్వ మగుదువీవు॥ ౧౭౮

***

ఉ॥ రాగము పాడిపాడి మధురంబుగఁ దత్కృతి వెన్కఁ బాడరో
బాగుగ ముందుతత్కృతిని బాడుచుఁ దత్కళ వెన్కఁ జూపరో
యేగతినైన నేమి సుఖమేగద రెంటను నిల్చిపోల్చెదుర్
యోగికి నిర్గుణంబు మఱియున్ సగుణంబు నొకండ, శంకరా॥ ౧౭౯

మ॥ సగుణంబో యగుణంబో లేకుభయమో చర్చింపఁగాఁజాల నో
త్రిగుణాతీతుఁడ! నీదుతత్త్వమును జింతింతుర్ సదా శాంతిఁగా
నగు సంకల్పముఁజేయ నాకు నిఁకఁ బ్రాణాయామపూర్వంబుగాఁ
దగ మౌనవ్రతధారణంబునకు నేతచ్ఛాంతి సంసిద్ధికై॥ ౧౮౦

ఉ॥ మౌనమ! చంచలేంద్రియసమాజకవాటపిధానమా! నిర్
ధ్యానముసేతు నాపయిని నల్లనవ్రాలుము; శాంతిదేవికిన్
మానుగ నీవు నాల్కవఁట నాచెవి నూఁదవె తద్రహస్య మో
మానితభావరత్నఖని—మాటలు వేయును నేలనాకిఁకన్॥ ౧౮౧

ఉ॥ భావమె లోనఁబాడుకొను పాటవిధంబున నింపుసేయుఁ; ద
ద్భావముఁ బల్క పల్కొ యిఁకఁ బానకమందలి పుల్లయేయగుం;
గావున మౌనమూని యవికల్పసమాధిని నిల్పి చిత్తమున్
భావవికారదూరు, నిను భావనసేసెద నోమహేశ్వరా॥ ౧౮౨

ఓం శాంతిః శాంతిః శాంతిః





ఓం

శ్రీపరమాత్మనే నమః

# అమృతకలశి*

శ్లో॥ నియతికృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం
నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీకవేర్జయతి॥

మమ్మటభట్టు.

మ॥ తలలో నాలుకవోలె నీవు మెలఁగం దాసృష్టిఁ గావింపఁగా
వలనయ్యెం;జతురాస్యుఁ డయ్యును మెదల్పంజాలునే నోరు నీ
యలఘుప్రేరణశక్తి లేక యిసుమంతైనన్;సమస్తాత్మచి
త్కళవైయొప్పెడిదేవి! నీ కిదె నమస్కారంబు వాగీశ్వరీ॥ ౧

శా॥ ఆరోగ్యంబు సెడెం,గుటుంబభరణాయాసంబు హెచ్చెన్,సుదు
ర్వారుల్ పైయధికారులైరి,మఱి సేవాముక్తిభాగ్యంబునున్
దూరస్థంబగు,జీవితంబు వెగటై తోఁచున్;మఱేమన్న ని
న్నారాధింతు నటన్న యాశ యొకటే యాలంబమై నిల్పెడున్॥ ౨

శా॥ పేదల్ పేదఱికంపుఁబెన్వెతలకున్ బెగ్గిల్లి యొక్కింతసే
పాదల్ మానఁగఁ దప్పఁద్రావి పడియుండ్రక్లే మహాసంసృతి
ప్రాదుర్భూత విషాదఖేదములకుం బాల్పడ్డ నాడెందమున్
నీదివ్యామృత మాని చొక్కి మఱచున్ విశ్వంబె వాగీశ్వరీ॥ ౩

*తొమ్మిదేండ్లక్రిందట ఇందలిపద్యములలోని తొంబది ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక (7-వ సంపుటము 4-వ సంచిక) లోఁ బ్రచురింపఁబడినవి.

శా॥ అన్నం బేటికిఁ బానమేటి కమృతాహారంబు చేకూరఁగాఁ
గన్నుల్ మోడ్వఁగఁ బారవశ్యమున నింకన్ నిద్రయించేల? స
ర్వాన్నత్యంబు ఘటిల్ల భావజగతిన్ బాహ్యప్రపంచం బిఁకే
లెన్నన్ భేదము యోగికిం గవికిఁ దానింతేనియున్ లేదహో॥ ౪

శా॥ కోరన్ మువ్వలు పోఁగు లుంగరములుం గోరన్ దుకూలంబులం
గోరన్ మేడలు మిద్దెమాడుగులునుం గోరన్ హయాందోళికల్
గోరన్ దగ్గది యేదియో నరుల కీక్షోణిస్థలిన్ దాని వే
మాఱుం గోరుదు దేవి! నిన్గొలువఁగం బ్రాపించు నానందముం॥ ౫

ఉ॥ అత్తకు నీకు వైరమని యాడిడి సేయుదు రజ్ఞులయ్యయో
విత్తముఁ గూర్పఁజాలు బలువిద్దియ లుండఁగ నెన్ని యో రసా
యత్తమతిన్ మధువ్రతము లక్కమలాకరముంబ లెం గవుల్
మెత్తురు సత్కవిత్వమును మిక్కిలియున్ గతకాంచనస్పృహన్॥ ౬

క॥ వనదేవతాప్రసాదము
నను బదముల నొయ్యనిడ వనము తెర్వున రా
మునిసతికిఁ దొలఁగె ముండులు
నన లయ్యెను గండ్లు నట్టె నాకవిత నొగిన్॥ ౭

క॥ ప్రేమాదికములు తొలఁగి య
సామాన్యము లగును దేవి! సామాన్యములున్;
సామాన్య మగునె నీదుకృ
పామహిమ? ఘుణాక్షరముగ భావింపఁజుమీ॥ ౮

ఆ॥వె॥ మెచ్చి వసుకవీంద్రు,మెచ్చరేని యతండు
మెచ్చుకవిత సరసు లిచ్చ, నది య
పూర్వసరసత యగుఁ; బొరయునే దేవి! నా
ముదము వైపరీత్య మదికతముగ॥ ౯

మ॥ వినతుండై తనవిద్దెవేఁడు చిఱుతన్ వ్రేల్వట్టి దిద్దించుఁ;గా
దనఁడుం, జేయఁడు శక్తివంచన మసూయం జేసి; యచ్చోట సె
ట్లొనరించున్ గురుధర్మకోవిదుఁడె యయ్యున్ సత్కృపామోది య
య్యును ద్రోణుండలసుబ్బరాయకవితో నొప్పారఁగా సఖ్యమున్॥

మ॥ కవితాతత్త్వవిశారదుం డగుటకై కాశీనవద్వీపవా
సవృథాయాసము లేల? పూర్వభవసంస్కారంబు వాణీప్రసా
దవిశేషంబును గల్గ మూఁగయు వసంతశ్రీ సమారంభవే
ళ వనీపాళిఁ బికంబువోలె మధురాలాపంబుఁ గావించెడున్॥ ౧౧

మ॥ కవనం బన్నను గాజుకుప్పెఁ గొనితేఁ గాసంత గంగాజలం
బవునే? పెద్దల కెల్ల దాహశమనంబై యోలలాడంగఁ ద
చ్ఛివమూర్ధోపరి ఖేలదంబరధునీ దివ్యప్రవాహంబులన్
భువిఁ బాఱింపవలెన్ భగీరథతపఃపుణ్యంబునన్ గణ్యుఁడై॥ ౧౨

క॥ కలుగుదురు గాని కవు లిలఁ
గలిగింపంబడ రటంద్రు ఖండాంతరవా
సులు; ప్రాగ్భవకృతవిశ్వా
సులు గాకయ్యుఁ బలుకుటిట్లు చోద్యము కాదే॥ ౧౩

క॥ ప్రతిమనుజుఁడు కవియే యగుఁ
బ్రతిమనుజుఁడు శిల్పి యగును ప్రతిమనుజుఁడు మా
నితసుందరతాప్రియుఁడగుఁ
బ్రతిమనుజుం డీశ్వరునికిఁ బ్రతిబింబముకా॥ ౧౪

క॥ జీవమయుఁడైన యీశ్వరుఁ
డీవిశ్వము తనదుకళఁగ సృజియించినటుల్
భావజ్ఞుఁడైన కవియే
జీవకళాశోభితముగఁ జేయుఁ గవనమున్॥ ౧౫

***

ఉ॥ ఇంద్రియగోచరం బగుచు నేవిషయంబొ కవీంద్రుడెందమున్
సాంద్రవికారభాజన మొనర్చుచు నస్తమితాన్యభావని
స్తంద్రముఁ జేసి యవ్వెనక సర్వముఁ దానయి నిండి పొంగి స్వ
చ్ఛందగతిన్ రసాకృతిని జాల్కొనఁగా నదె కావ్యమయ్యెడున్॥ ౧౬

గీ॥ విషయమునుబట్టి వృత్తియు వృత్తిఁబట్టి
విషయమును మాఱుచుండుట విదితమెకద;
స్ఫటికమణి కెంపుఁదాల్చు దాసనముచెంత
రజ్జువును సర్పమగు భయభ్రాంతుమ్రోల॥ ౧౭

క॥ హృదయముననుండి వెడలిన
యది, హృదయమె చేరి ప్రియులయనురాగమటుల్
గదియించుఁ గవిని జదువరి
నిదియేసుఁడి కావ్యబంధ మేమనకొనిరో॥ ౧౮

ఉ॥ వస్తువుతోడిదైక్యమును భావనసేసిన సుప్రశస్తమౌ
వస్తువుకన్న భిన్నుఁడయి వర్ణనసేసిన మధ్యమంబగున్
వస్తువుఁ దానుఁగాక మఱి పాఠకుఁడుం దనబుద్ధి నిల్పినన్
ధ్వస్తమగుం గవిత్వ మది ప్రజ్ఞనె వెల్లడిసేయఁ బూనుటన్॥ ౧౯

మ॥ తెలుఁగున్ సంస్కృతమాంగిలేయమని ప్రత్యేకంబుగాఁ గొన్ని భా
షలెకా దన్ని యెఱుంగ నేరుతురు ప్రజ్ఞాచక్షులై దక్షులై
అలలుం గాలులు మబ్బులుం బలుకఁగా నయ్యర్థ మూహించుచుం
బలుకన్నేరుతు రింపుగాఁ బ్రకృతికిన్ భాష్యప్రణేతల్ కవుల్॥ ౨౦

మ॥ శిల లేడ్వన్ విని చెప్పలేదె మనకున్ శ్రీకంఠుఁ డుత్కంఠుఁడై
సెలయే ఱొక్కటి కొండ కవ్వలిదరిం జేయన్ విలాపంబు, న
త్యలఘుప్రజ్ఞుఁడు రామభూషణుఁడు కుయ్యాలించి పాలింపఁడే
పలుకన్నేరుతు రాంతరప్రకృతిభావజ్ఞుల్ కవుల్ ప్రౌఢులై॥ ౨౧

గీ॥ ప్రకృతి యనురాణి యాస్థానరమ్యభూమిఁ
జేరి సేవింతు రెందఱో వారిలోన
నాంతరంగికు లెవ్వారు నరయఁగారు
యోగమహితుఁడు కవివరుం డొకఁడుదక్క॥ ౨౨

మ॥ ప్రకృతిం బట్టి పరీక్ష సేయుటయె మావ్యాపార మంచున్ సదా
యొకచేఁ గత్తియు గాజుగొట్టమొకచే నొప్పింపఁగాఁ బట్టి, యం
దొకయంశంబును బెక్కుసంశయములన్ యోజించి లోఁజూడనే
రక యల్పజ్ఞతఁ గ్రిందు మీఁదరయుశాస్త్రజ్ఞుల్ కవుల్ వేఱహో॥ ౨౩

ఆ॥ వె॥ కత్తికోఁతలేదు గాజుగొట్టములేదు
మాతనెత్రు శోధసేఁతలేదు
ఒనరుప్రేమఁ బ్రకృతియొడిఁజేరి చనుఁగ్రోలి
మేనుమఱచి నిదుర కాని కవికి॥ ౨౪

గీ॥ ప్రకృతి తనుఁబట్టి బాధించువారి కేదొ
కడుపునకుఁ బెట్టి కన్నీళ్ళు దుడుచుఁగాని
దాఁచిపెట్టును దనపెన్నిధాన మింక
యోగమహితుఁడు కవివరేణ్యునకుఁగాను॥ ౨౫

ఆ॥ వె॥ సుకృతిగాఁడె సుకవి ప్రకృతితో నేకాంత
గోష్ఠి నుండుఁ గానగోనలందుఁ
దపసివోలె నెపుడు తత్వంబె చింతించు
మధురరసముఁ గ్రోలు మధుపమట్లు॥ ౨౬

గీ॥ తత్వవేత్తకు నేది సత్యముగఁ దోఁచు
నదియె సౌందర్యరూపమై యమరుఁ గవికిఁ
జండమార్తాండ తేజఃప్రసారమెగద
నిండుచందురు పండువెన్నెలగ మారు॥ ౨౭

క॥ ఏకాగ్రచిత్తుఁ డయి త
త్వాకలితహృదయుఁ డయినమహాకవి ఋషియే
గాకొరుఁడె? తగులు నాతని
వాకునె యర్థంబునీడ వస్తువువోలెన్॥ ౨౮

క॥ పువ్వులపయిఁ దేఁటి వోలెం
దవిలెడుఁ దానెపుడు వాసనాప్రేరితమై
కవిమనసు మధురవస్తుల
భువి సుమహితవృత్తుల కిది పోలునుగాదే॥ ౨౯

క॥ కవిహృదయ మన్యహృదయం
బువిధంబునఁ బద్మకోశమున కెనయగుఁ; గా
ని విశేష మెన్న ఘటసం
భవు పుడిసిలియట్లునిండఁబట్టుం గడలిన్॥ ౩౦

గీ॥ కామధేనువు పొదుగట్లు కవిహృదయము
మధురరసపూర్ణమయి చేఁపి మాటిమాటి
కమృతధారలు గురిసెడు నహహా! విబుధు
లాని యానంద పారవశ్యమును జెంద॥ ౩౧

క॥ కనుదెఱచి మూసెనేనియు
ఘనుఁడగుకవి ముజ్జగంబుఁ గట్టివయిచు; వా
మనమూర్తి పదత్రయిక
న్నను బలవత్తరము భావనాదృష్టియహో॥ ౩౨

క॥ ఉన్నది లేనట్లుగ మఱి
యున్నట్లుగ లేనిదాని నొగిఁ జెప్పి కవుల్
కన్నులగుచుండ వీనులు
పన్నదు రారార! మాయపన్నాగంబుల్॥ ౩౩

ఆ॥ వె॥ శిల్పనిపుణుఁడైన చిత్రకారుం డెట్లు
సూక్ష్మములను జూపు స్థూలములను
ప్రౌఢకవియు నట్లె ప్రకటించు భావంబుఁ
బూవుఁదెచ్చి ముక్కుపొంత నిడఁడు॥ 38

గీ॥ పెదవిఁ గదలింపకుండ నవ్వినయలంతి
నగవు కనుదోయిఁ గేవల నిగిడి మొగముఁ
దమ్మి వికసింపఁజేయుచందమున మెఱసి
ప్రౌఢకవివాక్కు హృదయంబునలరఁజేయు॥ 39

క॥ చెప్పఁడు కవి భువి నితరుఁడు
చెప్పెడిక్రియ మఱుఁగువిడిచి చిత్రం బేదో
గుప్పిటనిడి యూరించును
జెప్పికొనెడిదాఁకఁ దండ్రి శిశువులనఁబలెన్॥ 3౬

గీ॥ నవరసామోద మేదురం బవుచు, వివిధ
పాకరీతుల నొప్పు కావ్యము సువర్ణ
పాత్రికలయందుఁ గవిమహాభాగ్యశాలి
యమృతమస్తని యిడును మృష్టాన్నమట్లు॥ 32

ఆ॥ వె॥ పావనసలిలప్రవాహంబుపోలిక
సుప్రసన్నభావసుఖ దమగుచుఁ,
దగుగభీరతాప్తిఁ దగియు దుర్గ్రాహంబు
గాక యొసఁగు సరసకవన మెపుడు॥ 3౮

***

క॥ నోరిక్కొలఁదు లాడఁడు కవి
మేరువుఁ దృణముగఁ దృణంబు మేరువుగాఁగన్
సార మసారమసారము
సారము గావించు శక్తిసామర్థ్యమునన్॥ ౩౯

ఆ॥ వె॥ కాలిక్రిందితృణము కల్పవృక్షముగాదొ
కడఁగిచేని కవులు కల్పనలకు;
గటికవేళ్ళు దెచ్చి కావింపఁ బచ్చడి
యమృతతుల్య మయ్యె ననుట వినమె॥ ౪౦

ఉ॥ చీఁపురుఁగట్టపైని మును "స్విఫ్టు"ను హాస్యవిశారదుండు, ధీ
నైపుణి యేపుమీఱ వచనంబునఁ జూపిన యుల్లసద్రసో
ద్దీపితభావసంపద నుతింపఁ దరంబె? మహాద్భుతంబె కా!
చేపడుఁగాదె చీఁకునకుఁ జేవయుఁ జెల్వను శిల్పకల్పనన్॥ ౪౧

క॥ మసిబొగ్గొ సుద్దగోడయొ
యిసుకయొ ముని వ్రేలొ చేతి కెదియందు నదే
పొసఁగు నుపకరణమై; చి
త్తసముద్రేకంబు నాఁగఁ దరమే కవికిన్॥ ౪౨

శా॥ రమ్మన్నన్ వెసరావు, రావలదనన్ రాకుండఁగాఁ బోవు, ర
మ్యమ్ముల్ కైతలకుం గళాకళలు వేళావేళలుం గల్గు సం
భ్రమ్మం బొందెదు పాటుపోట్లకుబలెన్; సంగీతసాహిత్యమా
ర్గమ్ముల్ వోయివి స్వస్థచిత్తులకుఁ దక్కం ద్రొక్కఁగారానివా॥ ౪౩

ఆ॥ వె॥ చీమ చిటుకురన్నఁ జీఁకాకుఁ జెందెడు
నెదుట భేరి మ్రోయ నెఱుఁగకుండు
సున్నితంబుగాదు సూడ మ్రోడనరాదు
కవిమనంబు తెఱఁగు కవియె యెఱుఁగు॥ ౪౪

ఆ॥ వె కాఱుమబ్బు గ్రమ్మ కటికచీఁకటిరాత్రి
త్రోవ తెన్ను గనక త్రొక్కులాడి
యట్టె మెఱుపుమెఱసి యర్థ మెల్ల స్ఫురింపఁ
బాంథుఁడట్లు కవియుఁ బ్రమద మొందు॥ ౪౫

ఉ॥ ఆవి రదృశ్యరూపమున నర్యమతప్త మహార్ణవోద్గతం
బై వినువీథిఁ జల్లగ నవాంబుదరూపము నొందునట్లుగా
నేవో యసంగతార్థము లనేకముగా హృదిఁ దోఁచి భావముల్
వే విపులత్వ మొందెడు వివేకసమీకృత రమ్యమూర్తులై॥ ౪౬

మ॥ తొలుత౯ సన్నని నూలుపోఁగువలెఁ బ్రాదుర్భూతమై సాఁగి, యా
వల నంతంత స్వభావమైత్రి నెఱపం బ్రాపించు నేళ్ళం గడుం
బలుపుం జెంది, యతిక్రమించి విషమావస్థల్ ప్రశాంతి౯ సమ
స్థలిఁ బాఱుం గవిరమ్య మానససర స్సంభూతగంగౌఘముల్ ॥ ౪౭

***

క॥ అది యిది వ్రాయుం డనుచు సు
హృదు లెంతయు వేఁడుచుందు రెది వ్రాయుదు? లే
నిది వ్రాయు టశక్యం బు
న్నది వ్రాసిన మెచ్చ రింక నగు ఘానంబే॥ ౪౮

క॥ తుడిచెను ముత్తెము లన్నియు
విడిచెను మఱి నత్తగుల్లపిండెల్లను బా
ణుఁడు మేటిధీవరుఁడె యగు
. నడఁచెన రత్నాకరాఖ్య నంభోనిధికిన్॥ ౪౯

ఉ॥ చెప్పెడిదేమి క్రొత్తగను చెప్పెడిచోప్పులె క్రొత్తగా కిలన్
జెప్పఁగలట్టివాఁ డెప్పుడు జీవదశాపరిణామతత్వమే
చెప్పెడుఁగాని వేఱొకటి చెప్పఁగ నేరఁడు నేర్చనేనియుం
దప్పక వాని నెన్నఁదగుఁ దాఁ దననీడను దాఁటుజాణఁగా॥ ౫౦

ఆ॥ వె॥ క్రొత్తత్రోవ ద్రొక్కి క్రొత్తసీమలఁ జూపి
క్రొత్తచవులఁ దేల్చి చిత్తములకుఁ
గ్రొత్తవికసనంబుఁ గూర్పని యాకైత
సెప్పియేమి యింకఁ జెప్పకేమి॥ ౫౧

గీ. ప్రాఁతబంగారుతోఁ గ్రొత్తరవణ మొకటి
సేసి ధరియించుకొన సంతసింత్రు సూచి;
కంచమును మార్చి మట్టెలఁ గాళ్ళఁ దొడిగి
కులుకునొయ్యారిఁ జూచి నగుదురు జనులు॥ ౫౨

గీ॥ పద్యమును గద్యముగను శ్రావ్యమును దృశ్య
ముగను, నట్టిట్టుసేయ నేమగును? దానఁ
బ్రకటితముగాదు మనప్రజ్ఞ సుకవులార
మూలమగును వెల్తిప్రసంగమున కదెల్ల॥ ౫౩

గీ॥ పాడినదె పాడెదేని మున్ పాడినట్టి
వారికన్నను సొగసుగాఁ బాడవలయుఁ
బాడలేకున్న నగుమరు బ్రాఁచిపండ్ల
దాసరీ యంచు నిను గేలిసేసి జనులు॥ ౫౪

గీ॥ పరమపురుషార్థ మనుచును వ్రాసినదియె
వ్రాయఁదలఁచినఁ దప్పులే దేయెడలను
రామకోటులు వ్రాసి శ్రీరామపాద
పద్మసన్నిధి నిడమె సద్భక్తి మ్రొక్కి॥ ౫౫

***

శా॥ పద్యం బల్లుటయే కవిత్వమని సంభావించు సాహిత్యస
ద్విద్యాగంధదరిద్రు లెంచ నరులే? పెంజీఁకటిం గానలో
ఖద్యోతంబులఁ జూచి నిప్పులనుచుం గ్రాఁగం జలిం బ్రీతిమై
నుద్యోగించెడి వెఱ్ఱివానరులెగా కూహించి చూడం గడున్॥ ౫౬

క॥ వసుచరితమొ మనుచరితమొ
కసిగాట్లుగఁ గొఱికి లేచి గట్టునఁ ద్రేఁపన్
రసహీనులు కవనపుఁబే
ర్వాసఁగించెద రాయజీర్ణపుం ద్రేఁపులకున్॥ ౫౭

క॥ కోయిల గూసినయట్లే
హాయి గొలుపవలదె మదికి నానందరస
ప్రాయమయి కవన మట్టి
ప్రాయంబగు చిలుకపలుకువలెఁ గాక వినన్॥ ౫౮

ఉ॥ తియ్యనినీరుఁ గొబ్బరియుఁ దేపకుఁ ద్రావ భుజింప నబ్బునం
చొయ్యనఁ గోశముం దెఱచి యోపికమైఁ బరికించి చూడఁగా
నయ్యయొ పేదకొంపవలె, నజ్ఞమనంబునుబోలె శూన్యమై
దయ్యపుఁగాయ యయ్యెనువృథాశ్రమ మిచ్చుచు నేమిసెప్పుడున్॥

ఆ॥వె॥ టెంక తొక్క దక్క నింకేమి లేకొక్క
మాఱు చప్పరించి పాఱవేయు
బుడుతమావిపండ్ల పోలికఁ దుచ్ఛంపుఁ
గృతిశతంబు లేమితృప్తి సేయు॥ ౬౦

గీ॥ విఱువ విఱుగక కొఱుకంగఁ గొఱుకువడక
నమలనమలంగఁ జప్పనై నారసాఁగి
నోరు నొప్పించు కవనంపుధోరణులకు
మ్రొక్కు——ముదురుఁబాకపుజీడిపిక్కలకును॥ ౬౧

క॥ భాసురమగు రసము రసా
భాసము ననురెంటి వన్నె వాసియుఁ గనకే
చేసిన కవనము బంగరు
పూసిన రవణమ్ముఁబోలె మోసముఁ దెచ్చున్॥ ౬౨

గీ॥ చిన్నిబోగముపిల్ల గజ్జియను గట్టి
యభినయించెడి శృంగారమట్లు కవియు
ననుభవములేక వర్ణించు నట్టిదియును
రసికహృదయంబులకుఁ గాదు రంజకంబు॥ ౬౩

క॥ భావమునకుఁ దగుపద్దెము
గావలెఁ; గాదేని కుంభగతదీపమగున్
జీవున కుపాధి దొడ్డది
యై వెలయక సుప్రకాశ మబ్బదుగాదే॥    ౬౪

క॥ తావియెసంగని కుసుమము
జీవకళాహీనమైన చిత్రపటంబున్
దేవుండు లేని కోవెల
భావవిశేషంబులేని పద్యం బరయన్॥    ౬౫

గీ॥ భావదారిద్ర్యమేగాక పద్దియంపు
సొంపుఁగఅవును గూడినఁ జూడవశమె
మొట్టినోటికి సాయము తొట్టిపండ్లు
నైన నెటులుండునో వేఱె యాడవలెనె॥    ౬౬

ఆ॥ వె॥ పద్య మెంత ప్రౌఢభావమైనను శ్రుతి
కింపుగాక మతికి నింపుగాదు
కంటి కింపుగాక గాదింపు నోటికి
నెట్టిమధురవస్తువేని నిజము॥    ౬౭

***

మ॥ ప్రతిపద్యంబు రసాస్పదంబుగ రచింపన్ శక్తి లేదేని పం
డితులుం బామరులుం జెలంగి పొగడన్ లేవేని నేర్పుల్, పురా
కృత మింతేయని చింతనొందఁ దగదింకేమన్నఁ బ్రాజ్ఞుండు సం
స్కృతకావ్యామృత పానమత్తమతియై క్రీడించు టొప్పంగదా॥

ఆ॥ వె॥ ప్రాణి యూర్పుఁబుచ్చు భావంబు వెలిఁబుచ్చు
మాటనైన నొండుపాటనైన
నల్ల ముల్లసిల్ల నూరకుండఁడు, దీయు
మూఁగయైనఁ గూనురాగ మొకటి॥ ౧౯

మ॥ తన కానందముఁగూర్చు తందనములం దామెచ్చుకోఁజెల్లెడుం
దనకీడైన జనంబు మెచ్చఁదగు, లేదా లొచ్చువారేనియుం
దనకుం బెక్కుమడుంగు లుత్తములు తత్త్వజ్ఞుల్ ప్రశంసింపలే
దని దూపిల్లుచుఁ దాల్మిఁబోవిడిచినన్ హాస్యాస్పదుం డయ్యెడున్॥

క॥ రసవంతమేని కావ్యము
రసికులు తమయంత మెచ్చి ప్రాపుదు రెలమిన్
భసలములు పారిజాత
ప్రసవంబులమీఁద వచ్చి వ్రాలుటఁ గనమే॥ ౨౦

మ॥ పుటలన్ లెక్కిడి గొప్ప చెప్పికొనెడున్ మూఢాత్ముఁడొక్కండు, సం
పుటముల్ దొంతరవెట్టి సంతసమునం బొంగున్ మఱొక్కండు, దా
ఘటికం జెప్పితి నేకధారగ శతగ్రంథంబు నంచున్ సము
త్కటమోదంబునుబొందు వేఱొకఁడు చిత్రంబల్పసంతోషముల్॥

క॥ ధృతరాష్ట్రుని సుతశతకము
ఖ్యతమునఁ దదుకృత్తులు భీష్మవిక్రుతు లయి క్షితిన్
బ్రతుకుకు సెడి యుంటఁ జూచిన
కృతికర్తలు కావుకొట్లు వృత్తజీవు లిఁకన్॥ ౨౩

క॥ నిలుకడమె వలయునేనిఁ
నిలుకడయే వలయుఁ గృతికి నిమిషార్థములో
పల నిండి పొంగి పొరలెడి
సెలయే ఱడఁగెడు; నడఁగునె జీవనది యిఁకన్ ?  ౭౪

గీ॥ కాలితడి యాఱకుండ వేగంబ కుడుచు
టయు, మషీరస మాఱకుండంగ వేగఁ
బ్రచుర మొనరించుటయు రెండుఁ బనికిరావు
పూర్ణసంతృప్తి వలెనేని భోక్తలకును॥  ౭౫

క॥ తొలుదొలుతటి తమకృతులను
వెలయింపరు కవులు పేరుఁబెంపు నడఁచు నం
చెలమావియంటుతోఁటల
తొలిపూఁతలఁ ద్రుంచివేయుదురుగద కృషికుల్॥  ౭౬

క॥ త్వరితముగ నమ్ముటకు నూఁ
దరయిడి పయిరంగు మొత్తదనములకే యు
బ్బురపడు తీర్థప్రజలకు
నరఁటులబలె హీనకృతుల నంటింతు రహో॥  ౭౭

ఆ॥ వె॥ క్రొత్తసొమ్ము పెట్టికొని పెండ్లి కేగునం
దాఁక నిలువలేని తరుణులట్టు
లల్లి చపలు లొకటి యప్పుడె యచ్చిడి యొరుల్
మెచ్చుకున్నఁ జిన్నవుచ్చుకొం(?)ద్రు॥  ౭౮

గీ॥ పలుకుపసలేక పొట్టముపసను జూపి
చిన్నబిడ్డల మోసపుచ్చెడి మిఠాయి
వర్తకులపోల్కి డబ్బాసపడెడువారు
గాకుఁడీ పాఠపుస్తక కర్తలార॥ 28

***

శా॥ బిడ్డం దొట్టిని బెట్టి యూఁచుటకునై పేరంటముం జెప్పఁగా
వొడ్డమ్మల్ పదిమంది చేరి నిసువుళ్ బోలంగ నీక్షించి యీ
బిడ్డం డొప్పును నోరు చిన్నకడుపే పెద్దం చు నేమేమొ పే
ళ్లిడ్డం దల్లియుఁ బ్రోడవోలె నిది మీదృగ్దోష మంచుళ్ నగుళ్॥ 30

ఉ॥ విద్దెలపేర్మిచాలని కవిత్వమునం బొడసూపు దోసముల్
దిద్దికొనంగఁ దెల్పిన సుధీమణి వంద్యుఁడుగాక నింద్యుఁడే
యద్దముఁ జూచి నేర్పుమెఱయన్ సవరించుకొనంగ నొప్పగున్
ముద్దతెఱంగుసూవె మఱిమూతి ముడుంచుక దానిఁ ద్రోయుటల్

గీ॥ కురుల నెగదువ్వఁ గాటుకమఱకఁ దుడువ
బొట్టు సవరింప మెడసొమ్ము మట్టుపఱుపఁ
దోడుపడుఁగాని యద్దంబు తోడుపడునె
కోలమొగమును గావింప గుండ్రమొగము॥ 31

శా॥ స్ఖాలిత్యంబుల కెందు సంస్కరణముల్ సాధ్యంబు లౌఁగాని యు
న్మీలన్మూలపదార్థతత్త్వవికృతిం దీర్పంగరా దేరికిం;
బోలుం గస్తురిబొట్టు వంకరను సంపూర్ణంబుగా దిద్ద; నే
లీలం గోలమొగంబు గుండ్రముగఁ గల్పింపంగ శక్యంబగున్॥ 33

గీ॥ వండి వడ్డింపఁ జవిఁజూచి పాకలోప
ములఁ విని ర్మలబుద్ధితోఁ దెలుప నలిగి
యింతకంటెను నీవు వ్రేలిడితో యనుట
తగునె యతని? నది రసజ్ఞధర్మ మగునె! ౧౪

శా॥ మానంబున్ భజియించు నవ్యసుమనోమాధుర్యధుర్యోక్తిచే
నానందించియు నభ్యసూయయొ యసభ్యంబో దురభ్యాసమో!
జానే యిద్ది రసజ్ఞధర్మము? మరందాస్వాదనాపాదిత
స్వానందంబు మలీమసాళియుఁ బొరిం జాఁటుంగదా ఝుంకృతిన్॥

ఆ॥ వె॥ తెలిసి యొకఁడు మెచ్చఁ దలఁద్రిప్పు నింకొక్కఁ
డద్దిసూచి గంగిరెద్దువోలెఁ;
దాతమ్మృతిని వినుచుఁ దల్లి గొల్లనఁ దల్లి
యేడ్పు సూచి బిడ్డఁడేడ్చినట్లు॥ ౧౬

గీ॥ సరసు లెచ్చుగ మెత్తురు సరసకవిత
విరసులకుఁ జేయు దంతగా వేడ్క పెంపు;
పండువెన్నెల కన్నులపండువగుఁ జ
కోరములకును గాదట్లు గూబలకును ౧౭

గీ॥ పందివలె నోటఘుర్ఘరింపంగ నొక్కఁ
డచ్చముగఁ బందియే యని మెచ్చి రతని
నింకొకఁడు పందిపిల్లనె చంక డాఁచి
దానిఁ గూయింప మెచ్చ రద్దాని జనులు॥ ౧౧

క॥ లోకులు పూజిత పూజకు
లే కావునఁ గ్రొత్త మెచ్చరికఁ బ్రాఁతయు రోఁ
తై కానంబడు! వీరల
వాకునకును లేదుశుద్ధిబద్ధము నెంచన్॥ ౮౯

గీ॥ అట్టు సొట్టయ్యె బూరె వంకయ్యె ననుచు
నరుచి వెళ్లడి యగునట్టు లతిరసముల
నెరసు లేఱుచుఁ బరులఁ దృణీకరించుఁ
దనదుస్తుతిపాఠకులమ్రోలఁ దగుదుననుచు॥ ౯౦

గీ॥ ఒక్కతెగవారి పనిలోన నొకని నొకఁడు
కాదనెడుఁ గారణము రుచిభేద మగునో
యిర్వురు యశంబు ధనము నపేక్షసేయ
యాచకుఁడు యాచకుని శత్రు వగుట యగునో॥ ౯౧

గీ॥ పెట్టినను బెండ్లియందురు పెట్టకున్న
నింకొకటి యందురొకయింత శంకలేక
తోరణంబులు ద్రెంతురా దుండగంపుఁ
గవుల నందులకైన మెచ్చవలెఁ జుండి॥ ౯౨

క॥ తప్పన్న మీఁదఁ బడుదురు
త్రుప్పులు దుల్లింత్రు చెవులత్రుప్పు లటుండన్
జప్పునఁ జేపట్టుచుఁ దమ
త్రుప్పుంగంటముల; వారిత్రోవఁ జనకుఁడీ॥ ౯౩

***

మ॥ పరమానందరసానుభూతికయి ప్రాప్తంబైన యోగంబు దో
ష్మరి విద్దెల్ ప్రకటింపఁ బాల్పడిన సామ్యానం గవిత్వంబు గొం
దఱనోళ్ళంబడి యాశుధార లవధానంబుల్ మొదల్గు శూ
న్యరసాకారవికారముల్ గని,స్వకీయాన్నత్యమున్ వీడెమున్॥ ౯౪

ఆ॥ వె॥ ఉప్పువేయు నొక్కఁ డుడుకఁబెట్టు నొకండు
కలియఁబెట్టు నిఁక నొకండు నడుమ
నోరుదెఱచి సభను గూరుచున్న జనంబు
చప్పరించుఁ జేతు లప్పళించు॥ ౯౫

ఆ॥ వె॥ వట్టిలక్కపిడత లట్టిట్టు ప్రోయిమీఁదఁ
బెట్టినట్టె పెట్టి పెట్టుటకును
నేది యొదవకున్న నిదియన్న మిదిపప్పు
టంచు బిడ్డలాడు నాట లివ్వి॥ ౯౬

క॥ పిల్లకవు లనెడియల్లరి
పిల్లకవుల్ సేరి రచ్చపెనుమడువుల సొం
పెల్లఁ జెడఁ గొట్టుకొనఁ, గం
పిల్లెడు సుమనోగణంబు పెల్లగు వికృతిన్॥ ౯౭

ఆ॥ వె॥ తిట్టుఁబోతుకవులు బట్టురాచకవులు
పిల్లకవులు కవలపిల్లకవులు
కనుపకలపుఁగవులు నినుపగంటపుఁగవుల్
బాలకవులు నుగ్గుఁబాలకవులు॥ ౯౮

క॥ ఊరూరఁ గవులె యందఱు
నోరూరఁగఁ జవులువుట్ట నోడివెడివారల్
నూఱుగురలోఁ బదుండ్రును
బేరుకొనం గానఁబడరు పేర్కొననుబలెన్॥ ౯౯

క॥ తుమ్మిన దగ్గినఁ గవనము
గుమ్మమునకు మామిడాకు గ్రుచ్చినఁ గవనం
బిమ్మసెడు పేదవిప్రుక
తమ్మునబలెఁ గ్రొత్తకుండ దడుప భయమ్మా॥ ౧౦౦

గీ॥ కాలుచౌకయ్యెఁ గవనంబు కాగితంబు
మిగులఁ గలవయ్యెఁ గవులెట్లు మిడుకువారొ !
అనదగేస్తులకొంప చూరాకు లూడఁ
బీఁకి పాకంబు లిడకుండ్రు గాక యింక॥ ౧౦౧

గీ॥ వారు వీరిడు పదకముల్ బాసికములు
శాలువులజోళ్ళు రమ్యవేషములు గాఁగ
శృంగములు మొల్చు నీకవిపుంగవు లహా
అంకె లిడుదురు రచ్చ లలంకరించి॥ ౧౦౨

***

ఆ॥ వె॥ తల్లి బిడ్డకెట్లొ తల యెట్లొ నాల్కకు
నట్లె సంస్కృతమును నాంధ్రమునకు
సాంస్కృతికముగాని సాహిత్య మాంధ్రాన
నేలవిడుచు సాముఁ బోలియుండు ౧౦౩

ఆ॥ వె॥ సంస్కృతాంధ్రహూణసాహిత్యములు మూఁడు
సరసకవికి సమత సాఁగనేని
వానికవిత పట్టఁ బగ్గాలులేక ము
జ్జగము నుద్దవడిని జంగగొనెడు॥ ౧౦౪

ఆ॥ వె॥ అనుట తగదుగాని యల్ల సర్వజ్ఞుఁడుం
జూపలేఁడు వాని కోపలేఁడు
మూఁడుకన్ను లున్న ముమ్మొనవా లున్న
మూఁడుజగములేలు మూర్తియైన॥ ౧౦౫

చ॥ చదివినవారికంటె సరసంబుగఁ గూరుప నేర్తు రంతగాఁ
జదువనివారె మించి సహజప్రతిభన్; విను శాస్త్ర మేమిటం
గొదవడకుండఁ బాడినను గూర్చునె కోమలగాత్రమాధురిం
బొదలిన గాలిపాటఁగల భూరిసుఖంబును గాయకుం డిలన్॥ ౧౦౬

***

ఉ॥ అంగడిదోసెలట్లు తెగనమ్మెడి యల్లరినాటకంబులం
బొంగుచుఁ గొండ్రు నీరసులు ముట్టరు మూర్ఖు న రస్యులైనవా
రెంగిలి వంటపుట్టిమెతు కేనియతవ్రతుఁ డిచ్ఛగించెదున్
సంగతభక్తిభావమున సామిప్రసాదమె కోరుఁగాకిఁకన్॥ ౧౦౭

గీ॥ కడుపులోఁ బెట్టుకొనలేము గద యివన్ని
యింటిలోఁ బెట్టుద మటన్న నెలుకబాధ
యేమిసేయుదు మయ్య యిం కీవిచిత్ర
నాటకంబుల బిడ్డలయాట కిత్తు॥ ౧౦౮

ఆ॥ వె॥ మూరపొడుగెకాని పోఁగుచిక్కనలేదు
కట్టికొన్న గుట్టు బట్టబయలు
పిడతగట్టెకాని పెరుగు పల్చన నేఁటి
కవితలందు; నేటికవిత లివ్వి? ౧౦౯

ఆ॥ వె॥ హాస్యరచన లనుచు నపహాస్యములు వ్రాసి
వింతనవ్వు గొలుపు వెఱ్ఱులకును
వెక్కిరింపఁబోయి వెనుకఁబడుటచేతఁ
బ్రౌఢులకును దెచ్చు నలఁతినగవు॥ ౧౧౦

గీ॥ మృదుత దప్పిన హాస్యంబు మేలుగాదు
మృదుత నొప్పిన సరసులు మెచ్చుకొంద్రు
ముడ్డిగిల్లినఁ గెవ్వని బిడ్డయార్చు
బుగ్గ గిలిగింప నగుఁ జిన్నిబోసినవ్వు॥ ౧౧౧

***

క॥ ఒకభాసలోని రస మిం
కొకబాసకు నిండఁదివియ నుంకించుకవుల్
తికమకలువడరె టెంకా
యకు లోనయి చేతు లాడనట్టి కపులె యై॥ ౧౧౨

గీ॥ త్రాగనేరని పిల్లి బోరగిలఁ ద్రోసి
నేలపాలైన పాలఁ గొన్నింటి నాకు
సట్లు కొందఱు మూలంబునందలి రస
మెల్లఁ గొనలేక యల్పసంతృప్తిఁ గంద్రు॥ ౧౧౩

క॥ పొలగుదురు నగుఁబొట్లకు
మూలార్థముఁ గానకేదొ ముడివెట్టుకవుల్
నేలఁబడ నన్న మంతయు
బోలెం దలచిక్కు జంతువులఁ బోలి యయో॥ ౧౧౪

క॥ తాత్వికకవుల కవిత్వపుఁ
దత్వము వారలకె గాని తదితరులకు లా
కేత్వంబ; యద్ది వారిక
విత్వముసొంపొ మఱి తత్వవిత్త్వముపెంపో॥ ౧౧౫

ఆ॥ వె॥ మర్మకవిత యనుచు మాఱుమూలలనుండి
తురకబిబ్బివోలెఁ దొంగిచూచు
ముసుఁగెకాని దీనిమోము గానఁగరాదు
రవికిఁగాని ప్రౌఢకవికిఁగాని॥ ౧౧౬

గీ॥ మర్త్యసామాన్యదృష్టికి మర్మకవిత
లోనిభావంబు లేవియుఁ గానరావు
దేవతావస్త్రములువోలెఁ దేరిచూడఁ
బ్రకటనము సేసెడు దిగంబరతనె యకట॥ ౧౧౭

ఆ॥ వె॥ దొరలభావములను దొరలటో పీలతో
సరిగఁ గొనుచుఁ దెలుఁగుదొరల మంద్రు
తెలుపు నలుపుఁజేయఁ దెలియని యీాయింగ్లి
లీషుపండితుల విశేషమిద్ది॥ ౧౧౮

గీ॥ కడుపులోనున్న యాంగ్లంబు కాగితంబు
మీఁది యాంధ్రంబు నొకటిగా మెఱయవలదె
అపరదిగ్గర్భగతమైన యర్కకాంతి
వెండియును దూర్పుదిక్కున వెడలునట్లు॥ ౧౧౯

ఉ॥ నన్నయతిక్కనాది కవినాథులు మున్ను మహాపురాణముల్
చెన్నగ నాంధ్రభారతికిఁ జెప్పినచొప్పులు చేతఁగాక యం
దున్నది సాఁగఁగొట్టుటయె యొప్పను కేవలపద్యకారులన్
మిన్నతనంపుసొంపుఁబని నేరని సొన్నరులే యనందగున్॥ ౧౨౦

క॥ నన్నయకుఁ దెలుఁగు, తిక్కన
కెన్నంగా సంస్కృతంబు, నీ రెండును బో
తన్నకుఁ దెలియవు తెలియు ని
వన్నియు మా కనుచుఁ దలఁచు నజ్ఞుల నగరే! ౧౨౧

ఆ॥ వె॥ సంస్కృతంబె ప్రియము జక్కవలకు సూర్య
తేజమట్లు, తేటతెలుఁగె ప్రియము
వరచకోరములకుఁ బండువెన్నెలయట్లు
సరసకవుల రుచులజాడ వేఱు॥ ౧౨౨

***

ఉ॥ తియ్యని ద్రాక్షపండ్లకును దీటయి తేనెయరంటిపండ్లకున్
వియ్యములై రసాలముల నెయ్యములై మఱి జుంటిపాలకుం
దియ్యములై యొసంగు మనతెన్గులు వీనులవిందు సేయ, న
ఱియ్యముదంబునం బ్రదుకఁగల్గుదు మన్నము నీళ్ళు లేకయే॥ ౧౨౩

ఆ॥ వె॥ ఇట్టియాంధ్రభాష నట్టిట్టు గావించి
పెంపుపేరు సెప్పి పేరుఁ బెంపు
నింపు సొంపు నన్ని యెడలించి సడలింపఁ
జూచుచున్న వారు చోద్యముగను॥ ౧౨౪

క॥ గ్రామ్యగ్రాంధికభాషా
స్వామ్యపరిష్కృతికి రచ్చపట్లెక్కి కవుల్
రమ్యేతరవృత్తిం గాని
భూమ్యాకాశములు చెలఁగఁ బోరెద రయయో॥ ౧౨౫

గీ॥ ఎత్తు తగ్గించి మఱికొంత యిరవుసేయఁ
గోటగోడలు పగులంగఁ గొట్టి నేల
మట్ట మొనరింతు రావలఁ గట్టలేరు
రక్షకములేక కలుగు నరాజకంబు॥ ౧౨౬

గీ॥ ఎత్తుతఱిగిన గొప్పదై యెసఁగు భాష
యంద్రు కాని చూడరు పల్చనగుట వెనుక
గుల్లసొమ్మట్లు పయిగొప్ప వెల్లడించు
మేలిమై మెడఁదిరుగుట మేలుగాదె ? ౧౨౭

ఆ॥ వె॥ ఎదుగుఁ బొదుగులేని యెండుకొయ్యమతంబు
వారినలెను బలుకువాఁడఁ గాను
సరసకవులచేతఁ బెరిఁగి యింపును సొంపు
నింపవలయు భాష తెంపులేక॥ ౧౨౮

***

ఆ॥ వె॥ నడక కడ్డమనుచు వడియును బ్రాసంబు
నూడఁబెఱికి తుంగ నూరఁద్రొక్కి
కవితఁజెప్ప వింతగద్యమే యగుఁగాక
పద్యమగునె యద్ది హృద్యమగునె ? ౧౨౯

ఉ॥ వారిని వీరిఁ జూచి మనవారు స్వదేశవిదేశవేషభా
షారచనానుకూల్య సువిచార విదూరతఁజేసి యేవొ సం
స్కారము లంచు వెఱ్ఱులు వికారములుం బయిఁ దెచ్చిపెట్టుకోఁ
గోరెదరేల పూని తమకుం దమభాస కగౌరవంబుగన్॥ ౧౩౦

మ॥ చదరంగంబున గుఱ్ఱముల్ నడచునోజం జొచ్చి పర్యాయపుం
బదముల్ నిల్వఁగఁ, గల్గగా సమసనవ్యాపార సౌకర్యముల్
వదలంగం బనియేమి తెల్గున యతిప్రాసంబులన్? వానిచే
తఁ దదీయంబగు నైజమాధురిగుణోత్కర్షంబు నేచెందఁగన్॥ ౧౩౧

గీ॥ సామెతలనేని యతియుఁ బ్రాసమునులేక
యాడుకొన రేమి యాంధ్రులు పాడుకొనరు
అట్టిచోటను వానిఁ బద్యములనుండి
యూడఁబెఱికినఁ జప్పనై యొప్పుసెడదె॥ ౧౩౨

క॥ అద్దములువోలెఁ గంటికి
ముద్దినుసుంబద్దియములు పొడవులు కుఱుచల్
పెద్దవియుఁ జిన్నవియు మన
బుద్ధికిఁ జూపించు భావములనన్నిటినిన్॥ ౧౩౩

క॥ తేలికగఁ దేటగీతుల

మాలికలం బలుకరాదొ మహితాశయముల్

మేలికవనంబు సేయం

జాలి కడఁగినఁ గలవు బహుసరసగతులికన్॥ ౧౩౪

గీ॥ నన్నపాచార్యు పనుపున మున్ను గాణ్న

హేంద్రుకోలువునఁ దొలుదొల్త నెలవు గజ్జె

కట్టి యాంధ్రకవిత కాలిగజ్జి

యలగు యతులుఁ బ్రాసములు సంకెలలుగావు॥ ౧౩౫

మత్త॥ ప్రోడలై మనయాంధ్రదేశకవుల్ విశృంఖలసామజ

క్రీడలన్ విహరింపరో తమకీర్తి దిక్కుల నింపరో

యూడలాగరు నేఁటివారల నోజఁ బ్రాసములున్ యతుల్

త్రాడుచాలక నూయిపూడ్చు విధంబు లీనవసంస్కృతుల్ . ౧౩౬

***

క॥ నిరలంకృతు లగుసూక్తులె

సరసములయి మదికి నెక్కు; సాహిత్యముచే

విరహిత మయ్యును మధుర

స్వరసమ్మేళనము భావసంభ్రమకరమా॥ ౧౩౭

చ॥ కవికులసార్వభౌముని పొగడ్తకు నెక్కిన కణ్వపుత్రికా

ప్రవిమలరూపసంపదకు వన్నియవెట్టదె నారచీరయుం;

గవితకుఁగూడ నట్టులె వికాసముఁ గూర్చు నయత్నసిద్ధముల్

తపుసదలంకృతుల్ పరిమితంబులునున్ సమయోచితంబులున్॥ ౧౩౮

గీ. ఉపమవంటి యలంకృతి యొకటిగాదు
భావమైత్రి ఘటింపఁ గావ్యములయందుఁ;
బెండ్లియాడ మేనఱికపుఁ బిల్లవోలె
దూరసంబంధ మంతగాఁ జేరికగునె? ౧౩౯

***

క॥ రసములలో శృంగారమె
రస మనఁదగుఁ బంచమము స్వరంబులఁ బోలెన్
రసమయమగు పరతత్వం
బెసఁగు నఖండసుఖరూపమే యయి జగతిన్॥ ౧౪౦

గీ॥ స్వీయపరకీయసామాన్యభేద మెపుడు
నాయికలయందుఁ గావించినారొ యప్పుడె
నైకవిధ మయ్యె శృంగార మవని వివిధ
వర్ణకాచపాత్రములందు వారివోలె॥ ౧౪౧

***

గీ. ఆజ్యధూమంబు లడుగంటి యగరుధూప
వాసనలు మిన్నుముట్టిన బౌద్ధయుగము
నందుఁ బురివిచ్చి యాడె నానందమునను
గేరుచుఁ గళామయూరి శృంగార మొలుక॥ ౧౪౨

గీ॥ తత్కళారూపభేదమై తనరుకవిత
తొంటి మునికన్నె వేసంబు తొలఁగఁబెట్టి
క్రొత్తసింగార మొప్ప శకుంతలవలె
భరతవంశప్రతిష్ఠకై బైలువెడలె॥ ౧౪౩

గీ. ముందు కవిసార్వభౌముని బొందె యంత
ఘనపథంబున కెగసి యాఘనుని భావ
నావిమానంబునందు లీలావిహార
మంది సుఖియింపఁజేసె లోకాళి నెల్ల॥ ౧౪౪

గీ॥ నింగినొరసెడి కైలాసశృంగమునను,
రామగిర్యాశ్రమమున, సుశ్రావ్యముగను
గాన మొనరించె నిమ్మహాకవివరుండు
భావనం బెల్ల సుజనసంసేవనముగ॥ ౧౪౫

గీ॥ గాన మొనరించె యుగసంధి కాలమందు
ధీవరుఁ డితండు శ్రీకృష్ణదేవుపగిదిఁ
దత్త్వము నతండు సౌందర్యతత్త్వ మితఁడు
పాడి రిర్వురు నానందపదవిగాఁగ. ౧౪౬

గీ॥ విశ్వమునుఁ బ్రోవ వెలసిన విష్ణుఁ డతఁడు
మర్త్యమునఁ బుట్టినట్టి యమర్త్యుఁడితఁడు
దేవకికతండుసుతుఁడు వాగ్దేవికితఁడు
కవి యితం డెన్నఁగఁ బురాణకవి యతండు॥ ౧౪౭

అ॥ వె॥ అనుభవైకవేద్య మమ్మహాకవిసార్వ
భౌము మహితబుద్ధివైభవంబు
అలవియగునె పొగడ నల్పమతికి నాకుఁ
బెద్దపెద్దలెల్ల వెనుకఁబడఁగ॥ ౧౪౮

క॥ వెలుఁగిచ్చుచు నొండొంటికి
వెలుఁగుచుఁ దా మొక్కపెద్దవెలుఁగుగఁ జుక్కల్
బలెఁ బొలుచునిమ్మహాకవి
పలుకులు సహకారులగును భావస్ఫురణన్॥ ౧౪౯

క॥ అనుకరణ మెప్పుడు సృష్టికి
వెనుకటిదే యగుటచేత వెనుకంబడిరో
యన నతని నీడలైరి త
దనుకర్తలు లోకబంధు నస్తమయమునన్॥ ౧౫౦

క॥ పయిచూపుఁ గ్రిందియడుగును
నయి వెనుకనె నడచినట్టి యర్వాచీనుల్
పయనంబులు తుదముట్టఁగ
నయయో! పల్లములఁ, గాంచి రపహాస్యతనే॥ ౧౫౧

ఆ॥ వె॥ వస్తువర్ణనముల భావచిత్రణములఁ
బ్రకృతి ననుసరించు పటిమలేక
వికృతరూపములను బ్రకటింపఁ జొచ్చిరి
వీధిభాగవతపు వేసములను॥ ౧౫౨

గీ॥ సమయసంస్థానసందర్భసరణి యెఱిఁగి,
సూటిగా సొంపుగాఁ బల్కువాట మెఱిఁగి,
భావనాశక్తి విభవజృంభణము మెఱయ
నప్రయత్నంబుగా సిద్ధ మయ్యె నింద్ర ౧౫౩

జాలమట్టులుగాక పొసంగునట్లు
ప్రకృతికి నపూర్వయోగకల్పనముచేసి
వన్నె వెట్టెడి చదురుల తెన్నెఱింగి,
భావసాక్షాత్కృతియు రసోల్బణముఁ గలుగఁ
బలుకనేర్చుట బహుతపః ఫలముగాదె? ౧౩౪

***

గీ॥ ప్రేమకామంబులకుఁగల భేదమంత
గా గణింపనికొందఱు కవులు భావ
సౌకుమార్యంబు నౌచిత్యసరణి మఱచి
పాలుపడి రయ్యయో! రసాభాసమునకు
పాత్రులైరి బుధజనాపవాదమునకు॥ ౧౩౫

గీ॥ మలయపవమాన మృదులసంస్పర్శమున నో
కించుకచలించు నవపల్లవాంచలంబుఁ
బోని కొనవ్రేల శ్రుతిముఖుఁడైన స్రష్ట ౧౩౬

మోలను దదీయహృదయతంత్రులనుబోలె
వీణెతంతుల ముట్టి యుద్వేలరాగ
రసతరంగపరంపరా రంజితములు
గాఁగ లోకాళి యంతరంగంబు లెల్ల ౧౩౭

లలితకోమల మధురమంజులములైన
పలుకులను బూర్ణభావసంకలితములుగ
నల్లఁ బలికించి పారవశ్యమునఁ గన్ను
దోయి యఱమోడ్చి విశ్వ మందే యిమిడ్చి ౧౩౮

మెనసి బ్రహ్మైక్యభావంబుఁ గనెడిప్రోడ
సత్యలోకనివాసిని సత్యహృదయ,
శారదాదేవియో లేక శారదమొద
లింటి యవతారమైన వాల్మీకిఋషియొ ౧౫౯

లేక యయ్యంబచే నీకు నాకు లేదు
భేద మనిపించుకొన్న కవికులసార్వ
భౌముఁడగు కాళిదాసొ లే కామహాక
వి యపరావతారమగు రవీంద్రనాథుఁ ౧౬౦

డో వలంతులుగాక యన్యులకు వశమె
నిరతిశయమై యనిర్వచనీయమైన
పరమపావనప్రేమతత్త్వంబు భంగు
లెంచి చూడంగ నాడంగ నించుకేని ? ౧౬౧

***

క॥ గుడిమీఁది మొరటుబొమ్మల
వడువునఁ గావ్యములఁ గొన్ని వర్ణన లుండం
జెడుదు రవివేకు లట్టివి
పొడగని యని గుడితలుపులె మూయంజనునే॥ ౧౬౨

క॥ తొక్కులుదిను బిడ్డలకును
ముక్కలులేవన్న సామ్యమును దెల్పుటకై
చెక్కంబడు వీనిపయిం
జిక్కినచో దృష్టి, శివుఁడు చిక్కఁడు నిజమే॥ ౧౬౩

క॥ రూపింపనేర కజ్ఞత
గోపీవస్త్రాపహరణగూఢార్థంబుల్
పాపమని చెవులనెట్టులో
యాపోతన భాగవతము నటు మూసెదరో ! ౧౬౪

***

గీ॥ సర్వభక్షకుఁడైన వైశ్వానరుండు
శుచి యటంచును శ్రుతిని విశ్రుతిని గాంచు
నన్నిటిని నంటుభాస్కరుం డంటువడఁడు
వివిధభావవీథివిహారి కవియు నటులె॥ ౧౬౫

క॥ శ్రీనాథునడతకతలను
మానసముల నమ్మి యతని మన్నింపకయో
పోనాడఁదగునె మనలకు
మానితశివభక్తిపరుని మతిసురగురునిన్॥ ౧౬౬

క॥ శ్రీనాథునిశివభక్తునిఁ
గానెఱుఁగుట తగదటంచుఁ గవిలింగ మనున్
మానికము పెంటకుప్పను
గానంబడవచ్చునన్న కత మఱచెనొకో॥ ౧౬౭

క॥ మనభక్తి క్షణప్రభవలెఁ
గనఁబడి హృదయాభ్రసీమఁ గామాంధతమం
బును జెనకి యందె లీన య
గును నిలుకడలేమి మరలఁ గోవిదులారా॥ ౧౬౮

క॥ మనుజుండు కన్నుమూయం
గనె నానాత్వంబు విడిచి కను నేకత్వం
బును వ్యవహారదశనె; యది
పెనుపొందదె కవికి నన్యవిషయనివృత్తిన్॥ ౧౬౯

గీ॥ బ్రహ్మయంతటి వేలుపు రాజసమున
సృష్టిసేయుచు మఱచె నాత్మేశుఁ బరముఁ;
జోద్యముగ నీకవిబ్రహ్మ చూడఁబోలుఁ
దనకు శివున కభేదతాదాత్మ్య మగుట॥ ౧౭౦

క॥ ధారాళవాక్సుధారస
ధారల ముంచెత్తి తనహృదయసంపుటమం
దేరీతి భక్తికుసుమముఁ
గూరుప కుండెడును లోకగురుశిరసుపయిన్?॥ ౧౭౧





ఓం

శ్రీ పరమాత్మనే నమః

# సోదరస్మృతి*

—:o:—

## I

ఉ॥ ఏడ్చెను రాఘవుండు మును పిన్నటి సొమ్మసిలంగ లక్ష్మణుం
డేడ్చెను భీమసేనుని సుకృత్రిమపున్మృతి వించు ధర్మజుం
డేడ్చిరి యంతవారె యెటు లేడ్వకయుందును భ్రామరుండనై
యేడ్చితి నేనుగూడ నిను మృత్యువె యీడ్చుకపోవఁ దమ్ముఁడా॥

ఉ॥ ఏడ్చితి నీయకాలమృతి కేఱయి పాఱఁగఁ గంటినీరు బి
ట్టోడ్చితి నగ్నికాహుతిగ నోర్చితిఁ జేయఁగ నీసురూపముం
బూడ్చితి నీ పవిత్రమగు బూదియు బుగ్గి యఖండగాత్రమిం
బూడ్చితిఁ గాని నీసుగుణపుంజముఁ బూడ్వఁగనోల్లఁ దమ్ముఁడా॥

శా॥ నీ దోసంబులు కాయజంబు లగుటన్ నిర్దగ్ధముల్ మేనితో
నీదౌ సద్గుణపుంజ మాత్మభవమై నిల్చున్ సదా యాత్మతోఁ
గాదే వ్యర్థ మయత్నసిద్ధమునకై కావించుయత్నం? బనన్
నాదుఃఖంబు ప్రశాంతినొందు తెరు వన్యం బద్దిఁకం దమ్ముఁడా॥

---

*[illegible] 1919-వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁడైన నా ప్రియ సోదరుని స్మరించుకొనుచు వ్రాయఁబడిన పద్యములు.

శా॥ ప్రేమం బెచ్చటనుండు దోస మచటన్ వీక్షింప రాకుండు నం
ద్రేమో? సత్కవివర్య దృష్టికిని మేలే తోఁచు నంద్రేమొ? యిం
దేమాటన్నను సంతసంబె యగు నా కేమన్న నీపట్ల నా
ప్రేమంబుం గవనంబు రెండును గృతార్థీభూతముల్ తమ్ముఁడా॥

ఉ॥ ఎప్పు డుదాత్తవస్తువులనే కయికొందు వుదాత్తభంగినే
చెప్పుదుగాని వేఱుగతిఁ జెప్పవు నీవని యాడుచుందువే!
తప్పునె నీదుపల్కు? కవితారసతత్త్వవిదుండ వింక నే
నొప్పుగ నీదురమ్యసుగుణోన్నతి సన్నుతియింతుఁ దమ్ముఁడా॥ ౫

మ॥ శ్రుతియున్ గాత్రముఁ దాళమున్ సమగతిన్ శోభిల్ల సంగీతమా
కృతియుం బోలెను జిన్నదయ్యు బలురక్తిం గూరిచెన్ మాధురీ
యుతమై నీబ్రతు కెల్లవారలకు నోహో నీమనోవాక్క్రియల్
జతకాండ్రంబలె వీడకుండ దయయున్ సత్యంబు శౌచంబునున్॥

చ॥ ఇరువురలోన నొక్కరునె యెర్గిననెయ్యు రొకళ్ళొకళ్ళచే
నిరువుర కాప్తమిత్రులుగ నెత్తును బొత్తును నీడు జోడుగాఁ
బెరిఁగి సుఖంబు దుఃఖమును బెంపును డింపుఁ గనంగ నిట్టి లి
ర్వ్వరము మనంగ నన్ను విడిపోయితె యక్కట నీవు తమ్ముఁడా॥

ఉ॥ పోయితె నీవు నల్బదియుమూఁడు దినంబులు నీకుముందుగాఁ
బోయినజాయతోడి నను బొత్తును బాయఁగలేక యక్కటా
మీయెడఁబాటో? యిద్ది పరమేశుఁ డొనర్చిన యేరుపాటో? హా!
యేయదియైన నేమి? యిఁక నీయెడఁబాటు సహింపఁ దమ్ముఁడా॥

మ॥ ఒకనాఁడున్ శ్రమపెట్ట వీవొరుల నీప్రేమోర్వేమనన్ నీమనోఁ
వికలత్వంబు గణింతునే హృదయగాంభీర్యంబు వర్ణింతునే?
యకటా! తమ్ముఁడ! యట్టినీకు హృదయవ్యాధిప్రమాదంబనన్
వికృతిం గాంచుట ధీరపుంప్రకృతియున్ విస్పష్టమానేకదా॥ ౯

మ॥ తనువున్వీడు క్షణంబుదాఁక నిజకర్తవ్యంబులన్ వర్తిలం
జను మర్త్యుం డనుచున్ వచింతు వటులే సాఁగించి తౌరా! తగన్
శనివారంపుబడిం బనుల్ సలిపి యాసాయంబె నీవయ్యయో!
కనులన్ మూసితి మూసి మాకనుఁగవల్ కన్నీటితోఁ దమ్ముఁడా॥

శా॥ శూన్యంబై యొకచోటునుం బ్రకృతిలోఁ జూపట్ట కుండుంగదా
యాన్యాయంబునకున్ విరుద్ధముగఁ జోద్యంబౌచు నాడెందమున్
శూన్యంబయ్యె గృహంబునున్ జగమునున్ శూన్యంబులైతోఁచెనో
మాన్యుండా! నడిమింటి దివ్వెవలెనే మాయంగ నీ వక్కటా॥

ఉ॥ అన్నకుఁదోడు తమ్మునికి నాదరు వమ్మకు నూఁతకోలయుం
బిన్నల కొజ్జ పెద్దలకు భృత్యుఁడు బిడ్డలకెల్ల బిడ్డఁడుం
బన్నుగ బంధుమిత్రులకుఁ బ్రాణపదంబని లోకులెల్ల ని
న్నెన్నఁగఁ దమ్ముఁడా! మెలఁగి తెల్లరకుం దలలోనినాల్కవై॥

ఉ॥ అన్న యశక్తుఁ డంచెపుడు నారయుచుందువు నాసుఖంబునే
పిన్న యటంచు నేమరక వేమఱుఁ గోరుదు నీదునేమమే
యెన్నఁగ సత్యముద్రితము నీమనప్రేమధనంబు నింక నీ
చిన్నియనుంగుబిడ్డలకుఁ జేర్చెద నుమ్మడిసొత్తు పోలికన్॥ ౧౩

మ॥ మును లక్కింటి సురంగమార్గమున భీముం డెట్టు లట్లీవు చే
కొని యిల్ సేర్పవె తల్లి రంగపురి వైకుంఠంపుద్వారంబునన్
జనసమ్మర్ధమునన్ నలంగి పడెనన్ వార్తల్ చెవిన్ సోఁకినం
తనె యొక్కండవు నేగి యందులకు నద్యత్నేము నోతమ్ముఁడా॥

శా॥ ఎండం గట్టెలుగొట్టు మాలలకు నోరెండం గృపన్ వాండ్రదా
కుండం బోసితి వత్తి గంజిమెతుకుల్ కొంకింతయున్ లేక, నీ
యండంజేరిన కుక్కపుండులకు మందంటించి కాపాడితీ
రెండుం జెప్పకె చెప్ప నీదుసమదర్శిత్వంబు నోతమ్ముఁడా॥ ౧౫

శా॥ నామార్గంబులు కొన్ని నీ కలవడన్ సంతోషముం బొందితిన్
నీమార్గంబులు నాకుఁ బట్టువడమిన్ జింతింప నేనంతగా
నేమన్నన్ నినుఁ గూడి యుండఁగను నా కేలోపమున్ లేక పూ
ర్ణామోదంబును బేరుఁ బెంపుఁ గలవం జాసించితిం దమ్ముఁడా॥

శా॥ దూరాలోచన చేసిచూడక మదిన్ స్థూలంబు సూక్ష్మంబునం
బ్రారంభింపవు దీర్ఘసూత్రుఁడవుగా వాయాసభీతుండవుం
బారంబుంగని పొంగ వింకఁ గృషివైఫల్యంబుచేఁ గ్రుంగ వీ
ధీరోదాత్తగుణంబు లెట్లు నినుఁ బొందెం దెల్పవే తమ్ముఁడా॥౧౭

శా॥ నీవిద్యావిభవంబు నీవినయమున్ నీతత్వసంశీలన
ప్రావీణ్యంబును నీసుశీలతయు నీ ప్రామాణికత్వంబు నీ
ధీవైశద్యము నీయుదారతయు నీదేశాభిమానంబుఁ గ
ట్టా! వైఫల్యము నొందెగొడ్డుపువులట్లై యెంతయుం దమ్ముఁడా॥

శా॥ విద్యావంతుఁడవై కుటుంబమునకుం బేరుం గడుం బెంపు నే
యుద్యోగంబునొ చేసి తెత్తువని యేనూహించి కావించితిన్
విద్యాసక్తుఁడఁగాన నీకొఱకునై విశ్వప్రయత్నంబులన్
మద్యోగంబున నప్పు తీర్పనెయగుం బండించు పంటంతయున్॥

చ॥ తెలివియుఁ దేటయుం గలిగి ధీరుఁడవై మననేర్చుటన్ మహా
ఫలయుతమయ్యె నీబ్రతుకు పాత్రున కేఁబడు కొంచెమట్లుగాఁ
గొలఁదియు జీవితంబు గుణగుంభితమై పువుదండ పోలికన్
సలలితసౌరభంబు వెదఁజల్లుచు శోభ వహించుఁ దమ్ముఁడా॥ ౨౦

ఉ॥ చీఁకటిచేతఁ గప్పఁబడు చీఁకటిపోలిక నీవియోగమన్
శోకముమీఁద శోకమయి చూచుచునుండఁగ నద్భుతంబుగా
నాకనుదోయి చీఁకటినణంగిమునింగెను గోరుచుట్టుపై
రోఁకటిపోటు చందమునఁ గ్రూరదశాపరిపాక మేమనన్॥ ౨౧

ఉ॥ ప్రాఁబడుకొద్ది నాహృదయభారము తగ్గి క్రమక్రమంబుగా
లోఁబడి స్వచ్ఛపుంబ్రకృతిలోఁ బడు వార్షికమేఘమట్లు లం
చేఁ బదిగాఁదలంచితిని నిట్లు వెతల్ వెడలంగఁ బోసికో
కీబసు వెట్లుడిండు నెదయెట్టులు చుల్కనఁబొందుఁదమ్ముఁడా॥ ౨౨

మ॥ పలుకంజాలను నీకుఁ బద్దెమొకటిన్ వాకట్టో యేమో పదా
ర్నెలలౌ నక్కట! నీవు చెప్పకె ననున్ వీడ్కొన్న నాఁటంగొలెం
బొలయన్మాని యడంగి యుండఁగను దూష్యంగాలి, లేవింక వా
న లటంచెంచితి హీనదైవబలుఁడన్ గానే యయో తమ్ముఁడా॥

చ॥ కలము వడంకఁ జొచ్చెడును గాగితముం దడియం దొడంగెడున్
గళితములౌచు నాయవిటికన్నుల దృష్టిని గప్పునశ్రులం
దలఁచుకొనంగ నిన్నెదను దమ్ముఁడ! యీదురవస్థ నింక నా
యలుకుడువ్రాఁత కన్వయము నర్థమునుం గుదురంగనేర్చునే॥ ౧౪

చ॥ గొనములప్రోవు భక్తి ననుఁ గొల్చిన కూరిమితమ్ముఁ డక్కటా
నను విడనాడిపోయె నయనద్వయియుం జెడినట్టి దయ్యె, నే
యనువున నీఁదువాఁడ విపదంబుధి నోపరమేశ! భక్తిపెం
పొనరఁగ నాశ్రయించెదధృతోడుపమూర్తి భవత్పదద్వయిన్॥ ౧౫

ఉ॥ పాయనికూర్మిచే మనసుఁ బట్టఁగలేక గుణానులాపముం
జేయుదు నేను వానికిఁకఁ జేయున దేదియు లేమిఁజేసి; యిం
కీయవె యాత్మశాంతి పరమేశ్వర! శ్రీజనమంచి—సత్యనా
రాయణమూర్తికిం బరిహృతాప్తహృదార్తికిఁ బుణ్యకీర్తికిన్॥ ౧౬

# సోదరస్మృతి

—0—

## II

ఆ॥ వె॥ ఎందునుండి వత్తు? వెందేగు? డెందుల
కిట్లు తిరుగు? దనుచు నినుని నడుగు
చుండుఁ బులుఁగు లతని యుదయాస్తమయములఁ
జదలఁ బొదలఁ బెద్దరొద యొనర్చి॥ ౧౭

క॥ అడిగినదే యడుగుచునం
బడయవు ప్రత్యుత్తరంబుఁ బత్తులు దామె
ప్పుడు నొకవెలుఁ గొకచీఁకటిఁ
బొడగని దివి భువిని ననుజ! ప్రొద్దులు పుచ్చున్॥ ౨౮

క॥ నినుఁ గాలవశుని గనులను
గనఁజాలక వగతుఁ దమము గ్రమ్మఁగ; మరలన్
గనిలోన రత్నమట్టులు
గని నిన్ను మదాత్మ ననుజ! కందుం దుష్టిన్॥ ౨౯

చ॥ అరుదగు మర్త్యజీవితరహస్యము పేరిటికజ్జమేదొ నీ
కరమునఁ బెట్టి మూసి, కనుగప్పి, వెసన్ నినుఁ దోడికొంచు, నే
మఱుఁగున కేగెనో సురిఁగి మాయపుమృత్యువు చిన్నిబాలుఁ ద
స్కరుఁడనుబోలె నీయిహము సంగ్రహియింపఁ దలంచి తమ్ముఁడా॥

***

చ॥ మిహిరునఖండతేజమును మ్రింగెడి దుష్టగ్రహోపరాగమో
తుహినమయూఖురశ్మి వెస దొంగిలుమబ్బుమునుంగు దొంగయో
బహుసుఖరూపమౌ నిధియవాప్తికిఁ గన్నులయంజనంబొ, యో
సహజ! యదేమొ చెప్పఁగదె స్పష్టముగా మరణస్వరూపమున్॥

చ॥ అమృతపయోధిఁ బీల్చి కుతియారక దూపిలు బాడబాగ్నియో
సుమహితకాలరూపమునఁ జోద్యముగాఁగ సమస్తజంతులన్
సమలకె మ్రింగు గూఢచరణంబొ, యిఁకేల మరణంబనన్ మహా
శ్రమ లుడుగంగ నోయనుజ! చల్లగఁ బైకొను పెద్దనిద్దురో॥ ౩౨

మ॥ మనగోదావరిమీఁది వంతెనగసంభావింతునో? తమ్ముఁడా!
అనుభూతం బది నీ కదోమయము నా కామృత్యు వా సేతువ
ట్లనువై యుండునె రాకపోకలకు భూమ్యాకాశసీమంబులన్
జనుచుండ్రే పటువాసనావశు లటన్ సంసారయాత్రాపరుల్॥ ౩౩

మ॥ కనరా రంచుఁ దలంతు నీవుచనుమార్గంబందు మృత్యుంజయాం
ఘ్రినితాంతామలభక్తితత్పరులు దూరీభూతకామాదివై
రినికాయుల్ నిరపాయు లవ్యయసుఖశ్రీభోగులౌ యోగులుం
గనరా రిందును నట్టిపుణ్యు లెచటన్ గాలించినం దమ్ముఁడా! ౩౪

***

మ॥ చిననాఁ డీశ్వరు తేరిపై ముసుగాఁ జిత్రింపఁగాఁబడ్డ కా
లుని కాలాకృతి, దున్నవారువము, నాలోకించి యావెన్క సూ
చనగా శ్రీరవివర్మ చిత్రమునఁ దచ్ఛాయాకృతిం జూచితిం
గనెదన్ నేఁడది తత్త్వదృష్టిని మహాకాశస్థనైల్యాకృతిన్॥ ౩౫

ఉ॥ ఆఱెడిదివ్వె కాంతివలయం బెటు డిందుఁ గ్రమక్రమంబుగం,
బాఱెడి యేటివెల్లినడుమం జిఱులంక యెటుల్ మునుంగు, న
ట్లారయ నేత్రవైద్యుఁడగు నల్ల సదాశివు మత్తుమందు చే
కూరుచు మబ్బులోఁ దెలివి గ్రుంకఁగ నేనఱసావు సూచితిన్॥ ౩౬

క॥ చూచితిని గాని తమ్ముఁడ!
లేచితి నే మఱల నిదురలేచిన భంగిం
జూచితిఁ గ్రొత్తగనుల మును
చూచినదియుఁ జూడనిదియు శోధనమునకై॥ ౩౭

***

క॥ మును శరతల్పగతుండై
మనుమనికిని సకలధర్మమర్మము లెఱిఁగిం
చిన భీష్ముఁడట్లు చెఱనుం
డిన తత్వజ్ఞాని "సోక్రటీ" సిటు పలికెన్। ౭౮

గీ॥ "బ్రదికియు మృతుండు మృతుఁడయ్యు బ్రదుకు జ్ఞాని
దేహచింతను మఱచి యాత్మీయచింత
మఱఁగి వర్తించుకతనఁ; దన్మరణ మనఁగ
నాత్మ దేహమున్ విడి వేఱగుట కాదె"? ౭౯

గీ॥ మరణ మన్నను దేహంబు మార్పె యగుట
దానికయి భీతినొందఁడు జ్ఞాని యెప్డు
శిశువుదేహంబు పెరిఁగి పుష్టిని వహింప
మరణ మని దుంఖపడుదుమే మార్పు చూచి॥ ౮౦

క॥ ఈయింటం గుడుతుము మన
మాయింటం బండుకొందు మనుజ! తలఁపుమీ
యీయుభయకార్యసదృశము
లే యగునో జీవితంబు నీమరణంబున్॥ ౮౧

మ॥ పరమిం దాత్మకు నూత్నజీవనము సంపాదింపఁగాఁ గల్గుటన్
మరణం బెట్లగు దుఃఖకారణము? జన్మంబే యదా నచ్చటన్;
మరణంబే యగు మర్త్యలోకమున జన్మంబందుటల్ తర్చుగా,
మరణంబున్ జననంబు రెండు నొకటే మాయావిలాసం బహో॥

గీ॥ ప్రకృతి యందురు మరణంబుఁ బ్రాణులకును
వికృతి యంద్రు జీవితమును విబుధు లింకఁ
దల్లిపిల్లలౌ నీరెండుఁ బిల్లలగును,
బిల్లగాకుండఁ బుట్టినతల్లి కనుఁజ॥ ౭౩

క॥ అవ్యక్తము మరణంబగు
నవ్యక్తము జీవిత మగుఁజుమి; యేతత్ద్వం
ద్వవ్యతిరిక్తుని గనియెద
రవ్యయు బుధు లభవు సచ్చిదానందమయున్॥ ౭౭

క॥ గతిహీనస్థితి మృతియని
మతిహీనులు జీవితముసమాప్తికినై, దుః
ఖితు లగుదు రాశగొని యీ
బ్రతుకుపయి; స్థితియు నగోచరమగు గతియె యౌ॥ ౭౫

చ॥ కదలికలేక యేయణువు గాని జగంబున నిల్చియుండనే
రదు;పరిణామముంగనుచుఁ బ్రాఁకెడుమెల్లగ ముందుముందుకుం
గదలనిపూన్కిఁ జీమవలె గమ్యముఁ జేరెడుదాఁక; నంతటన్
గదిసి మహేశుఁ బంటగడికాయవిధంబునఁ బొల్చుఁదమ్ముఁడా॥

***

శా॥ ఏలోకంబున నుందువో, యిప్పుడు నీ వేరీతి వర్తింతువో
యాలోచింపఁగ రాదు, రాదు కలలో నైనన్ భవద్వార్తయున్
జాలిం గొందు, నినుం దలంచి, యటులే, సన్నెంచి నీవుందు వేన్
మేలౌ; నెక్కడనున్న నొక్కటగుటం బ్రేమం బిఁకందమ్ముఁడా॥

శా॥ ఈభోగంబులు నీకు లేవుగద యం, చేనెట్లు చింతింతునో
యాభోగంబు లొకండవై కుడుచు చీ వట్లే విచారింతు వేన్
"క్షోభం జెందకు" మందు నేమనిన నెచ్చోనుండినన్, నేసదా
నీభద్రంబును, నీదుస్వాస్థ్యమునె, చింతింతుంగదాతమ్ముఁడా!॥౮౮

శా॥ రాలన్ స్థూల మిటన్ యమాలయమనన్ రాజిల్లు సూక్ష్మంబునన్
లీలన్ నూత్నగృహప్రవేశ మయి గాలిన్ మిణ్గురుంబోలెఁ ద
త్కేళీనందనసీమఁ గామగతివై క్రీడించు చీవుండఁగా
నాలోచింపక నిన్ను శోచ్యుఁడనుఁగొం టజ్ఞానమాఁదమ్ముఁడా॥౮౯

శా॥ స్థూలంబున్ గ్రహియించి కొద్దిసుఖ మొందున్ మర్త్యుఁడెట్లోభువిం
జాలన్ సౌఖ్యముఁ; గాంచు సూక్ష్మతనుసంచారంబు గల్గన్ దివిన్;
బోల న్నేర్చునె జింకనేనుఁగు? మనంబుం గాలియుం బోలునే?
తూలుంబంతిని మంటిముద్దయు? వృథాస్థూలంబులే యయ్యెడున్॥

***

మ॥ శరధిం దీవులు కొన్ని దారుణశిఖిజ్వాలాకరాళాస్యభూ
ధరముల్ దాల్చియుఁ, గొన్ని రమ్యసుమనోధామంబులానందనో
త్కరముల్ దాల్చియు నిల్చునట్టులె జగచ్చైతన్యవారాశిలో
నరకంబుల్ మఱి స్వర్గముల్ నిలుచునో నానాప్రకారంబులన్?॥

మ॥ సరసీజాప్తుని మండలంబునను మచ్చల్వోలె, రాకాసుధా
కరబింబంబునఁ గానవచ్చెడి కళంకంబట్లు, గౌరీమనో
హరు కంఠంబునఁ గ్రాలు కాళిమముచాయన్, నిల్చునో యెందునున్
నిరయం బంచును బొట్టువాడ్చినయటుల్ నిర్దిష్టమై తమ్ముఁడా!॥

మ॥ అపరిచ్ఛిన్నున, కేకనాథునకు, నిత్యానందవారాశికిన్
విపరీతస్థితిఁ దెచ్చిపెట్టుదుముగా! వేర్వేఱుగా నీత్రివి
ష్టపము, న్నారకమున్, స్థితీతరములౌ స్థానంబులై నిల్చునం
చపవాదంబులకుం గడంగితిమయే? నాఁగాదె యోతమ్ముఁడా॥ ౫౩

శా॥ పాముల్ పుఱ్ఱెలు భస్మచర్మవిషముల్ భవ్యేతరంబుల్ సుధా
ధామస్వర్వాదిసర్వమంగళలు భద్రస్థానముల్ గా నిటుల్
భీమంబై యభిరామమైన శివమూర్తింబోలి మాయామహా
సామర్థ్యంబున విశ్వజీవన మహాసంసృష్టిఁ బొల్చుంగదా॥ ౫౪

ఉ॥ శాంతియె స్వర్గ మెంచఁగ నశాంతియె నారక మిందునందు నో
శాంతగుణుండ! యింక బహుజన్మతపఃఫలమైన పూర్ణవి
శ్రాంతియె మోక్షమద్దియును జ్ఞానము భక్తియు రెంటఁగూడఁగాఁ
గాంతురు పుణ్యులంచుఁ బలుకంబడుచుండు సదా బుధాళిచే॥ ౫౫

శా॥ జన్మంబెత్తి నరుండు జ్ఞానమును దా సాధించు టర్హంబె యై
న న్మోసంబగు మోక్షమాటకును జ్ఞానాదేవ కైవల్యమం
చు న్మానంబడునేని భక్తికృషి, తోఁచున్ సర్వమున్ శూన్యమై
హృన్మదోంతరసీమ నాడెడునుగాదే యూపి రోతమ్ముఁడా!॥ ౫౬

ఉ॥ పానములేక యె ట్లొడలఁబట్టదొ యన్న, మటుల్ సుభక్త్యను
ష్ఠానవిహీనమై ఫల మొసంగదుసూవె గురూపదిష్టమా
జ్ఞానము కాశికిం దెరువు సాధులచేత నెఱింగినంత, నే
మా, నిఁకఁ బైనమై తరలి యాపురిఁ జేరినఁగాక తమ్ముఁడా॥ ౫౭

మ॥ తెలియం జూడుము పక్షపుచ్ఛములు భక్తిజ్ఞానయోగంబులై
నిలుపన్, ధైర్యమరుద్విధూతముగ సందేహాభ్రబృందంబు, ని
ర్మలమై యొప్పు నభంబునన్ నిలుపుచున్ మార్తాండుపై దృష్టినిన్,
బలియుంగా విబుధేంద్రుఁ డేగు నమృతావాప్త్యర్థమై తమ్ముఁడా॥

***

మ॥ మరలన్ వత్తువటంచు కొండ, అదియేమాటందు రింకన్య, శ్రీ
పరమంబైన రహస్య మెవ్వరును దెల్పంజాల రిట్లంచునున్;
మరణంబే యగునేని మోక్ష మది సంపాదింపఁగా యత్న మొ
క్కరుఁడుం జేయఁడు చేయఁ గారణమునుం గన్పట్ట దో తమ్ముఁడా॥

మ॥ స్వరసమ్మేళనశక్తి, వీణ చెడిపోవం, బోవున ట్లాత్మకున్
మరణంబందురు పంచభూతపరిణామంబైన దేహంబుతో
స్మరణంబాటను జ్ఞానమంతయును సంస్కారప్రబోధంబుచేఁ
గరమున్ శక్యముగాక యుండెడును వెన్కన్ నేను లేనంచనన్॥ ౬౦

చ॥ ఎఱుఁగుదు నేనెఱింగినది యెంతయు నల్ప మటంచు, దానిచే
నెఱుఁగుట యెట్టు లేను గనియే వినియేని యెఱుంగనట్టి యీ
పరమరహస్యముల్? శివుకృపామహిమంబునఁ బూర్వవాసనల్
పరిణతిఁ జెంద దర్పణతలంబుననె ట్లటులాత్మఁ జూచెదన్॥ ౬౧

***

శా॥ ఇలితన్ గ్రంథసమాప్తి యంద్రు తరువా యేమాత్రమున్ లేదటం
డ్రంత ర్వేదికిఁబోలె నూ ళ్లవలలే వండ్రయ్యయో యాత్మకున్;
సంతప్తాంబుధిబాష్పమట్లది యదృశ్యంబై దివిం జేరి యా
సంతాపంబు శమింప వెండిఁ జినుకై జాఱన్ భువిం దమ్ముఁడా!॥

చ॥ కడుపునఁ గొన్ని డిందెను, నకాలపుమృత్యువు చాతకంబెగాఁ;
బుడమిని రాలుఁ గొన్ని తడుపుం బయిపై నటుకొన్ని కంటినీ
ర్దుడుచునఁగొన్ని నించుఁ బరితుష్టిగఁ జిక్కులు కొన్ని, శుక్తిలోఁ
బడినవి,ముత్తియంబులయి స్వామికి హారముఁ గూర్చెఁదమ్ముఁడా!॥

ఉ॥ పుట్టుచుఁ జచ్చుచున్ మరలఁ బుట్టుచుఁ జచ్చుచు నిట్లు దేహి,తన్
బట్టిన కల్మషంబుఁ బెడఁబాసి పుటంబుల వన్నె కెక్కుచుం
బట్టెడమీఁద సాఁగుచును మాటికిఁ గుంపటిలోనఁ గ్రాఁగుచున్
మెట్టుల నన్నిటిం గడచి మేలిమిసొమ్మగుఁజూవె తమ్ముఁడా!॥౬౪

ఉ॥ నిన్నటిసూర్యుఁడే మరల నేఁడు గనంబడి వెల్గు వేడిమిం
జెన్నుగ నిచ్చుచుండుఁగద నీవును నం దొకవెల్గువాచు నా
కన్నులకే కనంబడెదు, కన్పడకుందువె దివ్యదృష్టి చే
కొన్న విచక్షణోత్తములకున్ విశదంబుగ నింకఁ దమ్ముఁడా!॥౬౫

ఉ॥ కామము లేదు నీకొకటి కౌఁగిటిలో నిముడగరాని యా
ప్రేమముమీఁదఁ బుట్టిన యపేక్షయ కాని తదీయపూర్తికై
భూమికి వెండి వత్తువని బుద్ధిఁ దలంతు వినూత్నసౌహృద
స్థేమమనోహరంబులగు దీర్ఘభుజంబులు చాల్చి తమ్ముఁడా! ౬౬

***

శా॥ సంసారంబన రోఁతపుట్టెడును మోక్షంబే యపేక్షింతు మా
సంసారంబునఁ బుట్ట కెప్పగిది మోక్షంబబ్బుఁ దద్దాతయా
కంసారాతియు జన్మముం బడయఁడే కారాలయంబందుఁ? బ్ర
ధ్వంసం బెట్లగుఁ బ్రాగభావమునకుం దర్కింపు మోతమ్ముఁడా!॥

ఉ॥ ఆవలియొడ్డుఁ జేరి కుతియారఁగఁ గ్రోలుము స్వచ్ఛజీవనం
జీవలియొడ్డునం బసుల మెక్కుడుఁ ద్రొక్కుడుచే జలంబు పం
కావిల మయ్యె నైన నదె యంబరగంగయటన్న పూర్ణసం
భావనఁ జేసి త్రావుదుము, వాస్తవమట్టిదికాదెతమ్ముఁడా? ౬౮

శా॥ ఆకాశంబుననుండి శంభునిశిరోద్వారంబునన్ భూమిపైఁ
బ్రాఁకన్నేర్చిన బిడ్డకట్టులు రజస్స్పర్శంబుచే నైనదే
గాకీకల్మష మెన్నఁగా సహజమే గంగామహాదేవికిన్?
లోకోజ్జీవని, లోకపావని, నెటుల్ దూషింపనౌఁ? దమ్ముఁడా॥ ౬౯

మ॥ ఒకచన్నీదరి తల్లిగాతమికి; నీయున్నట్టి యాయొడ్డు వే
ఱొకచన్నైన, మొసఁగన్ సహోదరులమై యుష్ణాంగుజీవామృతం
బకలంకస్థితిఁ గ్రోలుచుందు మిఁక దాహం బగ్గలం బౌటనా,
సుకృతీ! నీవధికంబు గ్రోలుదు విదే సుమ్మీ విభేదంబనన్. ౭౦

శా॥ నీకూహ్యాసము నేఁ బయిం దొడుగుదున్ నీపాగ నేఁజుట్టుదున్
నీకష్టంపడి కట్టినింట నిలుతున్ నిల్తీవు నాయాత్మలో
నీకన్నట్టి యనుంగుబిడ్డల నిఁక న్నేఁజూతు నీకంటనే
నీకు న్నాకు విభేద మెక్కడిది నేనే నీవుగా తమ్ముఁడా!॥ ౭౧

మ॥ కరుణం బొక్కటియే రసం బనుట నిక్కంబేమొ చూడన్ భవ
త్స్మరణంబుంబెనుబుగ్గఁ బుట్టినదియై జాల్వాఱి చింతాపరం
పర లేళ్లై కలయన్ హృదాకృతిముఖద్వారానఁ ద్వద్యోగసా
గరసంగంబు భజించుఁ జిత్తము! వియోగం బేమనం దమ్ముఁడా॥

శా॥ అద్వైతానుభవం బనంగ నిదియే యానేమొ యంచేను నా
హృద్వీథిం దలపోయుదున్ దృఢతరప్రేమానుబంధంబుఁ, గా
మద్వేషంబు, నుమామహేశ్వరుల దాంపత్యంబునందుంబలెన్
విద్వాంసుల్ గనుచుంటఁజేసి యుగపద్వ్యాప్తిన్ హృదిందమ్ముఁడా॥

ఉ॥ త్యాగమునందె భోగ, మరయంగ వియోగమునందె యోగ, మే
లాగన నీశుఁ డాహాలహాలంబును మ్రింగియు భోగిభూషణుం
డౌఁగద యింక భూమియును నాకసమున్ విడి యున్నవయ్యు సం
యోగముఁబొందుచుండుఁగద, యూహనొనర్చి కనంగఁదమ్ముఁడా!

శా॥ భూసంధిన్ విడఁగొట్టి నట్టనడుమం బూర్వాపరాంభోనిధా
నాసత్తిం, గలిగించు నైక్యము, నహో యాతెల్లరాకాసి; యీ
భూసంబంధము నట్లె కాలుఁ డెడఁబాపుంగాక యేమబ్బునం?
దాసాభ్రాత్రమహాబ్ధి యెప్డు నొకటే యౌఁగాదె! యోతమ్ముఁడా॥

క॥ భువినుందు నేను దమ్ముఁడ!
దివి నుందువు నీవు; భువియు దివియును నను ని
య్యవి రెండు నుండుఁ బ్రేమను
గవలుంబలె నొక్కతల్లికడుపున నోహో॥ ౭౬

***

క॥ ఇదియేసుమి పరమార్థం
బిదియేసుమి పరమతత్త్వ మిదియేసుమి నా
హృదయమున నిలిచి యీశుఁడె
విదితముఁ గావించె నాకు వినుమో యనుజా॥ ౭౭

క॥ ఏయది సిద్ధించుటకై
చేయుదుమొ తపంబు నేది సిద్ధించిన నిం
కేయదియు మిగులకుండునొ
యాయది పరమార్థ మందు రది ప్రేమసుమీ ౭౮

క॥ చేరువవైు హృదయములకుఁ
జేరఁజనం గనకమృగము చెలువునఁ బైపైఁ
బారెడిదయి పూసలలో
దారమువలెఁబొలుచు జీవితంబుల నిదియే॥ ౭౯

మ॥ తనయిల్ నిండఁగఁజూచుఁ జిన్నదయి డెందంబుండ లోనుండియే
తనదేశంబును నిండఁజూచు బయలం దావచ్చి కన్వేచ్చుచుం
దన యీ రెండును నడ్డునం బడఁగ నంత న్నిండఁజూచుం బయిం
జను చీ ప్రేమ త్రివిక్రమాకృతిని నాశాపూర్తికై తమ్ముఁడా!॥ ౮౦

క॥ ప్రేమ మెసుమి యీశుఁడనం
బ్రేమమె తత్ప్రథమమూర్తి మీనాకృతిగా
దేమన్న జలములేకీక
నేమొయి జలచరము పుట్టు నెందును ననుజా॥ ౮౧

క॥ తామరకుఁ జుట్ట మగుటను
బ్రేమ నదెందున్న నందె వెలిఁగించుననన్
ధామనిధి ప్రేమనిధియై
కోమలహృదయారవిందకోశముఁ జేరున్॥ ౮౨

క॥ ఎఱిఁగియు నీ వెఱుఁగవును
మ్మెఱుఁగుదు నే నెఱుఁగకుండి యీశ్వరతత్త్వం
బరయంగ లేదు భేదం
బిరువురకును గలదటన్న నిదియే సుమిత్రా॥ ౮౩

ఆ॥ వె॥ కర్మయోగి వీవు జ్ఞానయోగిని నేను
కవినినగుటఁ; గాని యవరజుండ
వీవుగావు, గాను నేనగ్రజుఁడఁ, గల్గు
సోదరత్వ మొకటె యోగమందు॥ ౮౪

***

శా॥ అక్షుల్ రెండును శాస్త్రముం గలసి మూఁడౌ నేత్రముల్ చూడఁ బ్ర
త్యక్షంబుల్ మఱియుం బరోక్షమును; బాగ్రై యుండ మిం జూచి ఫా
లాక్షుం డయ్యావి, నాయెడం గృపను నాయందుండి సర్వజ్ఞుఁడై
శిక్షింపం జుమి యీ యశేషమును వీక్షింతున్ హృదిందమ్ముఁడా॥ ౮౫

శా॥ ఈవే మూలము యామహేశ్వరుఁడు దానే మూలమో ప్రేమభ
క్త్యావేశంబునఁ బల్కుపల్కు లివి సత్యజ్ఞానమూలంబులై
భావింపంబడు నీవు నీశ్వరుఁడు నద్వైతస్థితి న్నిల్చి నా
భావంబందు వెలుంగుటన్ సుగుణదీపా! సత్యనారాయణా!॥ ౮౬

ఉ॥ ఆడకె యాడుదుర్ శ్రుతిరహస్య మెఱింగినవాఁడపోలె నేఁ
బాడక యల్లై పాడుదు నపారముగా సుఖపారవశ్యముల్
చూడకె చూతు నర్థమును సూరిజనంబులు, తత్త్వముంబలెర్
నేఁ డిదియేమొ నాహృదిని నిల్చి వెలుంగ శివుండు తమ్ముఁడా! ౮౭

***

చ॥ అడిగితి వొక్కనాఁడు హృదయార్తి ఘటిల్ల నపాయశంక, స
న్నిడుకొని నీదుప్రక్క నిఁక నీశ్వరతత్త్వముఁ జెప్పుమంచు; నాఁ
డడిగినదానిఁ దెల్పుటకు నాదరు వేదియు లేనివాఁడనై
యడలకు నీకు వచ్చినభయం బిఫు డేమని యూఱడించితిన్॥ ౮౮

క॥ అటులే యొకమూఁడేండ్లె
ట్లిటులో పడి క్రింద మీఁద నీడ్చితి; వటుపి
మ్మటఁ గూఁతు నెత్తుకొంటి; వ
నఁటికా న్పది యయ్యెనీకు నాతికి నకటా!॥

ఆ॥ వె॥ ఏమరించె నిన్ను మృత్యువు, జోకొట్టఁ
గన్నుమూసినట్లె కానఁబడుచు
నిదురపోని చంటినిసువట్లు, తలయెత్తి
చూచె నిన్ను, దానిఁ జూచి నగితొ? ౯౦

ఆ॥ వె॥ గొంతులోన మందు గొనితెచ్చి యొకయింత
పోయనైతి జపము సేయనైతిఁ
జెంతఁజేరి చెవిని శివశివ యనుచు, నీ
కెట్లు ప్రియముఁ గూర్తుఁ? గృతిని గూర్తు॥ ౯౧

ఆ॥ వె॥ నాఁటినీదుప్రార్థనము నేఁటిత్వత్కర్ణ
మంత్రజపవిధానతంత్ర మయ్యె
విధినియుక్తి; ననుజ! విను దీనిచే నాత్మ
శాంతి నీకు, దుఃఖశాంతి నాకు॥ ౯౨

—0—



ఓం

శ్రీపరమాత్మనేనమః

# కరుణగీతము

—:o:—

గీ॥ "రెండుపెట్టెలు! కానికి రెండుపెట్టె!
లయ్యగారండి, కొనరండి" యనుచు నొక్క
చింపిగుడ్డలు కట్టిన చిన్నబాలుఁ
డగ్గిపెట్టెలు నాకడ కమ్మఁదెచ్చె.

ఆ॥ వె॥ తెచ్చి యాసఁజేసి తివిరి నాడెసఁ జూచు
చున్నవానిఁ, బేదచిన్నవానిఁ
జూచి యిట్టులంటి, "నోచిన్నవాఁడ, నా
కవసరంబుగాదు; అవలఁ జనుము."

ఆ॥ వె॥ అనినఁ బోక నిలిచి యాబాలుఁ డెంతయు
వినయ మొప్ప నిట్టు లనియె మరల:
"నిండుపెట్టెలండి నిలిచికాలెడివండి
పుచ్చుకొండి యయ్య! పుచ్చుకొండి."

గీ॥ "నిండుపెట్టెలై కావచ్చు; నిలిచికాల
వచ్చు, మఱియెట్టిదైనఁ గావచ్చు-నిజము:
అవసరము కానిదే యెవ్వరైన సొమ్ము
వెచ్చపెట్టుదురే సొమ్ము వెఱ్ఱివాఁడ॥" ౪

ఆ॥ వె॥ "ఇచ్చి పుచ్చుకొనుటయే గాని, యేగాని
భిచ్చ మడుగలేదు పేద ననుచు;
అవసరమునుబట్టి యడిగెదఁ,-గానికి
మూఁడుపెట్టె లిత్తుఁ బుచ్చుకొనుఁడు." ౫

ఆ॥ వె॥ అనిన వానిదగు నుదారభావముఁ జూచి
యిట్టు లంటిఁ బ్రీతి యెసక మెసఁగ;
"అవసరమునుబట్టి యమ్మెద నంటివే
యెట్టియవసరమ్మొ యెఱుఁగఁ జెపుమ॥ ౬

ఆ॥ వె॥ అనుడు బాలుఁ డిట్టు లనియె విన్నదనంబు,
వదనపద్మమందుఁ గుదురుకొనఁగ—
"లోకమందుఁ గలవె యాఁకటికంటె నో
యయ్య! యెక్కుడైన యవసరములు॥ ౭

గీ॥ నిన్నరాతిరి దిన్నట్టి యన్నమెంతొ
యంతె, మఱిలేదు దిననాకు నింతవఱకు
నెన్నివీధులో దిరిగితి, నెండఁ బడితి
అమ్మలేనైతి సేరుబియ్యమున కైన॥" ౮

ఆ॥ వె॥ అనుడు నిట్టు లంటి-"నప్ప! నీతలిదండ్రు
లెవ్వ? రెచటనుందు? రేమి సేతు?
రేమికారణమున నీ పిట్టికష్టంబుఁ
జెందవలసివచ్చెఁ జెప్పు"-మనిన॥ ౯

ఆ॥ వె॥ "తండ్రిలేఁడు: కలఁడు తమ్ముఁడొక్కఁడునాకుఁ
దల్లి లేదు సవతితల్లిగాని;
ధైర్యమే ధనమ్ము, దైవమే శరణమ్ము
గాఁగ నిట్లు మిగులఁ గష్టపడుదు॥" ౧౦

ఆ॥ వె॥ అనుచు బాలుఁ డిట్లు తనకథ వినిపింప
వింటి విస్మయంబు వెఱఁగుఁ దోఁప
సంతసమునుఁగంటి సంతాపమునుఁగంటి
నొకయణాకుఁ బెట్టె లొప్పి కొంటి॥ ౧౧

క॥ కొని, చిల్లరలే దని చె
ప్పిన, వేగమె తెత్తుననుచు వెడలెను నాయి
చ్చిన యర్థరూపికను జే
కొని బాలుఁడు దాని మార్పఁగోరినవాఁడై॥ ౧౨

ఆ॥ వె॥ వెడలి విపణివీథిఁ బడిపోయి, పోయిన
పోకగాఁగఁ దిరిగి రాకపోయె___
గడియయయ్యె-రెండుగడియలయ్యెను-మూఁడు
గడియలయ్యె-నాల్గుగడియలయ్యె- ౧౩

క॥ ఏసరికి రాకయుండిన
వేసరి యిది యొక్క మాయవేసం బేమో
మోసపడి యర్థరూప్యపుఁ
గాసుం జేవిడిచితి ననుఁ గని నగరె జనుల్? ౧౪

ఆ॥ వె॥ మాటతీరుఁ జూచు మర్యాదయును జూచు
మొగముఁ జూచు నేత్రయుగముఁ జూచు
నెవఁడుగాని నరునిహృదయాంతరాళంబుఁ
జొచ్చి శోధచేసి చూడఁగలఁడె? ౧౫

ఆ॥ వె॥ సుజనుఁ డన్యజనుల సుజనులఁగా నెంచుఁ
గుజనుఁ డెంచు నొరులఁ గుజనులట్లు;
ఎవ్వ రెద్ది సూతు రవ్వారి కద్దియు
కానఁబడుచునుండుఁ గాదెజగతి? ౧౬

ఆ॥ వె॥ నేఁటిచిత్రకథయె నిజమేని సుజనులు
కల్లనిజము లరసి కానలేక
ఆర్తులైనవారి నరసి ప్రోచుటకును
సంశయింతు రని విచార మొదవు॥ ౧౭

క॥ అని యిట్టు లాత్మగతమున
ననుకొంటిని గాని, తలఁపు లాక్షణము కలం
గిననీటిమీఁది బుగ్గల
యనువున నడఁగుటయు, సంశయాకులమతినై॥ ౧౮

క॥ ఏపాప మెఱుఁగఁడేమో!
పాపనిపై లేనిపోని పాపంబుల నా
రోపించి కడకుఁ బశ్చా
త్తాపము పొలఁగుదునేమొ! దైవమ యెఱుఁగున్॥ ౧౯

మ॥ అనివార్యంబుగఁ జిక్కి యొక్కయెడ నీయాలస్యముం జేసెనో
అనిమిత్తంబుగ వచ్చి పైఁబడియెనో యాపత్తొకండేదియే
ననుమానంపడఁ గారణంబు గనరా దన్నాతురుండైన యీ
మునిపైఁ బాపము మోపి పాపపుగతింబోనొల్లనేనిన్ వెసన్॥ ౨౦

క॥ అని యిట్లు మనసు ముందుకు
వెనుకకు నురియాడుచుండ వేసరి యిఁకఁ బో
వనెపోయెఁ బోయినది, మఱి
యును బోనేలనుచుఁ బోవనుద్యుక్తుఁడనై॥ ౨౧

క॥ ఉండునెడఁ జీఁకటింటికి
నిండుగఁ జేదివియవోలె నిలువంబడె నా
దండ నొకబాలుఁ డెవ్వఁడొ
దండిగ నేబులను జేతఁ దాలిచి మఱియున్॥ ౨౨

క॥ వెడసూపు చూచి గుండెలు
దడదడమన, నోటమాట తడఁబడ, నూర్పుల్
వెడలఁగ, దఱచై యెడనెడ
ముడివడి భయసంభ్రమములు మోమునఁ దోఁపన్॥ ౨౩

ఆ॥ వె॥ ఇట్టులనియె : "నయ్య! యిందాఁక మీకగ్గి
పెట్టె లోకయణాకు బేరమిచ్చి
యర్ధరూపికఁ గొని యరిగిన మాయన్న
చిల్ల రంపినాఁడు చేకొనుండు॥ ౨౪

క॥ మీరున్న యెడకుఁ జిల్లర
మాఱిచికొని వచ్చుచుండ మాయన్నపయిం
బాఱె నొకబండి, గుఱ్ఱము
వారింపఁగరాక వెఱచి పఱచుటవలనన్॥ ౨౫

గీ॥ పాఱుటయుఁ గాలువిఱిగి మావాఁడు నేలఁ
గూలెఁ, జేనున్న డబ్బులు రాలెఁ జెదరి,
పడిన చోటెల్ల నెత్తుటఁ దడిసె, దానిఁ
గనిజనముల నయనయుగ్మములుఁ దడిసె॥ ౨౬

ఆ॥ వె॥ ధర్మవైద్యశాలఁ దా నిప్పు డున్నాఁడు
బ్రదుకుమీఁది యాస వదలినాఁడు
దిక్కు తనకు, నాకు, దేవుఁడే యని నన్నుఁ
గాంచి కనుల నీరు సించినాఁడు॥ ౨౭

ఆ॥ వె॥ తక్కుపైక మిచ్చి తప్పుసైఁపఁగ మిమ్ము
వేఁడుకొనఁగఁ బంపినాఁడు నన్ను ;
మాయమయ్యె బేడ మాయన్న పడినప్పు
డిది సహించి, యిది గ్రహింపవలయు" ౨౮

క॥ అని పలకేల్పాంచియు మో
ము నెత్తలేక కనులు నులుముకొనుచు డా కే
లను, దుఃఖ మాగమిని నే
ర్చిన బాలుని చేయిపట్టి చెచ్చెర నేనున్॥ ౨౯

క॥ “అడలకుర యన్నకొంత్కై
యుడలకురా యన్న! నీకు నగునాపదకై
సడలించి చిక్కు లెల్లను
వెడలించెద నిన్ను, భయము విడువుమి” యనుచున్॥ ౩౦

గీ॥ చెమ్మగిల్లిన నాకంటిచిన్నెఁ గని యొ
యభయహస్తంబు దన కబ్బు టదియెఱింగియొ
చిన్ని బాలుఁడు నేనిచ్చు చేరుమాలు
కన్నుఁగవ నద్దుకొని తోఁన కలఁక దేఱె॥ ౩౧

* గీ॥ ధన్యమయ్యె నాజన్మము ధన్యమయ్యెఁ
జేరుమాలును ధన్యతఁ జెందెఁ బేద
బాలు దుఃఖాశ్రువుల నెల్లఁ బాయఁదుడిచి;
పొందునే ధన్యత ధనంబు ముడిచి?” యనుచు॥ ౩౨

---

* క॥ పరదుఃఖ దుఃఖితులగు సు,చరితులు శోకార్తులైనసాధులయశ్రుల్
హరియింతురుస్వాశ్రువులనె, వెరవరిములుముంటిచేత వెడలించుక్రియన్॥

మొదటవ్రాసిన పద్యము-అతుకకపోవుటచే అడుగునఁ బడినది.

ఆ॥ వె॥ ఇట్లు హర్షవశత నేమేమొ యనుకొంటి
నది యటుండనిచ్చి యిది వినుండి
వైద్యశాలనున్న భాగ్యహీనుని జూడ
వెడలినాఁడ బాలు వెంటఁగొనుచు॥ 33

ఆ॥ వె॥ అక్కటకట! యెవ్వఁ డట్టికష్టముఁ జూడఁ
గలఁడు? నోట నుడువఁగలఁడు చూచి?
కన్నవాకె కాదు విన్నమీకును ఖేద
మొదవుఁజుండి సదయహృదయులార॥ 34

గీ॥ కాలు దెగఁగొట్టి యచ్చోటఁ గట్టుగట్టి
నెత్తుకందువునట్లు నిర్నిద్రు డగుచు
వైద్యవర్యులు దన్నుఁ గాపాడుచుండ
మంచముననున్న బాలుండు నన్నుఁజూచి॥ 35

ఆ॥ వె॥ "తప్పుసైపుఁ" డనుచు దండమ్ము వెట్టఁ దా
నెత్తలేక చేతు లెత్తి నాకుఁ;
"దమ్ముఁ డున్నవాఁడు దయఁజూడుఁడీ! యింక
దిక్కు నాకు దేవదేవుఁ" డనియె॥ 36

క॥ అని యొకనిముసము పైకె
త్తెను గను, లొరగి మూసె, మరలఁ దెఱచెఁ, దెఱచుడుఁ
జని నేను మీఁదఁ జేయిడి
"నిను దేవుఁడు ప్రోచుఁ, బ్రోతు నే నీతమ్మున్॥" 37

ఆ॥ వె॥ అంటి; నపుడు బాలుఁ డాశ్చర్యసితుండయి
చూపెఁ బ్రీతి కంటఁ జూచి—యంత
నింతకంటె వాని కేఁజేయునది లేమి
యెఱిఁగి తిరిగినాఁడ నింటివంక॥ ౬౮

గీ॥ "ఏలవచ్చె నాకడకు వీఁ? డేల కొంటి?
నేల చిల్లరఁ దేఁబోయె? నేల తప్పుఁ?
గారణమ్మైతి నే విధిప్రేరణమునఁ
బాలుఁ డాపత్తునకుఁ బాలుపడుట కకట! ౬౯

గీ॥ చూచుదనుక నాకేమియుఁ దోఁచకుండెఁ
జూచినవెనుక నేమియుఁ దోఁచదయ్యె
మేలుకొన్న సమాధినిఁ గీలుకొన్న
బ్రహ్మవేత్తకు మాయాప్రపంచమట్లు॥ ౭౦

క॥ ఈకడపటిభావమె హృద
యాకలితంబయ్యె, నియ్యుదారచరిత్రం
బూకొంచును లోలోనే
తోకొంచును బాలు, నింటిత్రోవం బోవన్"॥ ౭౧

* ఆ॥ వె॥ "ప్రాఁదెలుంగుఁగమ్మ" వ్రాసిన గిడుగుశ్రీ
రామమూర్తి కుత్తరముగ దీనిఁ
బనుప మిమ్ము వేఁడు జనమంచి—వేంకట
రామయకవి యిద్ది వ్రాసి యనిపె॥

* ఈకరుణగీతము 1915 వ సంవత్సరమున రచింపఁబడి ఆసంవత్సరమే శ్రీమదాంధ్ర సాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రచురింపఁబడెను.



ఓం

# ప్రభంజన విజయము *

చంపకమాలిక

తెలివి ప్రవృద్ధి నొందునని దేవి సరస్వతి భక్తిఁ గొల్వఁగా
సెలవులు గొన్న వారలయి చేరిరి బాలురు మన్కిపట్లు; మె
చ్చులుగులుకంగ గచ్చులును సుద్దలు సున్నము లల్కుముగ్గులుం
బొలుపగు జేవురుల్ పసపుఁ బూఁతలుఁ గుంకపుబొట్లుఁ బచ్చనా ౧

కుల బలుతోరణంబులును గూర్చిన శోభనవైభవంబులం
బిలపిలమంచు బందుగుల పిన్నల పెద్దల సందడిన్ గృహం
బులు గడుఁ బొల్చెఁ; ద్రొక్కుడు ముగ్గులటంచును గంటఁ బంటనే
యలిగి యదల్చు నింటి ముదియవ్వ యదల్పులు చెల్లవయ్యె; ని ౨

ర్మలతరభక్తియుక్తి యజమాను లొగిం గలశప్రతిష్ఠ మున్
సలిపి విశేషపూజలను సల్పుచు నుండిరి; నూత్నవస్త్రముల్
వెలగలసొమ్ములుం దమకుఁ బెట్టుదురంచును బిన్నలున్ మఱిన్
వలఁతిగ గారెబూరెలును బప్పులుఁ బాసెము దోసెలప్పముల్ 3

---

* క్రోధివత్సరాశ్వయుజ సప్తమీస్థిరవారము నాఁడు వీచిన పెనుగాలివర్ణనము. 1904 సం॥ అక్టోబరు నెలలో వ్రాయఁబడి ఆ వెనుక సువర్ణలేఖ యనుమాసపత్రికలోఁ బ్రచురింపఁబడెను.

గలుగునటంచు బిడ్డలును గౌతుకముత్ ప్రకటించు చిట్టిచి
మ్మలు నిజచిత్తవృత్తులకుఁ బొందికగాఁ గలవార లెల్లరుం
జెలఁగుచునుండి రప్పుడు చిత్తసరోజవికాసవాసనల్
చలన మొకింతఁ జెందినను సారె ఘటిల్లిన చిత్తజల్లులన్; ౪

వెలువడినంతనే గగనవీధి మొయిల్తెరఁ జిమ్మిసూర్యుఁ, "డాఁ!
నిలుచునె చిత్తజల్లులివి? నేర్చునె యంకిలిసేయ నుత్సవం
బులకు" నటంచు నిట్లు దలపోసిరి కాని యెఱుంగరైరి య
వ్వల గగనంపునీలితెరప్రక్కఁ బ్రభంజనసంజయుంబునా ౫

వెలసిన భాణముం దనకు వేడ్కగ రెండవజాము రాతిరిన్
జెలువుకొనం దలంచి భువనత్రయనాటకసూత్రధారి పెన్
పిడుగులతాళముల్ పుడమి బిట్టుచలింపఁ జెలంగుచుండ, న
త్యలఘుమదేభకర్ణపుటదారణదారుణ ఘోరభీషణో ౬

చ్చలపటుగర్జితంబు, మురజస్వనితంబయి మ్రోయ, మిర్మిటుల్
గొలుపు తటిల్లతానిచయఘోరతరద్యుతిరూపదీపముల్
వెలుఁగఁగ, విస్తరించి వినిపించెదు ముందుగఁ బ్రస్తవంబటం;
చలవె యెఱుంగ నెవ్వరికినద్భుతముల్ భగవద్విలాసముల్ ౭

***

తొలికథఁ జెప్పునప్పటికె తొమ్మిదిగంటల రాత్రియయ్యె, మి
మ్మలనటఁ బెట్టఁ జెల్లదిఁక నవ్వలిసుద్దులు విన్నవించెదన్
గలజలమంతయున్ వెడలఁ గ్రక్కి ఘన న్నిజగౌరవంబులం
దలఁగి తొలంగెఁ జుల్కఁబడి దవ్వుగ మబ్బులు దూదిపింజెలుం ౮

బలె; గగనాంగణంబునను స్వైరవిహార మొనర్పఁ జొచ్చెఁ, గ
ర్వాలిబలుద్రిమ్మరిఁడు; పెనుమ్రాఁకు లొగిం దలలూఁచిమెచ్చెఁ దొ
ల్దొలుతఁ దదీయనాట్యరసలోలములై ; యడుగంటెఁ జిన్ని మొ
క్కలు భయకంపితంబులయి గ్రక్కున మ్రుక్కడిబంట్లపోలికన్; ౯

దలుపులు ద్వారబంధముల దండిఁ గొట్టుకొనం దొడంగె, బి
ట్టులుకుచు నొక్కచో నొదిఁగియుండిన లోనిజనంబుగుండెలున్
బలె; దివియల్ మలంగె; భవనంబులునున్ భువనంబులట్ల య
గ్గలపుఁదమంబునన్ మునిఁగె; గండరగోళముపుట్టె; నట్టె గ ౧౦

ల్గలమని పెంకుటిండ్లతడకల్ పెణకల్ చలియింపఁజొచ్చె; ఫె
ళ్ఫెలరవమెచ్చె నొక్కమొగి వేయిపిరంగులు ప్రేల్చినట్లుగా;
నల లయకాలరుద్రుఁడు భయాకృతిఁ దాల్చి సమస్తజీవులన్
బలువిడిఁ జంపునట్లుగఁ; బ్రభంజనుఁ డుద్ధతరౌద్రమూర్తియై ౧౧

నిలువక యొక్కచోఁ ద్రుటియు, నెవ్వడిమై, నెదిరించుచెట్ల యా
దలలను వంచివంచి, యిరుతట్టులకుం బడగుంజగుంజియున్
ఫెలఫెలఁ గొమ్మలన్ విఱిచి వేసియునుం బెడకట్లుగట్టియున్
సలిపెనుశిక్ష లీగతిని ; స్థావరజంగమభేద మంతగాఁ ౧౨

దెలియకపోయె, వెన్కఁ బఱతెంచి వడిం బెనుగాలితాఁపులన్
బలిమినొసంగి బాలురు చివాలునఁ దూలుచుగాలిబంతులుం
బలెనొకకొన్ని చెట్లునికిపట్లకు దవ్వగుచుండ ; నొండుచోఁ
దలలను నేలవైచుకొని దండసిఁగొట్టుకొనం చొడంగెఁ బైఁ ౧౩

బూలిపోలిఁ గ్రమ్మ దొమ్మగొని మూగెడుగొడ్డులువోలె; వెండియుం
దలఁచుకొనంగ దుఃఖమగు నారికడంబులపాటు ; కొన్నిటం
బలపలనయ్యె మట్టగమి ; బట్టతలల్వడెఁ గొన్నియున్ ; మొదల్
నులిమినకోడిపిల్లల కనుంగులుగాఁ గనుపట్టెఁ గొన్నియున్ ౧౪

నిలిచెను గొన్నివృక్షముల నెత్తిపయిం జిఱుమొవ్వమాత్రమే
ముడుపిడి వేంకటేశ్వరుని మ్రొక్కుట కుంచిన జుట్టుపిల్కయుం
బలె ; మఱికొన్నివృక్షములు భళ్ళుమనం దలకాయలెల్లఁ ద్రో
వల నరికట్టుచుం బడె, సపాటముగాఁ; దలబుఱ్ఱ గూడునే?

నలినలియై యనంటుఃఖ ప్రణష్టము లయ్యెనటంచుఁ జెప్పఁగా
వలయునె, నీటిబుగ్గలకు వచ్చునె చేవలు నేఁడు క్రొత్తగాఁ!
గలవిటు లెన్నియో కలముఁ గైకొని వ్రాయఁదొడంగ ; నన్నిటిం
దెలుపుదునేని దీనికిఁకఁ దెం పొకటుండునె? గాలివార్తలన్ ౧౬

తలఁపునఁజేసి మీర లిది నమ్మకపోయెద రేమొగాని య
య్యలజడివేళ మింట నొకయద్భుతమైన వెలుంగు దావమున్
బలె నతిదారుణంబయి కనంబడె; లోకులు దానిఁ జూచి ము
న్నలరఘురాముదేవివిధ మారయ వారిధి దాఁటి చెంగునన్ ౧౭

పొలయక లంకఁజొచ్చియు నశోకవనంబును రూపుమాపి య
వ్వలఁ బురివారలెల్లఁ దనప్రజ్ఞలు చూచి వెఱంగుపాటునం
గలవరపాటునొంద లయకాలశిఖిప్రతిమాన తేజుఁడై
మొలఁగుచు నిండ్లు వాకిళులు మేడలు మిద్దెలు గుళ్ళు గోపురం ౧౮

బులుఁ బురిఁగల్గు సర్వమును బొల్పుఱఁజేసి కృశానకీలలన్
నలుగడలం గడల్కొనన నర్చిన కోఁతిమొగంబు దేవరం
దలఁపఁగఁజొచ్చి; రాకొడుకుతండ్రియె కాఁడె ప్రభంజనుండనన్ ?
గలగలఁ బెంకుటిండ్ల పయికప్పులు దుప్పునఁ దూల్చునిమ్మహా ౧౯

బలునకుఁ మాకుటీరములపై నతికించిన యాకులెంత? వే
సలగుల గొప్పచెట్లఁ బడఁగొట్టిన జెట్టికిఁ దోరణంబులం
బలుచగ మేము పన్నుచు మామిడికొమ్మ లసంగనెంత? ని
చ్చలును నఖండతేజములఁ జక్కవెలింగెడి మింటిజ్యోతులన్ ౨౦

నులిపిన భూరిసత్త్వునకు మావెలిఁగించెడి దివ్వెలెంత? పొం
దలవడి ముజ్జగంబునకుఁ బ్రాణపదంబుగ నున్నవాఁడునుం
గలఁచుచు వింతయయ్యెడును, గాలగతిం బెనుభూతమై యిఁటుల్ !
స్థలగతజంతుసంతతి విషాదవచోగతి యీదృశం బిఁకం ౨౧

బలికెద నూహఁజేసి జలభాగమునుత్కృతవిప్రకారముల్

***

అలయనుమాట లేకెప్పుడు నద్దముపోలిక నిద్దమౌచు ని
శ్చలమును నిర్మలంబునయి జానలరొందముచంద మొప్పు న
య్యలఁతితటాకముల్ నయితె మయ్యెడఁ జాలఁగలంగె; నయ్యయో

కలువలు దామరల్ మొదలుగాఁగల పూలసిరుల్ హరింపఁగాఁ
గొలఁకులు వైరిభూపతుల క్రూరవిహారముబారిఁ బడ్డవై
పొలుపఱినట్టి యంతిపురముల్ బలెఁ గానఁగనయ్యె; వేడ్కకై
ఖలుఁ డెసకొల్ప రోషములు గ్రక్కొని డీకొని తాఁకు మేషముల్ ౨౩

బలె దరిఁ గట్టుకంబములఁ బగ్గముల న్నిలఁగట్టఁ బడ్డ నా
వలుఁ బయనంపుదోనెలు సపారసమీరసమీరితంబులై
తలపడఁజొచ్చె నొండొకటి దండడివెట్టుచు సందడించుచుం;
గొలఁదికిమీఱె వారినిధి క్షోభ; దలంపఁగ నెంతవారికిం ౨౪

దలమె స్వభావచంచలులఁ దార్కొని భంగమునొందకుండ? న
ట్లలమట కోపలేక మకరాకరగర్భసముత్థితంబులై
బలుగిరులున్ బయల్పడెనొ పాఁతులు లోఁతులు పెల్లగిల్లినా
వలితతరంగసంహతు లవారిగఁ బర్వఁగఁజొచ్చె నుర్వులన్ ౨౫

బలువిడిఁ గ్రక్కుచుం గొమరుఁబాయపుఁబందెపుగుఱ్ఱముల్ బలెన్
సలిలవిహారముల్ సలుపు జంగమపట్టనపాళినాఁగ, న
స్ఖలదురుధూమయంత్ర బలసంప దనర్గళయానవేగముల్
గలిగి ఘుమంఘుమధ్వని చెలంగ నభంగతరంగమాలికా . ౨౬

సలలితడోలికానిచయసంగతిఁ దెయ్యెకలాడె ధూమపుం
గలములు చూచువారలకుఁ గన్పడి యంత్రపుబొమ్మల ట్లిఁకన్
గళితఖలీన నూత్న తురగంబుల పోలికఁ గొన్నియున్, నిర
ర్గళము నిరంకుశంబు నగుగంధగజవ్రజమట్లు కొన్నియున్ ౨౭

వలనుగ్రహించి నెమ్మదిగ వాయునిరోధము సేయలేని మో
గులహృదయంబులట్లు మఱికొన్నియు నోడలు కూపదండముల్
నలియఁగఁ గర్ణబంధములు నుగ్గుగఁ జీరలు చిన్గిపాఱఁగాఁ
దలయొకదిక్కుగాఁ దెరువుదప్పి పరిభ్రమియింపఁజొచ్చె వి ౨౮

చ్చలవిడి; "దేవదేవ! భవసాగరముం దరియించుత్రోవ నీ
వలన నగాదె జీవులకుఁ? బ్రాణవిపద్దశ నున్న మమ్ము నీ
యలఘుకృపావిశేషమున నవ్వలియొడ్డునఁ జేర్పవయ్య! యో
కలుషవిదూర!" యంచు భయకంపితులై కలమర్లుగూయిడన్ ౨౯

జలదగభీరఘోషమున నైతము చీమ చిటుక్కనన్ వినం
గల జగదీశ్వరుండు విని క్రన్ననఁ దా నుపసంహరించెనో
బలితపుఁబావనాస్త్రమున వైళమ సత్వరవృత్తి మాని యె
వ్వలననొ వెచ్చనూర్చుచును బ్రాలెఁ బ్రభంజనుఁ డుస్సురన్నరై ౩౦

తలఁపఁగఁ జెల్లునే యితనిదారుణముల్గని క్రూరుఁ డంచెదన్?
బలుకఁగఁగూడునే యితనివర్తనముల్ గని ధూర్తుఁ డంచునన్?
బాలయఁడై వాసరాంతములఁ బూఁబొదరిండులనుండి మెల్లఁగా
వలపులు సంగ్రహించి నలువంకల నిమ్ముగఁ గుమ్మరించుచుం? ౩౧

గోలుపఁడై విందు వీనులకుఁ గ్రోల్చుపికాళి పిసాళికూఁతలన్
జలుకలముద్దుపల్కులను జెల్వల మవ్వపువీణపాటలన్?
దులుపఁడై మాంత్రికుండుబలె దూరపథిశ్రమఁ జెందుపాంథులై
నొలిసిన ఘర్మబిందువుల నప్హాని యూఁదుచు? నొక్కమాఱుఁ జ ౩౨

తులకును గానరాఁడనుటె చోద్య మగుంగద! ప్రాణబంధుఁడై
మెలయుచునుండియున్ మనల నెల్లయవస్థల, నెల్ల వేళలన్
వలపల దాపలం బయినిఁ బ్రక్కను గ్రిందను మీఁద నెల్లెడన్!
దెలియఁగలేక పీనిదగు నిక్కపుఁ దత్వము గాలియంచుఁ గ ౩౩

ర్వాలియను. చీఁదరంచు మఱిఁ బయ్యరయంచును దెమ్మెరించునం
బలుకుదు మింతెకాని మనమానసమట్టు లగమ్యగోచరం;
బలపము దీనికన్న నిఁక నెక్కుడువింత యొకండు గల్గునే?
తొలఁకుచుఁ బర్వుతెత్తుదుము దూరపుఁగొండలునున్నఁగాపునన్॥ ౨౮

---

# శాకుంతల నాటక ప్రశంస

"గీతే" యను జర్మన్ మహాకవి చేసినది.

—:0:—

మ॥ తొలిపూవుల్ కడపండు లేఁటివగునం దోడ్తోడ సేవింపఁగా
వలతేనిన్, వల తేని జీవితసుసర్వస్వంబుఁ బ్రాపించి భూ
తలమున్ స్వర్గము రెండుఁ గూడునెడ నాత్మానంద సామ్రాజ్యసం
కలనన్ నిల్వ, మనిన్ శకుంతలనె సంకల్పింపు లక్ష్యంబుగన్॥





ఓం

# నాదారితోడు *

—:o:—

ఆ॥ వె॥ వ్రాలుచుండెఁ బ్రొద్దు పశ్చిమంబునఁ బైకిఁ
దేలుచుండె వఱఁగ తీయువెనుక
నినుకతిన్నెలట్టు లెసఁగు రమ్యపిశంగ
వర్ణవర్ణనీయ వారిజములు॥ ౧

కాలిక్రింద మెత్తగానుండె గౌతమీ
సైకతంబు బాటసారి కపుడు
పైరుగాలి సుఖము పండఁబాఱిన జొన్న
చేలు మెచ్చుచుండె శిరము లూఁచి॥ ౨

భువియు దివియుఁ గలసి మోదించుచుండఁగ
నడచుచుంటి నపుడు నాకునేనె
తోడుగాఁగఁ గొలఁది దూరంబులోనున్న
గమ్యభూమిఁ జేర కాంక్షఁజేసి॥ ౩

* ఇందు వర్ణింపఁబడినది 1907 వ సంవత్సరమున కవికి స్వానుభవసిద్ధమైన విషయము. ఇది 21—10—21 సం॥ రమున వ్రాయఁబడినది.

ఇంతలోన వెనుక నెవ్వరో యొకయింతి
కాలిమడమ త్రిప్పక నేలఁ గూర
నడచి వచ్చుచుండె, నడునెత్తి మూటచే
మందగింప సహజమందగతియు॥ ౪

"ఏమిమూట యమ్మ! యెందుండి యెందుఁ
కేగుచున్నదాన విప్పుడు చెప్పుమ"
యనుచు నాదరమున నడుగఁగ నాకిట్లు
మాఱుపలికె నాదు దారితోడు॥ ౫

"పుట్టినింటనుండి పోదు నల్లదిగో మా
యూరి కయ్యగారు! మీరో" యనుడు
"నేనుగూడఁ బోదు నీవేగు నూరికే
యడుగువెట్టు మమ్మ! యడుగువెట్టు॥ ౬

అకట! నీకు మూట యంకిలయ్యెడు, నూరు
చీఁకటి పడకుండఁ జేరవలయు"
"మూట పైనమునకు నాటంక మగుఁగాని
పూఁట గడవదండి, మూటలేక॥ ౭

క్రొత్తకోక వెట్టెఁ గుంకంబువెట్టి మా
పెద్దయన్న వట్టివెట్టినాఁడు!
వలదటన్న వినక పచ్చజొన్నలు మూట
గట్టినాఁడు నెత్తిఁ బెట్టినాఁడు ౮

అయిన నేమి తెంచి యయ్యా! యిల్ చేరువౌ
కొలఁది మూటబరువు చులకనయ్యె
నడతు వేగ పడుగు లిడుచు మీాయడుగుల,
ముందు నడుఁడి దొరలు! ముందు నడుఁడి”|| ౯

అనుచు వెంటనడచు నానిష్కపటురాలి
పలుకు చిన్నబిడ్డ పలుకుకన్నఁ
గోములమును మఱియుఁ బ్రేమార్ద్రమును నౌచుఁ
బ్రియము సేసె నాదుహృదయమునకు|| ౧౦

పాటిరేవుపడన యేటిపాయను జేరఁ
గానె మమ్ముఁజూచి దోనెవాఁడు
“బాఁపనయ్యవారు పాయ దాఁటకమున్న
దాఁటరాదు మాలదాని” కనియె|| ౧౧

“చేరవలయు నిల్లు చీఁకటిపడకుండ
నాఁడుదాన నిన్ను వేఁడుదాన
ఓసరంగుబాబు! కాసంతకనికార
ముంచు మవల మున్నడించు నన్ను”|| ౧౨

దీనురాలిదైన దీనవాక్యము నాదు
హృదయమర్మ మంటె, యిట్టులంటి
దోనెవానిఁ జూచి “హాని యేరికిఁగాని
కలుగరాదు నేను కారణముగ|| ౧౩

గీ॥ పావనము తల్లిగాతమి జీవనంబు
త్రావుదుము నేను నీమెయు నీవు నదియె
కనులఁ జూచినమాత్రానఁ గలుష మడఁగు
మునుఁగఁగఁగల్గినఁ గల్గును ముక్తి మనకు॥ ౧౪

క॥ వెలివాడఁ బుట్టినంతనె
వెలిఁబెట్టునె యీశుఁ డతనిప్రేమను బ్రాణం
బులుగాని జంతులిలలో
పలఁగలవే? గాలిలేని బ్రదుకుంగలదే? ౧౫

క॥ ఒకయీశ్వరుకృప నందఁజ
మొకయోడనె యెక్కి దాఁటి యొక సంద్రమునే
యొకతీరమె చేరఁగవలె
నిఁక నీసంశయము లేల యిచ్చట మనకున్? ౧౬

గీ॥ కాన సందేహపడక యోడ నెవాఁడ!
యెక్కనిమ్మమె నాతోడ నెక్కనిమ్ము
ఎక్కనిచ్చిన నీకేమి యొగ్గులేదు
తఱచి చూచిన నాకేమి తగ్గులేదు॥" ౧౭

గీ॥ ధర్మజునిపోల్కి నేఁగాను ధార్మికుఁడను
అంటరానిది గా దంతి యతనివేఁపి
యట్టు; లటులయ్యె మే మెక్కినట్టిదోనె
ఖారలెక్కిన తొలిమెట్టె స్వర్గమునకు॥ ౧౮

---



౭౦

# అన్నయు—చెల్లెలును

క॥ ఒకగూఁటి చిలుకబోదలో
యొకతమ్మిని వ్రాలు తేఁట్లో యొకమోమునఁ గ్రాల్
వికచనయనద్వయంబో
యొకపాత్రిక వెలుఁగుదీపయుగ్మకమొ యింకన్॥ ౧

క॥ ఒకతోఁగరుపట్టుదారము
నకు గ్రుచ్చినముత్తియముల నాణెపుఁగవయో
యొకపూవుఁగొమ్మకొనపై
నొకసొగసుగఁ బొలుచుముకుళయుగళమొ మఱియున్॥ ౨

క॥ ఒకచంద్రుకళయుఁగాంతియొ
యొకప్రేమముముద్దుమురిపమో యరయంగా
నొకతత్వమునకుఁ జెందిన
యకలుషచైతన్యమును మహానందమునో॥ 3

క॥ అని యిట్టులు నామనమున
ననుకొందును బట్టరానియానందమునం
గనుఁగొందును గేహాంగణ
మునఁ దిరిగెడి శిశుయుగంబు ముచ్చటలెల్లన్॥ ౪

గీ॥ అన్నదమ్ములబిడ్డలే యయ్యు నొక్క-
తల్లికడుపునఁ బుట్టినపిల్ల లట్లు
లీడుజోడుగఁ గూడుచు నాడుచుందు
రన్నయును జెల్లెలనుపొత్తు లనువుపడఁగ॥ ౫

గీ॥ ఆడుకొందము రావె యమ్మాయి! యనుచుఁ
బాడుకొందము రారయబ్బాయి! యనుచు
నొండొరులఁ బిల్చుకొని మోము లుల్లసిల్లఁ
గదలుదురు సంబరమె తమ్ముఁ గడచిపాఱ॥ ౬

గీ॥ పెద్దయడుగిడు మూన్నెలల్ పెద్దగానఁ
జిన్నయడుగిడుఁ గాఁబోవు చాలునగాన
నడుగు లెడమయ్యెఁ జేతులు విడరు శిశువు
లెడములేని ప్రేముడిఁ ముడిపడుటకతన॥ ౭

గీ॥ తుదమొదలులేని ధోరణి వదరుచుంద్రు
తొక్కుపలుకుల భావంబు చిక్కుకొనఁగఁ
బత్రబీజపుటంబు వెల్వడుచునున్న
యిగురుమొగ్గల మొక్కయాకృతియుఁబోలె॥ ౮

గీ॥ బొమ్మరాలును బూలును బ్రోపుచేసి
రెండుచేతుల సమపుచి నిండఁబట్టి
జడలుగట్టినతలలు దుమ్మొడలుఁ గ్రాలఁ
గ్రాలుదురు బాలయోగులలీల మెఱసి॥ ౯

గీ॥ ఒక్కపూవుననుండి వేఱొక్కపూవు
మీఁదవ్రాలుచుఁ గ్రోలుచు స్వాదురసము
నాకుచిలుకలనడకల ననుసరించు
వీరిమనములు స్వైరసంచారు లౌర!॥ ౧౦

గీ॥ పూవుఁదోఁటయె యగును భూభువనమెల్లఁ
బవలు రేయును నొక పెద్దపవలె యగును
ఇహముఁ బరమును రెంటను నిండెకలవు
చీఁకుచింతయులేని యీశిశువులకును॥ ౧౧

గీ॥ రండి వత్సలు! దగ్గఱరండి! మీరు
వానకాలపునెలలట్లు వత్తురేని
మండువేసంగి నడుగంటి యుండుహాయి
వోలెనే నాదుడెంద ముప్పొంగఁగలదు॥ ౧౨

ఆ॥ వె॥ రండిబిడ్డలార! రండినాకడకుఁ బ్రే
మైక్యభావ మొదవునట్లు మీదు
చిన్నిమొదలు గదియఁజేర్చి నాయెదను నన్
గూడనిండు మిమ్ముఁగూడనిండు॥ ౧౩

గీ॥ ఎన్నఁడుంటినో? మీవలె నేనుగూడ!
నెపుడు క్రీడించితినోయిట్టు లిసుకలోన!
నకట! యాప్రొద్దు లాయాట లన్నికడచె
మిగులుదును సాక్షినయి నేనె మిగిలియుందు॥ ౧౪

---



ఓం

# ఆటగీతము

—;✻;—

వెండిపళ్ళెరమున వెలుఁగొందు మంగళ
దీపమునఁగ దివ్యహాస మెసఁగఁ
పాలుద్రావి వెల్లపాన్పుపైఁ బవళించి
యాడుకొనరయన్న! యాడుకొనర. ౧

గర్భవాసమందుఁ గట్టుళ్ళఁ బడియుంటి
విప్పుడు నీకుఁ దగిన స్వేచ్ఛ యొసఁగెఁ
గాలుసేతు లెలమిఁ గదలించి యాడించి
యాడుకొనరయన్న! యాడుకొనర! ౨

గ్రుద్దులాడుటకునో గుప్పిళ్ళు పదిలవు
సాము లెవరిమీఁద సలిపెదవుర?
సాముసేయ ముందు సమయంబు రానొప్పు
సంతసమున నన్న! యాడుకొనర! ౩

తిరిగితిరిగి తేఱితేఱి చూచెదు చిన్న
చిప్పలట్టికనుల తెప్పలెత్తి
పాదరసపుబుగ్గ—భాస్కరేందులుగాను
పాలవెల్లి యిది—నభంబుగాదు. ౪

పింఛాలంగు లమర విన్నాణ మేపార
కాగితంపుఁదొక్కగములు గూర్చి
కుట్టికట్టినట్టిగుడ్డచిల్కలుగాని
యందుఁ బాలు పక్షులయినఁ గావు. ౫

మాయవస్తు లివ్వి మాసిపోవు; నెపుడు
మాయకుండునదియె మదికిఁ గూర్చు;
ననెడిపగిది దృష్టి యట్టె పైకినిగుడ్తు
వార! చాపలమొ! సహజగుణంబొ? ౬

ఏదియైనఁగానియిదిమంచిసెడ్డల
నరయువేళ గాదు; పరమయోగి
యైనఁబొందలేని యానందవార్ధి నో
లాడుకొనరయన్న! యాడుకొనర! ౭

---

## మా య బొ మ్మ

—(1)—

॥ మాయమయ్యెనమ్మ! మాయమ్మ కొని తెచ్చి
యిచ్చినట్టి మేలి బుచ్చిబొమ్మ
మాయమయ్యె నేమిమాయయో యెఱుఁగ నే
నెందుఁబోదు? దాని నెచటఁగందు? ౧

ఎంతో ముద్దుబొమ్మ! యెంతో చక్కని బొమ్మ!
యెందు లేదు దాని యీడు బొమ్మ;
దాని ముక్కుతీరు దాని కన్నుల సౌరు
మఱచిపోదు నన్ను మఱపురాదు. ౨

తిందు నెప్పుడు దానిపొందున నన్నంబు
నేదికాని దాని కిడక తినను;
ఆటలాడుకొందు మదియు నే నిందందు
నమ్మ పిలుచుదాఁక నలయుదాఁక॥ ౩

జోలఁ బాడి మెల్ల జోకొట్టి దానిని
ప్రక్కఁ బెట్టుకొనుచుఁ బండుకొందు;
నేమి సేయుదాన ? నెట్టులోరుచుదాన?
దానిఁ బాసినేను తాళలేను॥ ౪

"ఎందుఁబోతె బొమ్మ? యేమైతివే బొమ్మ?
యనుచు దాని నిండు నంతు వెదకి,
వెనుకఁ గొన్నినాళ్ళకును గంటి మాయింటి
యూతల నొకపెంటగోతిలోన॥ ౫

ఏమొకాని నాకు నెంతో భయంబయ్యె
బొమ్మరూపు మాఱిపోయె నయ్యొ!
యెండవానలకును నెండుచుఁ దడియుచు
మాసిపోయె రంగు మాసిపోయె॥ ౬

కాలుసేతు లాడించఁ గను ముక్కు నోరంచు
స్పష్టపఱచు టెంతొ కష్టమయ్యె
మెడకుఁ దొడిగినట్టి మేల్పాలపూసల
పేరుదక్క బొమ్మపేరు లేదు॥ ౭

దానిమీఁదిచింతఁ దగిలి నే నొకొంత
సేపు కనులనీరు చిందుచుండ
నట్టె నిలిచియుంటి నప్పుడు మాయమ్మ
"యమ్మ రావె" యనుచు ననియె నిట్లు॥ ౮

ఏల యేడ్చెదమ్మ యిఁక నేటి నీబొమ్మ?
మన్ను మంటఁ గలసె మాయ బొమ్మ!
మసక కనుల యల్ల ముసలమ్మ మెంటుతోఁ
దుడిచివైచె గోతి యడుగునకును॥ ౯

---

# చ ం ద మా మ

—:• :—

క॥ వే॥ చందమామ రావె! జాబిల్లి రావె! నీ
చంద మేమొ చెప్పి చక్కఁ బోవె;
వెన్నముద్ద యనుచు నిన్ను మ్రింగను బట్టి
బెదరుదక్కి యిందుఁ గదలి రావె॥ ౧

ఇల్లు వాకిలియును నెఱుఁగక బైలను
బ్రాఁకులాడు టేమిబ్రాంతి నీకు?
మెచ్చుగులుకు పాలగచ్చులమామేడ
విడిదికిత్తు వేగ వెడలిరావె॥ ౨

నీలికప్పుగుడ్డ నిండఁగప్పిన యయ్యొ
యెత్తుకోళ్ళబల్ల యిత్తు నీకుఁ
బెద్దయెత్తువాఁడ వద్దియే తగు; ముద్దు
గులుక నీవు కుదిరి కూరుచుండ॥ ౩

అద్దమా యిది! గడియారమా యిది? యని
యబ్బపడును గాని యంతలోన
పోలఁజూచి నీదుముద్దుగుల్కుముఖమ్ము
నెమ్మి నడుగు నతఁడు నీసుఖమ్ము॥ ౪

అల్లరేమి? యనుచు నతఁ డించుకయు మమ్ముఁ
గసరుకొనఁడు లోన విసుఁగుకొనఁడు;
శిశువులనుచు ముద్దు సేయునేకాని సం
శయముదక్కి చందమామరావె! ౫

వెండిపళ్లెరమునఁ బెట్టి పండులు వెండి
గిన్నెనిండఁ బోసి జున్నుపాలు
తెచ్చి యిడెద నీవు తిని త్రాగి సొగియింపఁ
బ్రేమమీఱఁ జందమామరావె! ౬

నీవు రాకఁ జేసి మాదుసంతోషాబ్ధి
పొంగి పొరలి నింగి ముట్టుచుండ,
నేనుఁ జిన్నితమ్ము లీచిన్ని చెల్లెండ్రు
చుక్కలట్లు నీదుచుట్టుఁ జేరి॥ ౭

గల్లుగల్లుమనుచుఁ గాలిగజ్జెలు మ్రోయ
నాడెద నొకవింతయాటగాను;
చిన్నిగొంతు నెత్తి చిన్నిచుక్కలతేనిఁ
బాడెద నొకముద్దుపాటగాను॥ ౮

అరుఁగుడిగ్గి చూతు; నరుఁగెక్కిచూతును,
ఎక్కి మేడపయికి నిక్కిచూతుఁ;
జూచుకొలఁది నీదుసొబగు నింకను జూడ
మనసుపుట్టుఁ జందమామ రావె! ౯

నీదు చక్కఁదనము-నీదుచల్లఁదనమ్ము-
నీదు కళయుఁ-గాంతి-నిరుపమములు;
ఎందుఁ బుట్టినాఁడ? వెవఁడు సేసెను నిన్ను?
మాకుఁ దెలుపఁ జందమామ రావె! ౧౦

పాలకడలిలోనఁ బ్రభవించి తీవన్న
యమ్మమాట బూటకమ్ముగాదు;
మఱుఁగఁగ్రాగుపాల మఱపింపఁగాఁగల్గు
మిసిమియీనునీదు మేనివెల్గు॥ ౧౧

పుట్టుమచ్చవోలెఁ బొలుచునీమెయిమచ్చ
కొండ యనుచుఁ జెప్పుచుండు గురుఁడు
కొండమీఁదఁ గొండ లుండునో యీవింత
మాకుఁ జూపఁ జందమామ రావె! ౧౨

వాయసంబొసంగఁ బళ్లెరంబుననున్న
యట్లదొంతిమీఁద నమ్మ యిపుడు
పెట్టినట్టి చెఱకు బెల్లమట్టులు నీదు
మచ్చ తోఁచుఁ జందమామ! నాకు॥ ౧౩

చిన్నిపిల్లవానిచిన్నితలం పిద్ది,
చిన్నపుచ్చుకొకు చెలిమికాఁడ!
దూరమగుట నట్లు తోఁచె, నీకలరూపు
నిందువచ్చి చూపు చందమామ! ౧౪

నిన్ను ముద్దుచేసి నెత్తిమీఁదను బెట్టి
కొనెడు నీశ్వరుండె యనఁగవిందు
నంతగొప్పవాఁడ వాతావు విడిరావు
రావు చందమామ! రావునీవు! ౧౫





ఓం

# ఆత్మశక్తి*

—:o:—

క॥ స్పృశియింప నలవికానిది
వశమగునే యాత్మశక్తి పశుబలమునకున్
పశియింప దేమిటను నలు
దిశలను గాలివలెఁ బెక్కుతెఱఁగులఁ దిరుగున్॥ ౧

క॥ ఒకవేళఁ బాలయుఁ బైపయి
నొకవేళను బట్టి యూఁచు నుద్దండగతిన్
బెకలించి యొక్కవేళను
సకలము వికలంబు సేసి శాంతిం గనెడున్॥ ౨

క॥ కొనయూపిరివలె నుండియె
పెనుఁబామటు బుస్సుమనెడు భీకరభంగిన్
గననేరఁ డాత్మశక్తిని
మనుజుఁడు బాహ్యప్రపంచమగ్నుండగుచున్॥ 3

* ఈపద్యములు 15—10—21 ఆంధ్రపత్రికలోఁ బ్రచురింపఁబడెను.

క॥ కొడుకుంగని కొండెక్కెడుఁ
బొడవగుమేడెక్కి నింగి ముట్టెడు మతి యా
కొడుకును మేడయుఁ గూలఁగఁ
బొడవడఁగుచు వింధ్యనగమువోలెం గ్రుంగున్॥ ౪

క॥ దారము దను భూమికిఁ గడు
దూరము చననీక నిలుపఁ వ్రేటిలెడుఁ; బరా
ధారపరాధీనగతిన్
స్వైరవిహారంబు గాలిపడగకుఁ గలదే॥ ౫

క॥ తనశక్తి తానునమ్మిన
ఘనపథమున కెగసి యెగసి గరుడుఁడువోలెన్
సునిశితమగు తనదృష్టిని
ననిశము నాజగముజ్యోతియందు నిలిపెడున్॥ ౬

క॥ తనయాత్మశక్తి నూఁతగ
నొనరిచికొని పయికిఁ బ్రాఁకి యున్నతపదముం
గనఁజెల్లుఁగాక యొరు న
మ్మిన రెంటికిఁ జెడును జూడుమి యలత్రిశంకున్॥ ౭

క॥ తనశక్తి తానెఱుంగక
యునికియె మోహంబు నిద్రయును మరణమునౌఁ
దనశక్తిఁ దానెఱింగినఁ
గనువెలుఁగును, గనునుదెలివిఁగనుఁబ్రాణంబున్॥ ౮

క॥ మెఱుమై మెఱసెడు, నుఱిమెడు
నుఱుమై, హృద్గగనసీమ నుండి సుహాభీ
కరమై పడుఁ బిడుగై, జల
ధరమై జీవులకు నమృతధారలు గురియున్॥ ౯

క॥ మొత్తనిపడననుఁ గప్పడు
విత్తనముననుండి కదలి వెలువడు మొక్కై;
హత్తుకొనుసంజచీఁకటి
పొత్తున మెలమెల్లఁ దోఁచు ముద్దులచుక్కై॥ ౧౦

క॥ స్తంభనములేదు శక్తికి
జృంభణమేకాని లోకహితమునకై మున్
స్తంభమున నుండి వెడలి వి
జృంభింపదె యుగ్రనారసింహాకృతియై॥ ౧౧

క॥ అడఁచినను నడఁగియుండదు
విడివడి యీయాత్మశక్తి పెలుచ విజృంభిం
చెడుఁ గొండకడుపు వెలువడి
వడిఁ బుడమిని వారిధార పడుచందమునన్॥ ౧౨

శా॥ నీచేనున్నది నీదుముక్తి యెపుడున్ నిన్నెత్తు నీశక్తి; యా
లోచింపంగ నిమిత్తమాత్రములె యీలోకంబునం దన్యముల్
సూచించున్ దిశ దిక్ప్రదర్శినివలెం, జుక్కాని నీచేతిదే
నీచాతుర్యముఁ జూపి యోడ నడపన్ దీరంబు నిన్ జేర్చెడున్॥౧౩

క॥ చులుక మును జలధిఁ గ్రోలఁడె
చుళుకమున నగస్త్యమౌని? చూడంగ మహా
త్ములకుఁ గ్రియాసిద్ధి దగం
గలుగున్ సత్వముననె యుపకరణము లేలా? ౧౪

గీ॥ స్వైరసంచారిసంకల్పవనగజంబు
ధర్మసౌవర్ణశృంఖలఁ దగులువడినఁ
బ్రబలసత్వంబె యగుచు స్వారాజ్యపట్ట
భద్రసామజవిఖ్యాతి వఱలుచుండు॥ ౧౫

---

# ని త్య మ ల్లి*

—:o:—

## ౧

ఏమి నీదుభాగ్యమహిమ! యేమిరామణీయకం!
బేమి సౌమనస్యగరిమ! యేమి కామనీయకం! ౧

బహూహా! నినుఁ గనంగ నంతరంగమందు నద్భుతా
వహముగా మెఱుంగు మెఱసె వానమబ్బునంబలెన్॥ ౨

నీవె నీదుపూలతోడ నిత్యమల్లి! యొకట నా
భావమందుఁ జొచ్చితో వివర్తరూప మొందుచున్? ౩

---

* ఈపద్యములు 1925 భారతిలోఁ బ్రచురింపఁ బడెను.

బాలకుఁడను గాను నీదు భవ్యరూపవిభవసం
శీలనమున మోదమంది చెలఁగి యాడుటకు నయో! ౪

౨

మెఱపుమెఱసె మొగిడెఁ గనులు మిర్మిటుల్ ఘటిల్లిన
ట్లరసిచూడ బాహ్యదృష్టి వ్యర్థమగును గాదె యీ ౫

వార్థకమున సంజదివియపగిది లోనిచూపు తా
సార్థకతను గనెడు నార్యజనుల మ్రొక్కు లందుచున్॥ ౬

"పూలతావి గిట్టదేమొ ముక్కు మూసికొనియెడున్
బూలవెలుఁగు వేడిసేయఁబోలుఁ గనులు మోడ్చెడున్॥ ౭

బేలతనముగాక యిది వివేకమే" యటంచు నన్
గేలిసేసి బాలిశుండు కేరడంబు లాడనీ॥ ౮

యేల మధుపపాళిజోలి యేల నాకు నింకఁ ద్వ
న్మాల మాశ్రయించి తత్త్వబుద్ధిఁ దపము సలిపెదన్॥ ౯

3

ఏల నిన్నుఁ జూడఁగానె యింపు పుట్టవలయు నా
కేల యోలతామతల్లి! యేటి బాంధవం బిదా? ౧౦

ఏదొ యెన్నరాని లోని హేతువే యిదయ్యెడుం
గాదు నీదురూపమైత్రి క్షణిక మగుట నది; యిఁకన్ ౧౧

భావమైత్రి గావలయును, బట్టిచూడ నది యిలన్
కేవలమును సత్యమగుచు నిత్యమగుచు స్తుత్యమౌఁ; ౧౨

ప్రకృతికన్నఁ బ్రకృతిచేత వ్యక్తమైన భావమే
యకలుషప్రమోదదాయి యగును సూరిజనులకున్॥ ౧౩

కవికి నీవు మంచితలఁ పొకండు గలుగఁజేయు హే
తువునఁజేసి నిత్యమల్లి! తోఁచెదవు మనోజ్ఞవై; ౧౪

అతనికనులగుండఁ జూచునట్టిశక్తియే త్వదా
కృతినిగూడఁ జూడఁబడెడు నేకరసనిధానమై; ౧౫

చెలువునిరు కాల్వగుండఁ జేనుదడుపువనువునన్
వెలువడిన సోదరుల యభిన్నమైత్రిచెలువునన్॥ ౧౬

౪

భిన్నసుందరాకృతులను బిగ్గగుచ్చు ప్రేమమే
నిన్ను నన్ను నొకటిచేసి నిలుపు నొక్కచోటనే; ౧౭

ఒక్కసూర్యకిరణమందు నొదిఁగియుండు తేజమే
పెక్కురంగు లిడును సంజవేళ మేఘపటలికిన్॥ ౧౮

ఎచట నైక్య మచటఁ బ్రేమ మెచటఁ బ్రేమ మచ్చటం
బ్రచురమగును సుందరత్వ మచలితక్రమంబునన్॥ ౧౯

౫

రాగ మనక ద్వేష మనక ప్రకృతియును వికృతియునున్
యోగమునకె తోడుపడుచునుండు నెపుడు నియతిమై; ౨౦

నొకటి కొకటి యెదురుకొనుచు నుండు రెండుచేతుల
ట్లొకనియంతృధర్మమూర్తి కొకయు మేయశక్తికిన్; ౨౧

గారడీని చెండ్లచిత్రగతుల వీనిలోన దు
ర్వారలీల నాడుచుండుఁ బ్రాణిభాగ్యపరిణతుల్; ౨౨

అమృతజలధి మంథనగము నాసురాసురాళియ
ట్లమితశక్తిఁ బట్టిత్రిప్పు నఖిలభువనచక్రమున్॥ ౨౩

౬

క్రింద మీఁదఁ బడుచుఁ బ్రాణిబృంద మిందు మెల్లగా
పొదుచేసికొనుచు ముందు సాఁగుచుండుఁ గ్రమముగా; ౨౪

నీవుగూడ నిత్యమల్లి! నేఁటినీదు పెంపుకై
యీవిధమున నే ప్రయాస మెంత చెందియుందువో! ౨౫

ఎన్నితోట్లఁ బండినావొ! యెన్నిచోట్ల నిలిచితో!
యెన్నిమెట్ల నెక్కినావొ! యెన్నిపాట్లఁ బడితివో! ౨౬

ఎండవానచలుల నోర్చి యెట్టితపము ఫలిపితో!
దండితనము మెఱయ నేయుదగ్రనిష్ఠ నిలిచితో! ౨౭

ఇట్టిపెంపు నందఁగంటి వింకమీఁదఁ గడఁగి నీ
వెట్టిసొంపుఁ గాంచఁగలవొ యెవఁడు చెప్పఁగలిగెడున్? ౨౮

వెలుఁగుఁ గనుట కంటె లేదు వేఱుభాగ్య మీయిలన్
వెలుఁగు నీయఁగలుగుకంటె వేఱుజన్మఫలమునన్॥ ౨౯

అయిన నీవు తృప్తినొందనట్లె కానవచ్చెడున్
బయికె కన్నులెత్తి చూతు, పయికెచాతు చేతులన్ ౩౦

కాలుగదలకుండుఁ గాని కదలుఁ బొదలి కోరికల్
తాలిమిఁ భజింపుమీ కృతార్థవగుమ ప్రియసఖీ! ౩౧

౭

ఘుడ మికడుపువెడలి వెలయు పుణ్యశీల సీతకై
వడిని నిత్యమల్లి! నీవు భక్తిగరిమ మెఱసి యా 3౨
త్మేశుపాదపూజ సలుప నెత్తుదువు ప్రవాళసం
కాశ లలితకుసుమవిసరకమ్ర బాహుశాఖలన్ ॥ 33

నీదుపూజ వ్యర్థమగునె? నింగిముట్టుకున్న నీ
పాదతలము పారిజాతపాదపంబుపోలికన్? 3౪
బాదుకొనెదు నందనోపవనమునందు సన్మణీ
వేదికావరణము పాదపీఠమట్టు లొప్పఁగా; 3౫
స్థావరత్వమొందు దేవతావిశేషమూర్తివై
సేవగొనెదు దేవతాళిచే మహోన్నతస్థితిన్॥ 3౬

౮

వేల్పుటేటిజలము పసిఁడిబిందెలందుఁ దెచ్చుచుం
గల్పలతిక వనుచు నీదుకాళ్లు గడిగి యంతటన్ 3౭
విపులభక్తి నీకుమ్రొక్కి వేఁడి నీదుపూవులన్
ఎప్పుడువాడకుండువాని నెల్లఋతువులందునుం 3౮
గొల్లయగుచుఁ దావులెల్లఁ గ్రుమ్మరించువానినిన్,
మెల్లమెల్లఁ దునిమి నేర్పుమెఱయఁ దుఱిమి కొప్పులన్, 3౯
వింతచెలువ మమర, వేల్పులెలఁదు లెల్ల వీణియల్
సంతసమున మీటి, నీప్రసాదమహిమఁ బాడఁగన్ ౪౦
వినఁగలట్టి ప్రాభవము లభింపగలదునీకహో!
వినుమి యంతదనుక నాదుప్రేమపూర్ణగీతముల్॥ ౪౧



ఓం

# సంశయాత్ముఁడు*

—:o:—

నింగి నడుచక్కినుండి యున్నిద్రమైన
తారకమువోలెఁ దోఁచె సద్భావ మొకటి
నాదుహృదిలోనఁ; గాని మర్నాఁడె యద్ది
క్రొత్తవెలుఁగున నడఁగుచుఁ గునికె నకట॥ ౧

కొలని సెజ్జను మెల్ల మేల్కొన్న పద్మ
ముకుళమటు సుమనోభావ మొకటివిచ్చె
వెండియును; గాని యాసంజవేళనె యది
మొగిడి ముడిఁగెను దమ మొయ్యి నిగుడ నకట॥ ౨

చీఁకటియు వెల్గు, వెలుఁగును జీఁకటియును
నిట్టులున్నది నాబ్రదు కేమిచెప్ప;
నేటిలోపల నొక్కకా లేటిగట్టు
మీఁద నొకకాలుగా నిట్లు మిడుకుచుందు॥ 3

---

* ఇ: 1920 సంవత్సరమున భారతీపత్రికలోఁ బ్రకటితము.

హద్దు నదపును లేని గృహంబులోని
వస్తువున కెట్లొ యట్లె నాభావమునకుఁ
జావునుం బుట్టుకయు నోలి సంభవించు
నిలువ నొకచోట ముందు నే నిలిపినట్లు॥ ౮

నేలఁ బర్వెడుఁజాలను గాలికొలఁది,
నింగి కెగయంగఁ జాలను౯ ఱెక్కబలిమిఁ;
గోడిపోలికఁ గాలుని కూరదాక
లోనఁ బడుదునో చివరకు హీనగతిని॥ ౯

---

# నిర్వేదగీతము*

—:o:—

ఎవరితోఁ జెప్పికొందు నీహృదయభరము
నెవరు హరియింతు రీవొక్కఁడవును దక్క
హరుఁడవగుటను బ్రణతార్తిహరుఁడ వగుట
నీవ, శరణంబు, శివ! మహాదేవ! నాకు॥ ౧

తల్లి చాలదు, చాలఁదు తండ్రియేని,
యన్నదమ్ములు, ప్రియసఖు, లాలుబిడ్డ
లెవరుఁ జాలరు హరియింప నీభరంబుఁ;
దుడువ మసిగాదు, దులుపను దుమ్ముగాదు॥ ౨

* ఇది 1919 వ సంవత్సరమున వ్రాయఁబడినది.

గుండెపైనుండి యొకపెద్దనిండుబండి
పట్టి లాగించుకొని, పెద్దబండబాయి
బెండుఁబోలెను బూవులచెండుఁబోలె
నెట్టివైచిన జెట్టియు నెట్టనోడు॥ 3

కొలఁదిభూమిని ధరియించు కొండయెంత?
గాలిఁదేలుచుఁ దిరుగు భూగోళ మెంత?
యింత యంతని చెప్పంగ నెడములేక
పట్టి క్రుంగించు నాదుహృద్భరముచెంత? ౪

ఇచట నున్నది యీబాధ యిట్టిదనుచు
విప్పి చెప్పఁగ నేరక వెక్కి వెక్కి
యేడ్చుబిడ్డవిధంబున హృద్గతార్తి
నుస్సు రనుచుందు వేడినిట్టూర్పు లొలయ॥ ౫

నీవు సర్వజ్ఞుఁడవు గాన నీకెఱుంగ
రానియర్థంబు లీజగత్త్రయిని లేవు
ముక్కుమూలము లేని యీపొక్కునకును
మూలమది యేదొ యరసి నన్ బ్రోవుదేవ!॥ ౬

తుష్టి యడఁగెను మఱి యసంతుష్టి హెచ్చె
నాశ లడుగంటె జగము శూన్యముగఁ దోఁచుఁ;
గాని యదియేమొ శూన్యంబు గాక హృదయ
మధికతరభారపీడనం బనుభవించు॥ ౭

నిలువఁబడనీక క్రుంగుఁ గ్రిందికిని గాళ్ళు;
తాళుకొనలేక మ్రొగ్గి క్రిందను ధరిత్రి
ఘోరపాతాళబిల మనునోరు దెఱవ
నందుఁబడి పోవుచున్నాఁడ నయ్యొనేను!॥ ౮

పోవుచున్నాఁడ నెచటికో పోవుచుంటె
యెఱుఁగుదును గాని యొండెద్దియెఱుఁగ నకట!
యంధకారావృతంబైన యంధకార
మేది కననీదు నీదుసత్కృపను జూపు॥ ౯

## కాలతత్త్వము *

గీ॥ ఎన్నిపింగళల్ వోవ వికృ నెన్ని రావు
పోయెఁ బోయె నటందురు పోవుటెందు?
శరధివీచులతీరున మరల మరల
వచ్చుచును బోవుచుండు నభంగలీల॥ ౧

తుదిమొదలులేని పరిధికి దూర మనుచుఁ
జేరువనుచుఁ గలదె నాభిసీమనుండి?
చనినపింగళ యెంతో యీ చనఁగలట్టి
కాళయుక్తియు నంతెసూ జ్ఞాని కరయు॥ ౨

* 1918 వ సంవత్సరమున వ్రాయఁబడినది.

నిన్న నేఁడు ఱే పనమూఁడు తెన్నులు ముడి
వడిన నడుచక్కి నాత్మనిష్ఠుఁడు సెలంగఁ,
గరతలామలకంబులు గావె వాని
కాగతం బ ట్లతీతం బనాగతంబు? ౩

స్వగుణకర్మల బద్ధమౌ సాలెపుర్వు
నకును దలచుట్టు కన్న లుండంగ, నిఁక న
స క్తుఁ డగుచు, నాశాబంధము క్తుఁ డగుచు
నొప్పు జ్ఞానిఁగూరిచి వేఱె చెప్పనేల? ౪

గీ॥ కాల మెంచఁ గ్రియాశ క్తి గాదు, కార్య
జాతముల ముందువెనుకల సరవిఁ దెలుపఁ
జాలు సోపాధికజ్ఞానసాధనంబు;
గాని, యది సేయఁజాలదు కార్యములను॥ ౫

గీ॥ విశ్వమెల్లను నిండు పెన్వెలుఁగులోని
యణువులకు సూర్యచంద్రాగ్ను లనుసమాఖ్య
లట్లు లాత్మయఖండనిత్యత్వమునకె
కాలసంజ్ఞ ఘటిల్లెను ఖండ మగుడు॥ ౬

గీ॥ తిరుగు సూర్యునిఁ జుట్టి యీధరణి యెపుడుఁ
గాని వ్యత్య స్తమై యట్టి కానిపించు;
వచ్చుటయుఁ బోవుటయు రేఁబవళ్ళకయ్యుఁ
జూతు మవ్వాని నవిలేని సూర్యునందు॥ ౭

గీ॥ కాలతత్వరహస్య మీ్రాక్రమము గాఁగఁ
గలదె క్షయమింక సంతమా కాలమునకు!
పోయె నబ్దాంతమై పోయెఁ బోయె నంద్రు
పోవుటెక్కడ మతులు వోవుటయె కాని॥ ౮

# ప్రేమతత్వము *

మ॥ సెలయేఱుల్ నదితోడఁ గూడు, జలరాశిన్ సంగమించున్ నదుల్
కలిసి! నిచ్చలు నేడుగాడుపులు సాంగత్యంబు నొండొంటితోఁ
గలుగన్ స్వైరగతిం జరించును మహాకాశంబునం దెంతో ని
శ్చలమా నీశ్వరశాసనంబునఁ బ్రపంచంబందు నేవస్తువున్॥ ౧

వెలియై యొంటిగ నుండదన్నియు నిటుల్ వేర్వేఱ యొండొంటితోఁ
గలయన్ నాకును నీదుపొందు మదిలోఁ గాంక్షింపఁగాఁ గూడదే?
వెలఁదీ! భూమిధరంబు లంబరము చుంబించున్ విలోకించితే?
యలలుం గంకణముల్ సెలంగఁ బరమానోన్యంబునైనోలలా ౨

డు; లతాంతంబులు మంజుమంజరులతోడు న్వాడవామోదమున్
లలిఁ గూర్పన్ సరసాళి కంచితగతిన్ లక్షించి; సూర్యుం డిలా
లలనం గాఁగిటఁ జేర్ప వేయికరముల్ సాఁచుంగదే; చంద్రుఁడున్
గిలిగింతల్ స్వకరంబులం గొలిపి పొంగించున్ సముద్రంబు; వా ౩

* ఇది షెల్లీమహాకవి యొక్క "Love's Philosophy" అను చిన్న కబ్బమునకు 1891 సంవత్సరమునఁ జేయఁబడిన భాషానువాదము.

రలకౌఁగిళ్లును, ముద్దుముచ్చటలు, నేలానాకు? నీ వాక్కమా
జలసాలోలవిలాస పేశలశుభాపాంగావలోకమ్ము లి
మ్ములనాపైఁ బ్రసరింపఁజేసి కృప నన్ ముద్దాడకున్నం జెలీ! ౮

---

# కనకమృగము *

శా॥ చెప్పన్ శక్యముగాకయుండెడు గృహచ్ఛిద్రంబు లిన్నించు, నీ
చొప్పించున్ వచియింపరా దికఁ బ్రజాక్షోభంబు దేశంబునం;
దెప్పాటన్ వెడలంగ నేర్చుఁ గవితాహేమాంగి యీయూఁదరన్
నిప్పింగుండమునందు సీతవలెనే నిల్చుం గడున్ శోచ్యయై॥ ౧

గీ॥ ఏమిటికి నాశ్రయించితి వీదరిద్రు?
నేమిభాగ్యంబుఁ గుడువంగ నెంచితీవు?
పెట్టుపోఁతలు లేని నాప్రేమచేత
నేమగును నీకు నోకవితామతల్లి? ౨

గీ॥ మహితరత్నప్రభాభాసమానమైన
యొత్తుగద్దియ వైభవం బెసఁగ నిలిపి
యఖిలమును సల్పి నీదుపాదార్పణముగ
నవ్యయానందసామ్రాజ్యదివ్యపదవి 3

---

* ఇది 1922 డవ సంవత్సరమున వ్రాయఁబడి ఆంధ్రపత్రికలోఁ బ్రకటింపఁబడెను.

కమృతధారాభిషేకపూర్వముగ నీకుఁ
బట్టమునుగట్టి భావప్రపంచ మెల్లఁ
బట్టి నీచేత నేలింపవలదె దేవి!
కవియశంబును బ్రార్థించుకవివరుండు? ౪

గీ॥ నింగినొరసెడి కైలాసశృంగపీఠి
బంధురంబైన వృషభరాట్స్కంధమునను
నధివసించెడి శైలకన్యాసహాయుఁ
డైనసర్వేశు మహితోత్తమాంగమునను ౫

వాయువశతను జెదరి తదీయభూష
ణాహిభోగంబుపయి రాలి యల్ల డిగ్గ
జాఱుచదలేటితుంపురుల్ సన్నముత్తి
యంపుజల్లులసొంపును నావహింపఁ, ౬

గొమరుమిగిలెడి వెలిపట్టుగొడుగునీడఁ
బోలె వసియించి ముల్లోక మేలునమృత
ధామకళను దలంపింపఁ దగకయున్న
నేమిటికిఁ గొల్చి నిన్నోకళామతల్లి!
కవియశంబును గాంక్షించుకవివరుండు? ౭

క॥ వెడకోరిక గాదిది నీ
పొడమించిన దగుట సత్యముగనె పరిణమిం
చెడుఁగాని దేవి! శక్తియు
తుఁడునున్ సర్వజ్ఞుఁడునగు దొడ్డకవికినిన్॥ ౮

శా॥ ఆకర్ణాంతము నిండలాగి పృథులజ్యాఘోష మేపారఁగా
నాకాశంబును జించి చీల్చుకొని లక్ష్యం బుచ్చిపో నేసినం
దాఁకంజాలక కించిదూనమయి మద్బాణంబు నేలంబడున్
నాకెట్లబ్బునో పూర్ణలక్ష్యశరసంధానక్రియానైపుణుల్? ౯

క॥ చేరువవైయు హృదయమునకుఁ,
జేరఁజనం గనకమృగముచెలువునఁ బైపైఁ
బారాడిదయి యలయించెదుఁ
నారా! యిదెట్లందుఁ గవిత, కదనీతకటుల్? ౧౦

---

# అ నా మ య ము *

——:o:——

శ్రీ రమ్యధామ! ధామ వి
దారితకలుషాంధకార! దారుణతరసం
సారాంబుధి తరణి! నమ
స్కారము లొనరింతు నీకుఁ గైకొను తరణీ. ౧

నినుఁగని మ్రొక్కిన దినమె సు
దిన మితరము దుర్దినంబు దివికిన్ భువికిన్;
గననేరఁడు మనుజుఁడు నినుఁ
గననేరక భుక్తిముక్తి కమలాప్త! హరీ! ౨

---

* ఇది 1924 సం॥ జనవరి సెలవు దినములలో వ్రాయఁబడినది. అసంపూర్ణము.

గాయత్రికి నధిదేవత
వై యొప్పెదు; గలదె యింక మహాత్త్వం బనఁగా
నో యజహరిహరరూపా!
జ్యాయస్తేజః కలాప! జగదుద్దీపా. ౩

ప్రత్యక్షదైవతంబవు
ప్రత్యహముం గలుషముడఁచి భద్రమిడెడి యా
దిత్యుండవు నిత్యుండవు
స్తుత్యుండవు విబుధతతికి శుభకర తేజా! ౪

వేదంబులు వలుకు నసా
వాదిత్యో బ్రహ్మ యనుచు నదిగాదనఁ డే
మేదకుఁడుం; బ్రాజ్ఞుండీకఁ
గాదనినం గన్నులున్న కాణుఁడె తరణీ. ౫

మాయాసముపాశ్రితుఁడగు
నాయీశ్వరు పోలిక నఖిలాధారుఁడవై
ఛాయాసమేతుఁడ వగుచు
నీ యఖిలము వెల్గఁజేయు దీవోతరణీ. ౬

త్రైలోక్యదీపకుఁడవు, దు
రాలోకము నీ మహత్త్వ రాలోక; మింకం
జాలెదునె యవిటికన్నుల
బాలిశుఁడు కనంగ? లోకబాంధవ! తరణీ! ౭

ధీమహితులయనవృత్త
స్థేమాంతరధాము నిన్నుఁ దిలకింత్రు నిజ
భ్రూమధ్యస్థానగతం
బై మహిమవెలుంగు ధామ మట్టులు తరణీ. ౮

త్రిగుణాత్మధారుఁడవును, త్రి
జగదగదంకారుఁడవును జగదాత్ముఁడవున్
నిగమముల బరణి! యేఁ బలు
కఁగనేర్తునె నిను మయూరుకరణిం దరణీ. ౯

తృణగతమగు హిమకణముటు
లణుమాత్రపు నాదుమతి త్వదమలకృపావీ
క్షణకిరణలేశ మంటిన
మణికాంతుల నీను నోద్యుమణి! యోతరణీ. ౧౦

చమురును వత్తియు లేవిఁకఁ
బ్రమిదయు శూన్యంబె గాలిబైటను మణిదీ
పమువలె వెలుఁగుదు; నీదు మ
హిమ మెట్టిదో కనుక వాఱ వెపుడుం దరణీ. ౧౧

చీఁకట్లపిండులనుతా
టాకిండులు కాలవశత నంటుకొన వెసం
బైకొను పోగమంటయునగుఁ
బ్రాకటభవదుదయ సాంధ్యరాగరుచి రవీ. ౧౨

మ॥ పగలున్ రేయియుఁ గన్నమోడ్పెఱుఁగకో పద్మాప్త! కాపాడె దీ
జగముల్, నీ కెవరిఁక సాటి? యనిమేషత్వంబుఁ బ్రాపించియుం
డగు నాదిత్యపదంబు నొందియును మందప్రజ్ఞుఁడై కౌశికా
ఖ్య గడింపం గల నిల్వఁ గ్రుడ్డిడి సహస్రాక్షుండు వీక్షించెడున్. ౧౩

ఒడయఁడవయి యయనద్వయి
నడుమను క్రమగతిని నొయ్య నానాఋతువుల్
నడపింతువు సేనలబలె
నడతెంతువు తేరిమీఁద నలినాప్త! రవీ! ౧౪

ఉన్నతుఁడ వయ్యుఁ గరముల
నన్నిటిపయిఁ జాఁచి యంటె దంటువడ వహో!
యిన్నడత చెల్లుఁగాదే
యన్నిటి నొకకంటఁ గనుమహాత్మునకు రవీ! ౧౫

వేడిమి చూపక మెఱయదు
పోఁడిమియని నిప్పుగురిసి భూజనుల నొగిం
బీడింతు వంతఁ గృప నో
లాడింతువు, కురిసి వృష్టి, హర్షాబ్ధి రవీ! ౧౬

ఇగిరింతువు పంకములను
జిగిరింతువు నెండుమ్రోళ్ళఁ జిత్రమొ కెతఱిన్;
దగు సత్పథప్రవర్తికి,
నగును జగత్ప్రభువునకును నర్హ మిది రవీ! ౧౭

పంకమునకు శత్రుండవు
పంకజ మిత్రుండ వేటి పక్షంబనుచున్
శంకింతునె? యియ్యది యక
లంకమనస్కుల యుదారలక్షణము రవీ! ౧౮

లేచినది మొదలు పుడమిని
మాచేసెడిదెల్లఁ జాటు మఱుఁగును ననకే
చూచెదవు నీదుకంటి క
గోచర మొక టున్నె హృదయగోచర! తరణీ. ౧౯

ఏకరణి డాఁగఁజూచినఁ
ప్రాకటముగ వీఁపుగానరా డాఁగుటయే
కాకున్నె? యుష్ట్రపక్షుల
పోకలు నిను నరులు సురిఁగి పోకలు తరణీ. ౨౦

తలఁదెచ్చి పెట్టుకొంటి, వ
దలవిఁకఁ బెనుగ్రహమువలె, వదలఁ దలఁచిన, నా
తలకెక్కె నీదు వేడిమి,
తలఁపగ దమి మొగుడవు కనుదమ్ములు తరణీ. ౨౧

***

శ్రీరామ కృష్ణదేవుని
పేరిడుకొని పెంచు కూర్మిబిడ్డ తనువుపైఁ
గారానిమచ్చ సత్ప్రభు
కీరితికిం బోలె నొదవెఁ గృపఁగను తరణీ. ౨౨

కమలహితుండవు; శిశుముఖ
కమలహితుండవును నగుట క్రమనీతియెగా!
విమలముగఁ దుడుపుమీ నీ
యమలకరస్పర్శ శిశువునంగముల రవీ! ౧౩

మందియ్యవు మ్రాఁకియ్యవు
వందనములె కొందు భక్తవత్సల! సుఖముం
బొందింతువు కరములనె యీఁ
కం దనువు స్పృశించి మంత్రకాఁడవు తరణీ. ౧౪

బాలార్కతేజుఁడగు నీ
బాలు ముఖకమలము మచ్చుఁ బ్రామెద వేనిన్
'నాళీకబంధు రయ' మని
వ్రేలం జూపింతు నిన్ను వినుతింతు రవీ! ౧౫

మిత్రుండవు, జగదేకప
విత్రుండవు, నఘులతాలవిత్రుఁడవు, జగ
న్నేత్రుండవు, నీకృపకుం
బాత్రుండవునట్లు పుత్రుఁ బాలింపు, రవీ! ౧౬

దినముఖమున స్నాతుండయి
నునుఁబట్టుంగోచి బూది నొసలు నెసఁగ వా
మనుఁ డితఁడు వేఁడికొనియెడుఁ
బనివడి నిను బలిని విష్ణుపదగతుని రవీ! ౧౭

నోరెఱుఁగని బిడ్డఁడు కై
వారం బెటుసేయనోపు ఘాలతలమునం
జేరిచి చేదోయి నమ
స్కారముఁ గావించు నీకుఁ గైకొను తరణీ. ౨౭

అడుగుదుఁ గృప నా నోటనె
యడుగుటకును నోరులేని యర్భకుకేల్, నీ
యెడకేన పట్టి చాఁచుచు
నడుగుదు బిచ్చంపుఁ బడఁతి యడుగు క్రియ రవీ! ౨౮

***

నీకును మచ్చలు గలవని
ప్రాకృత జనులాడుమాట పాటింపఁ జుమీ
కైకొందు వాని నిఁకఁ ద్వ
త్స్వీకృత లీలాకృతికిని జిహ్నముగ రవీ. ౩౦

తిరుగంటి గంటు లట్టులు
నెరసెడునో మచ్చలింక నీదు మొగమునన్;
బరికింపరు నీ వెలుఁగునఁ
బరికింతురు తమము గ్రమ్మ పైకొనఁ దరణీ. ౩౧

మచ్చలఁట నీకుఁ గవినై
మెచ్చుటనుం గాన వాని; నిఁక నీ వెలుఁగే
ముచ్చటమైఁ గనుఁగొని మెద
నచ్చపుగుణమును రసజుఁ డట్లేఁ దరణీ. ౩౨

సందేహమె నీమచ్చలు
మందేహుల కల్పితములు మఱియొకపైనన్
డిందుపడకున్నె యొకచే
చందంబగు నీదు శక్తి సంపద తరణీ. ౩౩

అన్నింటిం గననేర్చుం
దన్నుం గననేర్చ నట్టినయనమున నహో
యున్నవఁట నలుసు లద్దపుఁ
గన్నిడి కనుఁనరుని కంటఁ గలుగవఁట రవీ. ౩౪

నిను మున్ను సానయిడఁ జెద
రినపొడు మీఁతారకలు మఱిం గ్రహములు నం
చనె నొక కవి; తాఁదలఁచెనో
మును పెంతయు బలిసియుండఁ బోలుదని రవీ! ౩౫

తొలుతటికంటెను నెంతో
చలువను గైకొంటి వంద్రు శాస్త్రజ్ఞులహో!
మొలపున జ్వరముం బోలెను
గొలచిరొ నీమేనివేడి, గొట్టముల రవీ. ౩౬

ఎటులన్న నేమి? నీదా
పటుతేజం బొకటె యిట్లు పంచుకొనఁబడెం;
ద్రుటితంబుగాదు, హార మొ
కటె యగుఁజుమి నీవు నాయకమణిగ ద్యుమణీ. ౩౭

పొడవగు స్ఫటికపుం గఱల
వడువునం దగు నీదు విమలభానుతతియుం జెం
దెడుం జిత్రవర్ణవికృతిన్
జడసంగతి వికృతికారణముగద తరణీ. ౩౮

నీవికృతి నిన్ను నంటదు
భావితమగు నద్దమందుం బ్రతిబింబమటుల్
కావించి నీకు శోభనె
ఘూవిరి యట్లదియు వెనుక నడంగెడుం దరణీ. ౩౯

ఆవిధమునం గాదుసుమీ
యేవము పుట్టించి శిశువు నేడ్పించెదు నిం
కీ వికృతి; తొలంచి దీనిం
బ్రోవంగదే పీనిం దండ్రి పుత్రుబలె రవీ. ౪౦

---

# శు క వి లా ప ము

## I

గగనమునం బాఱు మానసౌకంబులార!
కొలంకులను జేరి క్రీడించు కొంచలార!
పొంచి మామిళ్ళలో దొంగ బూచులట్లు
కేరి సారెకుం గూయు కోకిలములార! ౧

ప్రకృతి యనురాణి యాస్థాన సుకవులార!
విశ్వమోహనగానంబు వెలయంజేయ
శ్రుతుల సమకూర్చు కలకంఠసుకృతులార!
ధన్యులరు మీర లత్యంత ధన్యతములు! ౨

సంతసము పుట్టు మిమ్మెల్ల సంస్మరింప,
నింగి ముట్టునె మిమ్ముఁ జేరంగఁ గనినఁ?
బుట్టితిని నేను మీరెల్లఁ బుట్టినట్లె
పెరిఁగితిని నేను మీ రెల్లఁ బెరిఁగినట్లె. 3

వర్ణమున కేమి? యొకకుటుంబంబునందె
పుట్టినారము గూఁడులు కట్టినార
మక్కడక్కడ నానుకూల్యంబు లరసి;
కాన దూరపుఁ జుట్టానఁ గాను నేను. ४

సోదరప్రేమ నా మీఁదఁ జూపరయ్య!
సోదరుని నన్ను ధన్యుఁగాఁ జూడరయ్య!
మధురగానప్రసక్తి మీ మనసుఁ జెనక,
నసమయంబంచు నా మీఁదఁ గసరుకొనక ౫

తప్పు సైరించి నాయందు దయఁదలంచి
శుకవిలాపంబు వినరయ్య సుగుణులార!

***

తల్లి కడుపునఁ బుట్టిన యెల్లజంతు
వులకు సహజంబుగాఁ బొందఁ గలుగునట్టి ౬

స్వేచ్ఛయు స్వాతంత్ర్యతయును నే నెఱుఁగ నకట!
యెట్టి పాపవిజాతినో యెఱుఁగ నకట!
సరసఫలములలో నెల్ల సారభూత
మరసి తొలుదొల్తఁ గొటికి యాప్యాయనముగ ౭

ననుభవించి లోకులకుఁ దదంశ మొసఁగు
నట్టి శ్రీశుకసంతతిఁ బుట్టి యిట్టి
పాటునకుఁ బాలుపడితి నా పాపమేమొ
యెఱుఁగ నక్కటా! యదియేమొ యెఱుఁగ నకట! ౮

***

అహాహా! యీరమ్య నవవసంతాగమమున
నెందుఁ బ్రమోదములుఁ జగిరించె నేమి చెప్ప!
బండతాలును బచ్చికబైళులయ్యె,
గడ్డకట్టిన యేళ్ళెల్లఁ గరఁగి పాఱెఁ, ౯

జీఁకునకుఁగూడ నొకవింతచేవ యొదవె,
మూఁకునకుఁగూడ నోటిలో వాకుపుట్టెఁ,
బుట్టుగ్రుడ్డులు కనువిచ్చి యట్టె చూచె;
నేమి చెప్పుదు నింక? నీ యెల్ల ప్రకృతి ౧౦

యోగనిద్రను జాలించు భోగిశయనుఁ
డైన నారాయణునితోడ నల్లనల్ల
మేలుకాంచెడి శ్రీలక్ష్మిలీల, సిరుల
నగుమొగంబునఁ జూపెడు జగతి కిపుడు. ౧౧

మాపుటమొకాదు మీరెల్ల సుందరముగఁ
బాడుచుండంగఁ దలయెత్తి యాడుచుండుఁ,
గాలదుశ్శాసనుఁడు సేరి మైలకుప్ప
సంబు నొలువంగఁ గురురాజు సభను నాఁటి ౧౨

ద్రౌపది కగణ్య నూత్నవస్త్రమ్ములట్లు,
కడఁగి చేయని క్రొత్తసింగార మమర
జిగి తొలంకు మేని క్రొన్నిగనిగ లెసంగ
నాడుచున్నది నాగకన్యకయుఁ బోలె. ౧౩

****

ప్రకృతివెంబడి వికృతిసౌభాగ్య మిద్ది
ప్రకృతిఁజేరని వికృతి దౌర్భాగ్యమింకఁ
జూడఁదగు నన్నుఁ జూచి యో ప్రోడలార!
ప్రకృతి యిట్టులు నూత్నజీవనము నొంది ౧౪

నూత్నతేజంబుఁ దాల్చి వినోదలీల
నాడుచుండంగ, నా యభాగ్యంబు నాదు
పంజరము మీఁదఁ గట్టంగఁ బడిన యాకు
గొడుగువడువున నడ్డమై చెడును బాల ౧౫

సూర్యునుదయ సంధ్యారాగశోభ నయయొ!
పోయగపుఁ గన్నుఁగవయొప్ప శుకమనయ్యు
గొందినడఁగిన పెనుగ్రుడ్ల గూబనైతి!
నీడపాటిన మొక్కట్లు నిదురఁ గూరి
తెలివియును దేటయును లేక నిలిచియుంటి. ౧౬

శా॥ చూడం జుట్టము మొక్కదైవమన కిచ్చో నొంటిమై నుంటి, నే
నాఁడైనం జెఱవీడునే! కలుగునే నా జాతితోఁ గూడి యా
క్రీడారామవిహారసౌఖ్యములఁ జేర్మిం బొందుటల్? నేఁటికిన్
లేఁడేయొక్కమహాత్ముఁడెందును మొరాలింపంగ రాఁడేయిట న్. ౧౭

## II

క॥ ఇమిడికకు నిమిడికయు విపు
లమునకు విపులంబునయి తలంప మహావా
క్యమువోలె నెసఁగు మాచరి
తము వినఁడీ వినుతు శ్రమము తలకొనకుండన్. ౧౮

మ॥ జనకం బందితి గౌతమీతటిని నా సర్వేశు దివ్యాలయం
బునకుం జేరువ నొక్కరావితొరటం బుణ్యద్విజద్వంద్వలో
చన సాఫల్యము సేయుచుం బెరిఁగితిన్ జన్మాంతరోపాత్తనూ
తనసంస్కార విశేషరమ్యతను వుద్భాసిల్లుచుండం గడున్. ౧౯

క॥ దూరస్థబాల్య చరితముఁ
జేరువకును దెచ్చి నాదుస్మృతి చూచెడు ని
ష్ఠారసి కనుచీఁకటిలోఁ
దూరుపువెలుఁ గపుడు నా నిదురకన్నులటుల్. ౨౦

ఉ॥ చల్లదనమ్ము లల్లవెదఁజల్లుచు వీచు ప్రభాతవాయువుల్
మెల్ల నొడళ్ళసోఁకఁగను మేల్కని కన్నులు చల్లఁగాఁగ, నా
తల్లి నఖండగౌతమిని దంద్రిమహేశు గృహోపరిన్ విరా
జిల్లు పసిండికుండఁగని చెందుదు లోవెలి నేశుచిత్వమున్. ౨౧

క॥ అగ్గలపుఁ దమపుఁదెర, స
మ్యగ్గతిఁ గాలార్చకుఁడు నిరస్తము సేయం
బ్రాగ్గర్భాలయసీమను
దృగ్గోచరుఁ డగుచు వెలుఁగుఁ దేజోనిధియున్॥ ౨౨

క॥ వందనము నిగమమూర్తికి
వందన మరవిందమిత్రపాదసహస్రా
మందరుచిపూరకల్పిత
మందాకిన్యాక్రమిత సమస్తాశునకున్. ౨౩

క॥ ఈయనువున మాయయ్యయు
మాయమ్మయు తెక్కలెత్తి మాటికిమ్రొక్కన్
నాయెఱక మొలకయుగురు, ల
హా! యెత్తఁగఁ జూతుఁదగుదు నయ్యయటంచున్. ౨౪

క॥ ఏగూఁటిచిలుక పలికెడు
నాగూఁటిపలుకెయనుట యథార్థముగాఁగన్
నాగురు లేగతి నడచి, ర
దేగతి నేనడతునకట'! యెగురుట వెలిగా. ౨౫

గీ॥ విశ్వమూర్తికి నటుమ్రొక్కి విడకజతను
దుశ్శకునభీతి నిటునటు తొంగిచూచి
పోవుదురు తల్లిదండ్రులు భుక్తికొఱకు
ముక్తికయి శ్రద్ధయు వివేకమును బలె, నహహా! ౨౬

క॥ పోయి పరికించి యవ్వై
చాయలవృక్షాలి వ్రాలి సంభవమగు నే
కాయయొ పండో ఫలంబో
యీయీశ్వరుఁ డేదియిచ్చునది కొంచుఁడగన్. ౨౭

క॥ ముక్కులను గఱచికొనుచున్
తెక్కలవడి, గుండెయదటు, ప్రేమాతురతన్
మిక్కిలియు వెల్లడింపఁగ
గ్రక్కునఁజేరుదురు కోటరంబును; నేనున్. ౨౭

ఆ॥ వె॥ వారిరాకఁజూచి నోరుదెఱచుచుందు
నడుమనడుమ నలివు లడరఁజేసి;
అంతలోన శివునుహా నివేదనకాల
ఘంటమ్రోఁగుచుండు గ్రంగుమనుచు. ౨౮

ఆ॥ వె॥ కన్నకడుపుగాన మున్నుగా నాతల్లి
యీశ్వరప్రసాద మిదియటంచుఁ
దియ్యఁబండునోరఁ దినిపించి యంతటఁ
దండ్రికిడుచు వెనుకఁ దానుగుడుచు. ౩౦

గీ॥ ఆవెనుక సంజదనుకద్విజాళి, శివుని
దేవళంబునఁ బరిసరస్థావరములఁ
జేయు శ్రుతిమధురాలాపసేవఁ, బ్రొద్దు
జరుగఁ గన్నులుమోడ్చు మీశ్వరునిదలఁచి. ౩౧

గీ॥ చిన్ననాటిముచ్చట లెంతచెప్పికొనినఁ
దనివిదీఱదుగద పెద్దతనమునందుఁ!
గష్టకాలానఁ బొంటిసుఖంబు లెంతొ
స్వల్పములు సైతమును వచ్చు స్మరణమునకు. ౩౨

క॥ ఆవ్వేళ్లఁదలఁచి కొనఁగనె
యువ్వేత్తుగ గూఁటనుండి యుప్పరమునకున్
జివ్వనఁబాఱెడి ఖగమటు
లవ్వేనుకటి కాలమునకు నాత్మయెగసెడున్. 33

గీ॥ అహాహా! వర్ణింపనలవియే యాసుఖంబు
నావిశాల వినిర్మలజీవనంబు!
ననుభవైకవేద్యమె యదియగునుగాని.
ఈశుఁడెదియిచ్చు నద్దానఁదృప్తినొంది 38

యన్నమును బున్నెమెఱుఁగక యతనిఁగొలిచి
స్వాంతముల సత్పథవిహార చింతదక్క
నొండుచింతలుమాని మే ముందుమల్ల
ప్రమానితొరట ననూనరాగానుబంధ 3౫

బంధురస్నేహసంభృతస్వాంతశాంత
పావనాభ్యాగతద్విజస్వాగతంబె
యూర్జితంబైన వ్రతమయి యొప్పుచుండఁ;
గోటరమునుండి యీశ్వరుగోపురమున 3౬

గోపురమునుండి యశ్వత్థకోటరమున
వ్రాలుచుంటలె తీర్థయాత్రలుగమాకు.

—o—



# వృశ్చికదర్శనము *

---o---

### ఉత్పలమాలిక

పాపపుఁ దేల నీకొక యపాయముఁ జేయనుగాదె యెన్నఁడున్
దీపములేక చీఁకటినిఁ దెచ్చున నొంటిగఁ బోవునన్ను నా
టోపముఁ జూపి యక్కట! పొటుక్కున నొక్కట నంటఁగుట్టి సం
తాపముపాలు సేసితిగదా! యిఁక దారినిఁ గుంటికొంచు నే ౧

ప్రాపున నింటి కేగుదు? విరోధిగతిం బవలంత డాఁగి యీ
మాపటివేళ బైటఁబడి మానిసి యుల్కుడు సేసినంతనే
నీపగ దీర్చుకొంటి విఁక నేరముతోఁ బనియేమి భూమిపైఁ
గాపురుషుం డకారణముగా నపకారము సేయఁగోరినన్ ౨

హా! పరమేశ్వరా! యిదె సహస్రకఠోరకుఠారధారలే
నాపయిఁ బడ్డకైవడి ఘనంబగు బాధకు నగ్గమైతి నా
హా! పరికింపఁ జిత్రముగదా! భవదీయవిలాసవైఖరుల్!
కోపుగఁ గండచక్కెరలు గూర్చిన పాయస మానునోటనే, 3

---

*ఇది 1897 సంవత్సరము నవంబరు నెల జనానాపత్రిక నుండి తిరిగి కైకొనఁ బడినది

వేఁపవిసం బొసంగి మెసవింతువు నీకిది యేమి భ్రాంతియో?
దోఁపదు నాకుఁజూడ సుఖదుఃఖములం దిలతండులస్థితిం
జేపకునట్లుగాఁ బుడమి జీవులకు న్నియమింతు వింతెగా
వాపిరిదీఱ దూరముగ స్వైరముగా నొకసారి స్వారికిన్ ౪

"లే,పద, వేగిరం"బనుచు నిల్వఁగనీయని సంగడీనితోఁ
"నోపికలేని సోకులకు నొప్పవుగా" యని సాంధ్యరాగసం
దీపిత భానుబింబ సముదీరిత కోమలకాంతిపుంజముల్
చూపఱమోముఁదమ్ములను శోభదలిర్ప నటించుచుండఁగా ౫

నేపుననేగి యేగి యుడుకెత్తిన మేనిశ్రమంబుఁ దేపకుం
బైపయి వీచు గంధవహ బంధురమంధరగంధవాహముల్
చోపఁగ, నీటుగుల్కు నొకచోటను రెడ్డిగముల్ రచించి, స
ల్లాపకళాకలాపసుఖలాలసచిత్తతమై నొకింతసే ౬

పాపదలెల్లఁ బాసి నిరపాయసుఖస్థితి నుండి వెండియున్
మేపులుమాని క్రేపులకు మీఱిన కూరిమి క్షీరధారలం
జేఁపఁగ మన్కిపట్టులకుఁ జెచ్చెర నేగెడి గోగణంబుతోఁ
గాఁపురముల్ మెలంకువను గన్నులఁ గట్టినయట్లు గాఁగ "నే ౭

వైపున నెంతసూచినను వాపిరిదీఱదయించుకేనియుం
బాపురె! స్రష్టసృష్టిమహిమం"బని మెచ్చుచు లేచి చెంగటన్
దాపిన రాజమార్గమున నవ్వుచు నింటికి నేగుదెంచు న
న్నేపగిదిన్ శ్రమంపఱచి తేమన వచ్చును వృశ్చికంబ! ని ౮

నోష్ఠపికసేయు మిల్లుగని యొక్కట నీకసవెల్ల సింతు నా
కోపముదీఱగా నకట! క్రూరవిచారము లేల హామ్మ! నా
ప్రోపునఁజేసి యోసివిషపుచ్చపుజంతువ! నీకు సత్కృతి
ప్రాపకమయ్యె నీదయిన ప్రామిడిదుష్కృతి; యేమిసెప్పుదున్. ౯

—o—

# స్త్రీపునర్వివాహమహోత్సవ వర్ణనము *

ఉత్పలమాలిక

శారదచంద్రికారుచుల సారెకుఁ గేరి మతాబు లెంతయున్
మీఱివెలుంగఁ, బౌరజనబృందము లందపుబారులై మహో
దారత నుల్లముల్ సెలఁగ నందలపుంబడి రా హళాహళిన్
భూరినభోంతరంబునను భోరున మ్రోసెడి వాద్యఘోషముల్,

తోరపుఁ గాహళాది ఘనతూర్యరవంబులు వీనులంబడం
బోరిడి యేడ్చు బిడ్డలను బొందుగఁ జంకను బెట్టుకొంచు ని
ద్రారత్ని మూఁతవడ్డ కనుదమ్ముల విప్పుచు నల్లనల్లనం
జేరిక ద్వారబంధముల చెంతల నోరగనిల్చి వేడుకం

* ఇది 1892 సం॥ నవంబరు నెలలో రచింపఁబడి ఆ వెనుకఁ గొన్ని యేండ్లకు జనానాపత్రికలోఁ బ్రకటింపఁబడెను.—

దేశికనంగ నెక్కుడగు దివ్వెలతేజున కొక్కసారిగాఁ
బాఱక మిర్మిటుల్ గొని చివాలున చూపులు జంకవెన్కకుం
బౌరవధూమణుల్ నవవివాహితదంపతులం దలంచి యౌ
రౌర! సెబాసు! చిత్ర! మహాహా! యని నూఁదల లూఁచువారు, వి

డ్డూరము పుట్టె, వర్ణము చెడుం జెడునేమిటి? యింతకే చెడెం
గారణ మిట్లువచ్చెఁ గలికాలమునందని ముక్కుమీఁద వ్రే
ల్గూరుచువారు, మార్మనుము గూడని దాటను శూద్రజాతులుం
గోర రిదెట్లు బ్రాహ్మణులకుం దగెనో! యనువారు, పూర్వకా ౪

చారములందు నాదరము జాఱిన దింకను వారు, పెద్దలై
కూరిమినేమొకన్విడని కూనలకుం దగ బొమ్మపెండిలుల్
నేరక సేసినంతటనె నిక్కపుఁ గూరిమి వెంపనేర్చునే
వారికిఁ బెద్దలైన తరువాత నటంచను వా, రనాథలై ౫

గోరము లందుచున్న మన కూఁతుల దుస్థితిగూడ నిట్టులే
మాఱిన బాగుగాదె యని మానసమందుఁ దలంచువారలున్,
జారిణిమై కులంబపయశంబున ముంచిన సేగిగాదొకో
ఆరయఁగాఁ బునఃపరిణయంబ తెఱంగనువారు, నారికిన్ ౬

ధీరత యింత యొప్పెడునె తెంపవురా! యని మెచ్చువారు, వి
స్తారశుభంబు లంబడసి తామరతంపరమై మనుండటం
చీరసమింతలేక. మఱి యిచ్చును దీవెన లిచ్చువారునై
వేఱుగ నిట్లు భిన్నరుచి వెల్లడిసేయుచు భాషలాడుకో ౭

సౌరభముల్ ఘటించు ఘనసారపటీర హిమాంబుపూరముల్
వారక యెల్లచోట్ల జడివానలు గాఁగను వీడియుంపఁగ న
ర్ఘ్యారపరిమళంబు లగరుంబొగలెంతొ బుగుల్కొనం గనం
గేరుచు గాయకుల్ మధురగీతులఁ బాడఁగ మంగళంబులన్ ౫
స్వైరముగా వధూవరులు పట్టనవీధుల నేగిరంచు నీ
తీరున నాఁటి మాధ్వయువతీమణి రెండవపెండ్లి సుద్దులం
గూరిచినాఁడ మాలికను గోవిదులిచ్చను హెచ్చరింపఁగన్. ౬

# అ మృ త భాం డ ము



గీ॥ రెండునాల్కలఁ బుడమిఁ జరించు పాప
జాతిఁ దలమెత్తనీని విజాతివాఁడు
పలికిన పలుకునకుఁ గట్టువడెడివాఁడు
భువనరక్షకు నిందల మోచువాఁడు. ౧

శా॥ తల్లిన్ దుర్భరదాస్యభారవినతం దాఁజూచి సైరింపలే
కుల్లంబం దమృతంబుఁ దెచ్చియిడి యే నూర్జున్ వెసన్ దీని సం
కెళ్ళంచున్ వెడలెన్ స్వపక్షబలమున్ గెల్పించు ధర్మంబె రా
జిల్లం దోడయి లోకమాన్యుఁడు వయోజ్యేష్ఠుండు దేవాళిపై. ౨

గీ. ఎవ్వరీ దేవత లనంగ? నెచట నుందు?
రేమిసేయుదు? రిది మీర లెఱుఁగవలయు;
లోకమాన్యుఁడు ద్విజరాజు వీఁకమెఱసి
యేమి సేసెను విబుధుల కేమిసెప్పె. ౩

ఆ॥ వె॥ నీకుఁ బాయకుండి నీచేత నిరతంబు
సేవఁ గొనెడివారె దేవతలనఁ;
గన్న మూయకెపుడు నిన్నుఁ గాచుచునుండ్రు
తమ మహత్త్వ మింత తఱుఁగకుండ॥ ౪

శా॥ స్వాతంత్ర్యంబున కెక్కుడై జగతిలో స్వర్గంబు లేదొండు, త
త్స్వాతంత్ర్యామృతపూర్ణజీవనపరుల్ భావింప దేవాంశసం
భూతుల్ మాత్రమెగాక దేవతలరై భూతిన్ వినీతిన్ సువి
ఖ్యాతిన్ స్వైరగతిం జరింతురు సమస్తాశావకాశంబులన్. ౫

గీ॥ యాగములఁ గొంచు మాబలిభాగములను
దత్ఫలముగ దిక్పాల కత్వములనైన
నిడక నశ్వరఫలముల నిడుట మాకు,
నేటి తగవంచు విబుధేంద్రుఁ డేగెనపుగ. ౬

***

గీ॥ సంద్రముల మీఁదుగానేగి చాలదవ్వ
నిలిచె నొకకొండ నెత్తాన బలియుఁ డతఁడు
బడలికను జెందుటను జెక్కవాల్చుకొనను
బేర్చుక్షుధను దామేల్తింపఁ దీర్చుకొనను. ౭

గీ. లోకభీకరంబుగ నాకలోకరాజ్య
లక్ష్మికయి పోరుచుండిరి లావుమెఱయ
సవతి యన్నలతో దేవసంఘమపుడు—
వైరమూల మేకామిష ప్రభవ మెన్న. ౮

తరల॥ ఎచటఁజూచిన నగ్నిపుంతలె యెందుఁగాంచినఁ జిచ్చుటే
ల్లెచటఁ గన్నను బీన్గుపెంటలె యెందు విన్నను బొబ్బలే
యెచటఁ బిల్చిన హేయవాయువె యెందు నిల్చిన ఘోరమే
ప్రచురమయ్యెను, నారకంబుగ స్వర్గలోకము మాఱెనా. ౯

ఆ॥ వె॥ కోటలెల్లఁ బిండి గుండయునయి యగ్ని
గోళములను నేలఁ గూల, గూండ్లు
వదలి చదలఁ బాఱు పక్షులట్లు హతాశు
లగుచుఁ బఱచిరపుడు దిగధిపతులు. ౧౦

క॥ వచ్చినపని వాకిటనే
యచ్చుపడెన్, నిలువఁజెల్ల దలసతనిట; నే
పొచ్చెంబు నెఱుఁగకున్నను
వచ్చును నా మీఁదఁ బక్షపాతపుశంకల్. ౧౧

గీ॥ అనుచు వెనుకమొగంబిడె నప్పు డతఁడు
వీర్యవంతుఁ డయ్యెను గార్యవేదియగుట;
ననువుగా నప్పు డెంతటి యధికులయినఁ
దీవ్రపద్ధతిఁ జొరరుగా తెంపుసేసి. ౧౨

క॥ అతఁ డట్లుమగిడె, మగుడని
జతన మెదురుసూచుచుండ సమయముకొఱకున్;
హితకాంక్షియగుచు విలస
న్మతిమంతుఁడు వేల్పుఁ బెద్ద మగుడని ప్రేమన్. ౧౩

సీ॥ విబుధులై విజ్ఞానవిభవంబుననుశక్తిసంపదల్ గడియించిచాలమించి
సర్వోన్నతంబైనస్వారాజ్యపదమును బ్రాపించిచిరతపఃఫలముగాఁగ
లోకకళ్యాణంబు చేకూర ధర్మమార్గమునఁబాలింపనర్హతనుగాంచి
మీరలొండొరులతోఁబోరాడుదురె మిమ్ము వేడి బ్రదుకువారివిడువకెపుడు

ఆ॥ వె॥ వారివలన భూరిబలిదానములఁ గొంచుఁ
బుష్టిఁగంద్రుగాక పూజ్యులగుచు?
నొకరు సన్నుతింప నొకరడ్డు పోరకుండి;
పొందిపొసఁగి మనుఁడీ పుణ్యులార॥ ౧౪

ఆ॥ వె॥ అని పితామహుండె యనఁదగు నవ్వేల్పు
సంధిసేసె దేహబంధువులకు;
సమయ మిదియె నాకు జననిసందేశంబు
విన్నవించుట కని ద్విజవరుండు. ౧౫

గీ॥ అమరపతి యానతిని సుధర్మాఖ్యసభను
జొచ్చి వినతభావము కరం బచ్చుపడఁగ
మ్రొక్కి యిట్లని పలికె విబుధులు తెప్ప
లార్పకయె తన్నుఁ జూచుచు నబ్బపడఁగ. ౧౬

***

క॥ చిరకాలమునకుఁ గంటిని
సురలార! మిమ్ముఁ భజించు శోభన; మెందుం
జెఱసాలనున్న వారికి
సురపరిచర్యాశుభంబు సులభం బగునే? ౧౭

క॥ తల్లిచెఱలోన నుండఁగఁ
బిల్లలకును జెఱయకాదె? వినత యయిన మా
తల్లి యిదె దేవసభ మీ
రెల్లరు వినుచుండ నన్ను నిట్లాడుమనెన్. ౧౫

క॥ తడవులఁ బట్టియు మిమ్మున్
విడువక సేవింత్రునాదు బిడ్డలు దామె
ప్పుడు వేదవాక్యముగ మీ
నుడివిన నుడువులను నమ్మి నూల్కొను భక్తిన్. ౧౬

గీ॥ విష్ణుపదభక్తినిరతులు విశదయశులు
ఆర్య సమ్మతచరితులు త్యాగశీలు
రఖిల శాస్త్రపురాణేతిహాసవిదులు
నేర్పరులు నాదుబిడ్డలు నీతిపరులు. ౨౦

గీ॥ సునిశితంబైన దూరదర్శనము గలదు
స్వాంతముల సత్పథవిహారచింత దక్క
నన్యచింతలులేని శాంతాత్ము లగుదు
రట్టి వీరికి నకట! యేమనివచింతు? ౨౧

ఆ॥ వె॥ బండిదోలుటయును బండిలాఁగుటయును
బైట గాలిఁబ్రదుకు బ్రదుకుటయును
దివ్యపదవు లివ్వి దేవతలను భక్తి
విడక కొలుచు నాదు బిడలకును. ౨౨

క॥ నేలంటు వదలదే! మీ
పాలనమున భూచరులకు బాలురకుబలెం
గేలూఁత యిచ్చి వీరిం
బోలదొ మీమెత్తునకును మొగిఁ గొనిపోవన్ ? ౨౩

గీ॥ ఆకసమునందుఁ దినుగు, నీరాకరమున
నౌకలట్టులు, మీవిమానంబు లహహా!
కామసంచారసౌలభ్యకారకములు
దూరసామీప్యభేదనివారకములు. ౨౪

ఆ॥ వె॥ జరయు మృతియు మీవశంబులై చనుచుండ
వశుల మయితి మేము వాని కెపుడు ;
నాఁకలియును దృషయు మీకుఁ దీఱిన వయ్యెఁ
దీర్చు మమ్ము మాదు ధృతిఁ గలంచి. ౨౫

గీ. ఈరు ముప్పదిమూఁడుకోట్లేము గూడ
నమితసంఖ్యాకులుగ భూమి యాకసంబు
నిండియుండమె పాలును నీరుఁ బోలె
నీఁగ కాలూన సందు గానీక మనము ? ౨౬

గీ. ఆకసము భూమి యితరేతరాశ్రయంబు
లద్ది లేకిద్ది యిద్దిలే కద్ది శోభ
నొందకుండెడుఁ ; గానఁ దద్యోగఫల మ
ఖండ సచ్చిదానందయోగంబ కాదె ? ౨౭

క॥ మిము విడువనొల్ల మిఁక మా
కమృతత్వం బిడెద మన్న నవిశంక్యగతిన్
మిముఁగూడి గెల్తు మరివ
ర్గము, విల్తుము స్వర్గమో స్వరాజ్యమొ దానన్. ౨౮

క॥ అమృతత్వమె పరమార్థము
సుమహితమగు త్యాగమునను జొప్పడు నని యా
గమములు సెప్పెడుఁ; దన్నిగ
మములన మీపెద్దలాడు మాటలకావే. ౨౯

క॥ జీవధనంబుల డాఁపక
పావకముఖమున మహాహవంబుల మీకై
కావింపమొ బలి "యగ్నిము
ఖావై దేవా" యనుట ప్రకటితము గాఁగన్. ౩౦

మ॥ తపముల్ సేసి ఫలంబుగాఁగ నమృతత్వంబున్ సమార్జించి యీ
చపలాత్ముల్ సములై తముం గొలుచుటల్ సాలింతు రన్భీతిచే
నెపముల్ వన్ని సురల్ మనుష్యుల మహానిష్ఠాగరిష్ఠాత్ములన్
విపరీతంబుగ నిస్సమాధికులఁ గావింపం దలం పొప్పునే? ౩౧

గీ. కడుపు నిండదు కన్నీళ్లు దుడువ మాకుఁ
దామొసఁగు నల్పసౌఖ్యపదవులచేత;
దేవతల, మైనఁ గాకున్న, దేవసముల
మయినఁ గావలదె యమృత మాని మేము? ౩౨

క॥ సరిగద్దెను మాపెద్దలు
సురపతితోఁ గూడి మున్న సురుచిర తేజః
స్ఫురణంబు మెఱయఁ గూర్చుం
డిరికాదే దేవకార్యనిర్వహణచణుల్? 33

గీ॥ అట్టివారల కడుపునఁ బుట్టి, యిట్టి
యప్రమేయ మహారాష్ట్ర మద్వితీయ
వైభవ మన స్తమిత పద్మబాంధవమును
నయిన మీదివ్యసామ్రాజ్యమందు నిలిచి

యుండి మిము భక్తిమెయిఁ గొల్చుచుండి, యకట!
దేవతల, మైనఁ గాకున్న, దేవసముల
మయినఁ గాకుంటి మిది గౌరవావహంబె?
కాదు మాకును—మీకును గాదు కాదు. 34

గీ॥ అర్థకామంబులను స్వధర్మావిరుద్ధ
ముగను బొందను బంధవిముక్తిఁగనను
బ్రతినరుండును గోరు; నీ వాంఛితంబు
దైవదత్తంబు, హృదయసంస్థాపితంబు. 35

గీ॥ న్యాయ్య మిదియాట ననపహార్యంబు మఱియు
నపరిహార్యంబునగు; దీని నడఁగఁ ద్రొక్క—
కరసి వర్ధిల్లఁజేయుట యర్హమగును
ధర్మపరిపాలనక్రియా తత్పరులకు. 36

క॥ వినిపింప నెంతవారము?
వినరె స్వదత్తంబు కన్న ద్విగుణపుఁ బుణ్యం
బును గూర్చుఁ బుణ్యులకుఁ బ్ర
న్ననఁ బరదత్తానుపాలనం బన విబుధుల్. 3౮

క॥ ఇది మాయమ సంప్రార్థన
మిది తద్విజ్ఞాపనం బిదే లోకహితం
బిదె పరమధర్మసమ్మత
మిదె పరమార్థంబు మాకిదే సాధ్యంబున్. 3౯

ఆ॥ వె॥ ఇది సుధర్మయనఁగ నెల్లలోకంబుల
వినుతిగన్న పెద్ద విబుధసభయ
యగుట ధర్మ మిట జయంబు గాంచు నటంచుఁ
దలఁతు మీకు మ్రొక్కి నిలుతు నింక. ౪౦

గీ॥ వినతుఁడై యిట్లు కేల్మోడ్చి ద్విజవరుండు
పీఠము నలంకరింప సంప్రీతి నతని
వేయిగన్నులఁ జూచె నావిబుధవిభుఁడు
స్తిమితదృష్టియ యయ్యె నాదేవసభయు. ౪౧

***

గీ॥ అంత సురపతియనుమతి నంది, దిగధి
పతులు దేవర్షులును బృహస్పతియుఁ బ్రమత
స్వావలంబిత పక్షమ తానుసార
ముగను బలుకఁగఁ జొచ్చి రిప్పగిది వారు. ౪౨

క॥ మరుభూములెల్ల నిర్మల
తరజలభరితంబు లయ్యె ధర యుర్వరయా
నరిబాధ లేద, సురస
త్పరిపాలనమందు సుఖముఁ బడయరె! కుజనుల్! ౪౩

క॥ అమృతంబు ద్రావి కోఁతుల
క్రమమునఁ గుప్పించి యెగసి కప్పలు దుల్లం
జమరెదరో మేడలెల్లను
సమసెదరో పురదనుజుల చాడ్పునఁ జపలుల్! ౪౪

ఉ॥ అన్నమొ వస్త్రమో గృహమొ యన్యమొ పుణ్యమొ పూరుషార్థమో
యెన్నిఘటించుకొండ్రు తమ యీప్సితముం బతి నాశ్రయించి యా
పన్నజనంబు; లెందుఁ బనిపాటులు మానుచుఁ బస్తు లుంటకుం
గన్నులు మోడ్చుకుంటకును గావలెనే సురదానపట్టముల్? ౪౫

ఉ॥ దివ్యశరీరధారులగు దేవతలేడ? మనుష్యులేడ? స్వే
చ్ఛావ్యవహార మెక్కడ? నసంగతముల్ గద యీప్రసంగముల్
భవ్యము లౌ క్రతూత్తమఫలంబులె యింతకు ముందువోలె నీ
యవ్యయలోకమందుఁ బడయంగల రెక్కడు చెల్ల దేమియున్. ౪౬

గీ. అచ్చరలఁ గోరి పెండ్లాడవచ్చు సోమ
పాన మొనరించి భోగింపవచ్చు, మఱియు
నిందు రావచ్చుఁ బోవచ్చు నిలకు మరలి;
యింతకును మించి వేఁడిన నెట్లువచ్చు! ౪౭

గీ. ఐకమత్యంబు గుదుర దనేకవర్ణ
ములు ననేకమతంబులు గలవు వీరి
యందు; మనమిప్డు విన్నవాక్యంబు లరయఁ
బక్షపాతంబు గలవారి పలుకు లేమొ. ౪౮

గీ॥ కనులు తలమీఁదికిని వచ్చెఁ గాళ్లు నేల
మోవ కుండెడుఁ గుండెఁడు ద్రావనిత్తు
మేని; మాకు మాకని తమలోనఁదామ
పెనఁగి బోరగిలం ద్రోసికొనుట నిజము. ౪౯

ఆ॥ వె॥ అమృతమైన విషమె యగు ననర్హుల కీయ
బాలుచేతి కిచ్చు వాలువోలె;
నదియుఁగాక పలుచనయి యెల్లరును ద్రావ
గోలుపోవు మహిమ నీళులట్లు. ౫౦

ఆ॥ వె॥ అమృతపానమునకు నందఱు నర్హులే
యందఱును ననర్హు లనుట తగదు;
కాననోటితోడఁ గాకున్నఁ జేతితో
నైన లేదటంచు ననుపుటొప్పు. ౫౧

ఆ॥ వె॥ మెట్లు లన్ని కడచి మేడపై కెక్కంగఁ
దగునుగాక యొక్కమొగిన యెగుర
నలత్రిశంకుఁ డట్లు లల్లాడుచుందురు
మింటిమంటి నడుమ రెంటికిఁజెడి. ౫౨

ఆ॥ వె॥ వ్రేలుచాఁప మండ వ్రింగవత్తురు వీరి
కసలె చోటువెట్టఁ జూసఁగ దిప్పుడు
కొంచెమిత్తుమేని క్షుధదీఱ కెక్కుడై
బాధసేయు నుభయపక్షములకు. ౫౩

ఉ॥ కొంచెము కొంచెమేయనుచుఁ గోరిక దీఱుచుచుందుమేని యాఁ
కొంచు వృకంబులట్లు పయికొందురు కొందురు సర్వశేషమున్
సంచియుఁగోలఁ గేలనిడి సన్నక సన్నగ సాఁగనంప, నే
పంచలపాలు గావలసి వచ్చునొ యీసురకోటి యయ్యెడన్. ౫౪

ఆ॥ వె॥ కాణయూచి విడిచి కడకడలం బట్టి
తిరుగనేల మనకుఁ దిరియనేల ?
కామితముల నొసఁగు కామధేనువువీడి
గంగిరెద్దుఁ గొన్న భంగి నకట! ౫౫

గీ॥ ప్రొద్దుపొడుపు పోలిక నొకక్రొత్త వెలుఁగు,
క్రొంబగలు సేయఁ బూర్వదిక్కునకు మరలఁ
గానవచ్చెడు నాశలఁ గమిచికొని జ
పానువర్తనాకృతిని నవ్యాహతగతి. ౫౬

ఆ॥ వె॥ దివిజగంగవోలెఁ ద్రిభువనంబులయందుఁ
బాఱవలయు దప్పిదీఱఁ దన్ని
వాసులెల్లఁ గ్రోలవలయు స్వారాజ్యామృ
తంబు ధర్మసమ్మతంబు గాఁగ. ౫౭

***

గీ॥ సభ్యవర్యుల మతములు సంప్రతించి
ప్రభువు చిత్తము మెత్తనివపగ నెఱింగి
దేశకాలపాత్రంబుల తెరువు లరసి
సురగురుం డప్డు కార్యంబు తెలుఁగు దోఁప. ౫౮

గీ॥ మీాయధోగతి వాయుట కేయుపాయ
మొనరు నిరపాయమయి దాని నుత్సహించి
యీామహేంద్రుఁడు సేయింపనెల్లగతులఁ
జూచుచుండు సహస్రాక్షుఁడై చరించి. ౫౯

క॥ పాలించు మీాదువిన్నప,మాలించి,యుదారభావమలరఁగ మీాకున్
మేలెంచెడు,సభ నేఁటికిఁ,జాలించెడుఁబ్రభువు,చనుఁడి సదనములకిఁకన్.

క. అని దేవమంత్రియాత్మస, దనమునకుంగార్యచింతఁదగిలినమతితోఁ
జనియొకనిశ్చయమునకుఁజొ,రనిదయియుదితన్ను గొంత రాయిడి వెట్టన్

క. దేవర్షి యొకఁడు తుదిఁబ్ర,స్తావించిన"దివిజగంగ"తలఁపునఁబాఱన్
భావించి భావికార్యముఁ,గావించె విచారమీాప్రకారముగాఁగన్. ౬౨

క॥ ఈరాదు కోరినంతయుఁ,బోరా దీయకయు నేదొ పోరుడుప్పుటకై
యేరీతి నెంచి చూచిన,గారడమే కాదె నీతికౌశల మనఁగన్? ౬౩

గీ॥ వ్యక్తికెట్టులొ యట్లె రాజ్యంబునకును
ధర్మచింత యవశ్యకర్తవ్య; మయిన
వ్యక్తులకుఁ బోలెఁ దగును రాజ్యంబులకును
ననుసరింప నాపద్ధర్మ మనఁగ నొకటి. ౬౪

క॥ అమృతంబువంటిదే యగు,నమరనదీజలముగూడనది గొనిశుచులై
క్రమతసమర్పితంబధ్యయుదు,రమృతమెతుదిగొనగవీరలనుచునతడెదన్.

క॥తలఁచియొకదివ్యపురుషుని,బిలిచి,యుపాంశునఁబసిండిబిందెఁడుగంగా
జలమతనిఁ బనిచి తేరఁగ,మెలపున ముద్రితముఁజేసి,మీఁదటదానిన్.

ఆ॥ వె॥ అమృత మ స్తటంచు నాపోశనంబు వ
డ్డించునట్లు గురుఁడు వంచనంబు
గాని తెలుఁగు దోఁపఁగాఁ జేతి కందిచ్చె
ద్విజకులేంద్రుఁ బిలిచి ప్రియము నెఱపి. ౬౯

క॥ ఇది పరమపావనముసుమీ,యిదిబంధవిమోచనైక హేతువుసుమీ
యిదియన్యులకునుదుర్లభ,మిదిదివ్యామృతము సేవ్యమెంతయుభక్తిన్.

క॥ఇది దేవతాప్రసాదము,పదిలముసుమి!ముద్రయుగడు భద్రముసుమ్మీ!
కుదురుసెడకుండఁగొనిపొ,మ్మిది సేవింపఁగ ఘటిల్లునెక్కుడుఫలముల్.

***

ఆ॥ వె॥ అనుచు నెత్తికెత్త నంతరంగమున ను
ప్పొంగి యాద్విజకులపుంగవుండు
తెక్కలెగురవయిచి తిప్పునఁ బాఱె ము
క్తాత్మ విష్ణుపదమునందుఁ బోలె. ౭౦

ఆ॥ వె॥ కాశినుండి దొడ్డగంగదిండిని బోలె
మోచితెచ్చె నతిగి మూఁపుక్రుంగ;
మును భగీరథుండు తన పెద్దల విముక్తి
కొఱకు గంగఁ దెచ్చు తెలుఁగు దోఁప. ౭౧

మత్త॥ వచ్చె ధీరుఁడు నాకుమారుఁడు! వచ్చె నాకడ కేదియో
తెచ్చెఁ దల్లికి నిచ్చి భక్తిని దీవనల్ గయికొంటకై!
యిచ్చెఁ కే యమృతంబుఁ బ్రార్థన మిచ్చఁగైకొని వేలుపుల్
వచ్చునే మన కింక మేలుగ బంధమోచన భాగ్యముల్? ౭౨

క॥ అనివార్య సంభ్రమంబులు, మనమున బెనగొనఁగ లోకమాన్యుని దనయ
కుఁడనఁ జేర్చి యడుగు జననికి, వినతుండై వినిచె స్వర్గవృత్తంబెల్లన్.

గీ॥ తానమాడిరి శుభ్రవస్త్రములు గట్టి
రతఁడు నతని యన్నలును బుణ్యాహమును మ
హోత్సవముసేసి యూరేగి రుల్లసిల్లి
రమృతభాండము సమలంకృతముగఁ జేసి. ౭౪

గీ॥ ఇట్లు సద్భక్తిఁ గొనితెచ్చియిడిన, జనని,
ముద్ర సడలించి సమ్మోదముద్రితాస్య
యగుచు వడ్డించె నమృతంబు నగ్రజావ
రజవిభేద మెన్నక యెల్లరకు సమముగ. ౭౫

ఉ॥ కన్నుల నద్దికొంచుఁ దమకంబునఁ గ్రోలెడి సోదరాళి వం
కన్నిగిడించి చూడ్కి "సురగంగ సుఁడీ! యమృతంబుగాదు! నా
కన్నులఁ జూచితిన్ మునుఁగఁ గంటిని గ్రోలితి నెన్నిమాఱులో
మొన్నటిదాఁక! నేఁడదియెమూఁపులుక్రుంగఁగమోచితెచ్చితిన్.

ఆ॥ వె॥ నిజముగా సువర్ణనీరజ స్పర్శమై
పరిమళించు విమల వారి యిది సు
వర్ణకలశి నిలిచి భ్రమకొల్పు మెఱసి మి
ర్మిటులు గొలిపి మీదు దృష్టులకును. ౭౭

ఆ॥ వె॥ వానసీటికన్న స్వచ్ఛమౌ నాకాశ
గంగగాని వేఱుగాదు వినుఁడి
యమృతభాండ మనెడి యానకొల్పి గురుండు
నీళ్ళకుండ దెచ్చి నెత్తిఁ బెట్టె. ౭౮

ఉ॥ తెక్కఁగు ముక్కలయ్యె నమరేశు పురంబుననుండి దీని నే
నిక్కడ మోచి తెచ్చుటకు నింతయు నయ్యె వృథాశ్రమం బహో!
చక్కిలిగింతలం గొలిపె సంతసపెట్టెద మిమ్మటంచు! నా.
తెక్కలికాని నేమనఁగఁ దీఱును? బాలురగా గణించెనో! ౭౯

క॥ బాలురమో! యెఱుఁగఁడోకో, వేలుపుటొజ్జగుచుఁ దద్వివేచనశక్తుల్?
పాలును నీళ్ళను దెలియం, గాలేమో! వెఱ్ఱి వేఁపకాయలో మర్త్యుల్!

క॥ నెపమెన్ని త్రోసిపుత్తురు
కృపణత పయి కెఱుకపడఁగనీక దొరలు, దా
మపహాస్యము సేయుచుఁ, బ్రా
ణపదం బగుదాని విడ మనసు గొలుపమిచే. ౮౧

క॥ దీనత వేఁడిన వచ్చునె?
మానితపౌరుషముచే సమార్జింపఁ దగుం
గాని పురుషార్థమదియే
దైన, నెవరికైన, దైవ మనుకూలింపన్. ౮౨

ఆ॥ వె॥ అఱచి నోరుదెఱచి యత్తెత్తి చూడంగ
నుప్పరముననుండి యూడిపడునె
చాతకంబునోట జలబిందు వట్టు? లి
య్యమృత మొకళు లిచ్చు నట్టి దగునె? ౮

శా॥ నీచేనున్నది నీపెము_క్తి యెప్పుడున్ నిన్నెత్తు నీశక్తి గూ
లోచింపంగ నిమిత్తమాత్రములెయీలోకంబు నం దన్యముల్
సూచించున్ దిశ దిక్ప్రదర్శినివలెం జుక్కాని నీచేతిదే
నీచాతుర్యముఁ జూపి యోడ నడపం దీరంబు నిన్జేర్చెడున్." ౮౪

***

క॥ అని యిట్లు విముఖుఁ డగు ప్రియ
తనయుని గని తాల్మి తనవదన పద్మము నం
దనుక సమయోచితము లిటు
లనునయముగఁ బలికి తల్లి యల్లనఁ దేర్చెన్. ౮౫

ఆ॥ వె॥ పాలొ నీళ్లొ యేదొ వేలుపు లమృతం బ
టంచు నేది యిత్తు రదె యమృతము;
గొంతు దిగకమున్న గుణమీయ లేదంచు
వేగిరింతురయ్య విబుధు లెందు? ౮౬

సీ॥ కొడుక! యభిమానమగు వేడికొనఁగ నీకు
వంశకరుఁడు శ్రీమంతుఁడు ప్రభుతఁ దొల్లి
ద్విజుల కిచ్చి కాశ్యపి నిజస్థిరసమాఖ్య
కుదురు కొలుపుట నీవెఱుంగుదువుగాన. ౮౭

క. మొక్కించుకొన్న వారలు
మ్రొక్కఁగఁ దలక్రిందుగాదె? పురుషుల భాగ్యం
బెక్కరణిఁ దెలియనగుఁ? బై
కెక్కునదియు నిలకు డిగుఁ జుమీ చక్రమటుల్. ౮౮

ఆ॥ వె॥ దివిని విడిచి భువికి దిగుచు మందాకిని
శివుని జడల నడుమఁ జిన్నదగుచుఁ
జిక్కుకొనియెఁ గాని శీతాద్రిపేరిటి
యడుగుమెట్టుడిగదె యచిరముగను? ౮౯

క॥ ధర్మంబె జయమొసంగును
ధర్మమె స్వారాజ్యసంపదయు నొసఁగు నిఁకన్
ధర్మంబె మూల మంతకు
ధర్మే సర్వం ప్రతిష్ఠిత మ్మన వినవే. ౯౦

గద్యము.

ఇది శ్రీకాశ్యపగోత్ర పవిత్ర జనమంచి వంశపావన బ్రహ్మావధాని
తనూభవ మహాలక్ష్మీగర్భ సంపూర్ణభాగధేయ విబుధ
విధేయ వేంకటరామయ నామధేయ
ప్రణీతంబైన నవకుసుమాంజలి
యను మహాప్రబంధము
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---

ఈ శాశ్వతభాండము నందలి మొదటి పదిపండ్రెండు పద్యము లిప్పటికిఁ దొమ్మిదేండ్ల క్రిందట రచింపఁబడెను. తక్కినవి యీనడుమనే, అనఁగా నీగ్రంథము కట్టకడపటి భాగ మచ్చుపడుచుండఁగా, కొంత తొందరగా రచింపఁబడెను.